# శ్రీ దేవల మహర్షి చరిత్ర

## వచన దేవాంగ పురాణం



జ్యోతిషాం జ్యోతి! శివ పరంజ్యోతివమ్మ,
సచ్చిదానంద మయి! జగజ్జనని వమ్మ,
అమ్మ ! చూడాంబ ! బంగారుబొమ్మ ! నిన్ను
హ్రీం శివాయై నమోయంచు నెంతునమ్మ !


కవిరాజు

**కడెము వేంకటసుబ్బారావు,**

**పందిళ్లపల్లి.**

ప్రథమ ముద్రణ 1000 ప్రతులు.
వెల, రూ. **15-00**

రుధిరోద్గారి.
మకర సంక్రాంతి 1984 సం॥

ముద్రణ :
శ్రీ జయలక్ష్మి ప్రింటర్సు. చీరాల.

**ఆంధ్ర సంస్కృతి సంసత్ - వేటపాలెము వారి ప్రచురణలు**

ప్రథమ పుష్పము :- పుణ్య పురుషుడు.
ద్వితీయ పుష్పము :- శ్రీ చౌడేశ్వరీ సుప్రభాతమ్.
తృతీయ పుష్పము :- శ్రీ చౌడేశ్వరీ సుప్రభాతము రికార్డింగు.
చతుర్ధ పుష్పము :- శ్రీ దేవల మహర్షి చరిత్ర.

ప్రతులకు :

**గుత్తి నాగేశ్వరరావు,**
గ్రామాధికారి
వేటపాలెము - 523 187
చీరాల తాలూకా, ప్రకాశం జిల్లా.

కవిరాజు
**కడెము వేంకట సుబ్బారావు,**
పందిళ్లపల్లి
చీరాల తాలూకా, ప్రకాశం జిల్లా.

"క వి రా జు"

## కడెము వేంకట సుబ్బారావు



అర్ధమాత్ర జ్యోతిర్బిందు వందనుండ,
అచ్ఛమైన తల్లక్ష్యార్థ మందుకోన?
అక్షరాద్వైత విజ్ఞాన మమృతగీతి
ప్రస్తరింపనా, విశ్వ స్వరమ్ముతోడ?

# నా విన్నపము



ఇది రాకెట్ల యుగం, కంప్యూటర్ల యుగం. విజ్ఞానశాస్త్ర ఫలితంగా గ్రహాంతరయానం నేడు సాధ్యమైంది. దూరాలు దగ్గరై కాలం వశమౌతోంది. అనేకదేశాలతో ఖండాలతో విస్తరించి ఉన్న భూమండలం ఒకబిందువైంది. రేపో మాపో విశ్వంగూడ ఒక బిందువు కాబోతోంది. ఉదార చరితానాంతు అనిగాక " సమస్తమానవానాంతు, వసుధైవకుటుంబకమ్" అనిగాని, "విశ్వ"వివేకుటుంబకమ్" అనిగాని అనుకొనే రోజులు దగ్గరపడుతున్నాయి. ఈస్థితిలో ఇంకా కులమతాలని ఊగులాడటం వెఱ్ఱితనమే ఔతుంది. కాని అస్తికదృష్టితో చూస్తే విశ్వమంతా దైవసృష్టియే. మనుసంతానం మానవులు. మరి, మానవులంతా సోదరులైతే కులమత వ్యత్యాసాలేమిటి? అనేది ప్రశ్న.- పూర్వం వృత్తుల్నిబట్టి వర్గాలేర్పడి అవర్గాలే కులాలుగా పరిణమించి ఉంటాయి. ప్రతికులంవారు అస్తిక్యభావంతో తమకులాన్ని దైవంతో అంటుగట్టుకొని కథలు చెప్పుకొన్నారు. ఆకథలవల్ల భావితరాలవారు సంప్రదాయ జీవనులై దైవానికి చేరువౌతారు.

ఈదృష్టితోనే 1974 సం॥లో ముద్రించిన "పుణ్యపురుషుడు" అనే పద్యకావ్యంలో దేవాంగులనుగూర్చి కొంతచెప్పాను. 1978లో "శ్రీ చౌడేశ్వరీ సుప్రభాతమ్" వ్రాసి ప్రకటించాను. 1980 మే 15 తేదీన శ్రీ చౌడేశ్వరీ సుప్రభాతాన్ని మిత్రులసహకారంతో మద్రాసులో గ్రామఫోను రికార్డింగు చేయించాము. ఈదేవలమహర్షిచరిత్రను మాకుటుంబ సభ్యులకు కథగాచెప్పి 1980లోనే శ్రీకారం చుట్టాను. నేను ప్రధానంగా సంస్కృత దేవాంగపురాణాన్ని ఆధారం చేసికొన్నాను. ఒకనాటి ధ్యాన సమయంలో మా పెదనాన్న పరిపూర్ణ దర్శనాచార్యులు బ్రహ్మశ్రీ బొడ్డు రోసయ్యగారు మెరపులావచ్చి ఇచ్చిన సూచనల్ని పాటించాను. పురాణం మిత్రునివలెకథలద్వారా ధర్మప్రబోధం చేస్తుంది. శ్రోతల హృదయాలను ఆకట్టుకొంటానికి

అందులో అద్భుతాలు అలౌకికాలు అనౌచిత్యాలు ఉంటుంటాయి. ఈదేవాంగ పురాణంలోగూడ అటువంటివి లేకపోలేదు. పిల్లలుగాని పెద్దలుగాని విజ్ఞానశాస్త్ర దృష్టితో, హేతువాద దృష్టితో ప్రశ్నలు వేస్తుంటారు. వారిప్రశ్నలకు సమాధానాలు అన్వేషించాలి. అంతే గాక, పురాణంలో ప్రకటితంగాక తెరమరుగున దోబూచులాడే విషయాలు కొన్నిఉంటాయి. వాటిని రంగస్థలం మీదికితేవాలి. కావుననే నేటివైజ్ఞానిక దృష్టితో ఈకథను పరిశీలించి ఆధునికీ కరణం చేశాను అనౌచిత్యాలను పరిహరించి చాలవరకు హేతుబద్ధంచేశాను పాత్రపోషణ, పాత్రోచితభాషణ కనపరుస్తూ కథను నాటకీకరణం కావించాను. మూలకథను చెక్కుచెదరకుండ సంప్రదాయ పద్ధతిలో నడిపించాను.

“విద్యా సేవాధురీణ” శ్రీ గుత్తి వేంకటసుబ్బయ్యగారి కుమారులు శ్రీ గుత్తి నాగేశ్వరరావుగారు ఈ గ్రంథ విషయంలో ప్రోత్సాహకు లయ్యారు. కొన్ని ప్రూఫులుదిద్దారు. ఫొటోబ్లాకులు సమకూర్చారు. ఈగ్రంథాన్ని ఆంధ్ర సంస్కృతి సంసత్తు పక్షాన ప్రచురించుటకు సంసిద్ధత ప్రకటించారు. శిష్యులు, భాషాప్రవీణ పట్టభద్రులు శ్రీ పొలుకుల వేంకటసుబ్బారావు M. A., - శ్రీ అంపాబత్తుని ఆదినారాయణ గ్రేడు I తెలుగుపండిట్, - శ్రీ దోగుపర్తి బాలచంద్రమౌళి M. A., - మిత్రులు శ్రీ దోగుపర్తి భైరవమూర్తిగారు గ్రేడు I హిందీ పండితులు నాకన్ని విధముల సహాయపడినారు. శ్రీ జయలక్ష్మి ప్రింటర్సు చీరాలవారు ముచ్చటగా అచ్చువేసి ఇచ్చారు. ఆజగదీశ్వరి అందరిని కటాక్షించుగాక. ప్రాజ్ఞులేవైన సవరణలు వివరణలు తెలిపితే నమస్కార పూర్వకంగా స్వీకరిస్తాను.



గ్రంథకర్త.

## గ్రంథ రచనా ప్రోత్సాహకులు.



తండ్రివలె శ్రీ శివార్చనా తత్పరుడయి
ఎపుడు జాతి సంక్షేమమ్ము నెంచువాడు;
కవుల కాప్తుడు, గ్రామాధికారి, హితుడు,
ఇష్ట సఖుడు శ్రీ గుత్తి నాగేశ్వరుండు



# శ్రీ శివ ప్రార్థన

జ్యోతిర్బిందువవై పరాత్పరుడవై ఓంకార బింద్వంతరా
జ్ఞాతేందిందిర భావమై అమృత కుంభప్రాయ దివ్యాత్మవై
చైతన్యావరణాన విశ్వరచనా సంరంభముఀ జూపుచుఀ
చేతో మోదము పొందు చుందువుగదా, శ్రీరామలింగేశ్వరా !

పరమ పదము కైలాసమే వాసమైన
హృదయ పద్మకోశ జ్యోతి వీవుదేవ !
ధ్యానమున మూర్ధమునకెక్కి ఆత్మబింబ
మగుచు ఆనంద సాగర మగుదు వభవ !

# శ్రీ గాయత్రి

ముత్తెమ్ము పగడమ్ము పుత్తడి నలుపు తె
ల్పయిదు మోములును దృక్త్రయము గలిగి
చంద్రరేఖా దీప్త సౌవర్ణ మకుటముల్
ప్రణవాక్షరామ్నాయ తనువు గలిగి
శంఖ చక్ర గదా కశాంకుశ సుకపాల
కమలాభయాత్త హస్తములు గలిగి
అజప గాయత్రి సోఽహమ్మను శ్వాసయు
అమృత కుండము హృదబ్జమును గలిగి
సప్త వింశతి తత్త్వ విజ్ఞాన సూత్ర
మంత్ర యంత్రాత్మయై వేదమాత యగుచు
దేవల బ్రహ్మ సృష్టియై తేజరిల్లు
అఖిల లోక సావిత్రి గాయత్రి దలతు.

# శ్రీ చౌడేశ్వరీదేవి స్తుతి



౧

శ్లో॥ శ్రీచక్రరాజనిలయాం పరమేశ్వరీం, హ్రీం
బీజాత్మకాం, సకల చిజ్జడ విశ్వబీజామ్
జ్యోతిర్మయీం, త్రిణయనాం శశిఖండచూడాం,
చౌడేశ్వరీం, పరశివాం సతతం నమామి

భావము:- శ్రీచక్రంలో పరదేవతగా ఉన్న శ్రీ చౌడేశ్వరీదేవి ! నీవు హ్రీంబీజమవు సమస్త జడరూప చేతనరూపాలతో ఉన్న విశ్వానికి బీజమవు. మూడునేత్రాలును, చంద్రరేఖా శిరోభూషణమూ కలిగి నీవు దివ్యరూపంతో ప్రకాశిస్తూ ఉన్నప్పటికీ-పారమార్థికంగా జ్యోతిర్మయివై పరశివాభిధానంతో వెలయుచున్నావు. అమ్మా ! నీకు నమస్కారము.

౨

శ్లో॥ దివ్యాంబరా భరణ భూషిత పూర్ణరూపాం
చక్రత్రిశూల వివిధాయుధ యుక్త హస్తామ్
సింహేంద్ర వాహన విహారరతాం స్వతంత్రాం
చౌడేశ్వరీం పరశివాం నతమస్తకోఽస్మి

భా :- దివ్య వస్త్రాలను, దివ్యాభరణాలను ధరించి సంపూర్ణసౌందర్యంతో ఉన్నావు చక్రత్రిశూలాది వివిధాయుధాలు కలిగి చతుర్బాహువులతో ఉన్నావు. సింహవాహనమెక్కి సంచరిస్తూ సర్వతంత్ర స్వతంత్రురాలవై ఉన్నావు. అమ్మా ! చౌడేశ్వరీదేవి! నీకు శిరస్సువంచి మ్రొక్కెదను.

3

శ్లో॥ శ్రీ హంపీ హేమకూటస్థ - గాయత్రీ పీఠదేవతామ్
దేవాంగ మాతరం వందే - సావిత్రీం చిత్కళామయీమ్

భా :- శ్రీహంపీ హేమకూటమందలి గాయత్రీ పీఠాధి దేవతవు. దేవాంగ వంశీయులకు మాతృమూర్తివి. సావిత్రివి, చిత్కళామయివి, అమ్మా, చౌడేశ్వరీదేవి ! నీకు వందనము.

౪

సో౽హం భావ పరంపరా మజపగాం సౌవర్ణ వర్ణాత్మికాం
షట్చక్రోపరి దీర్ఘికాంతర సహస్రారాంబు జాధ్యాసినీమ్
ఆనందామృత వర్షిణీం పరమహంసోల్లాసి కాదంబినీం
చంద్రామాత్మకళాం సదాశివసతీం చౌడేశ్వరీం త్వాం భజే.

భా :- సప్తవ్యాహృతులతో కూడుకొన్న జపగాయత్రివి నీవే. సో౽హం భావమై ఉన్న అజపగాయత్రివి నీవే, సౌవర్ణ వర్ణాత్మికవై సుషుమ్నా నాడీస్పందనతో మూలాధారాది షట్చక్రముల మీదుగా సంచారంచేస్తూ పోయి బ్రహ్మరంధ్రకుండమందలి సహస్రార కమల కర్ణికపై అధివసిస్తావు, పరమహంసలకు పరమాహ్లాదం కలిగేట్లు మేఘమాలవై ఆనందామృతం వర్షిస్తావు, అమృతమయివి. ఆత్మకళవు, సదాశివపత్నివి అగు శ్రీచౌడేశ్వరీదేవి! నిన్ను సేవించెదను.

౫

శ్లో॥ అంబికే ! విశ్వవీణాయాం - మత్ తంత్రీం సజ్జితం కురు
త్వద్గీతికానుసారేణ - మాం తాడయ మహోత్సవే.

భా :- అమ్మా! ఈవిశ్వవీణయందు అనేకతంతువులలో నేనొకతంత్రిని నన్ను చక్కబరచుము ఈ ఆనందోత్సవంలో నీపాటకు సరిపడునట్లు నన్ను మీటుము.

# శ్రీ దేవల మునుబ్రహ్మస్తుతి

సద్యోజాత ముఖాంభోజ - ఫాలాక్షి జ్యోతిరుద్భవమ్
జ్యోతిర్దేవ్యాః ప్రియం పుత్రం - దేవల బ్రాహ్మణం భజే

శివాద్వైత ప్రవక్తారం - ధాతారం సూత్ర వస్త్రయోః
దేవాంగ వంశ కర్తారం - దేవలర్షిం నమామ్యహమ్

ఆమోద పట్టణాధీశం - దేవదత్తా మనోహరమ్
శ్రీ విద్యోపాసకం వందే - గాయత్రీ మంత్రదేశికమ్

నంది ధ్వజాలంకృత బాహుదండం
కర్ణద్వయీ కుండల శోభిగండమ్
వక్షస్స్థలే కానక యజ్ఞసూత్రం
మాణిక్య కోటీర శిరస్కమీడే

ఆనందిధ్వజ దివ్యశూలయుత హస్తాంభోజుడై దుష్టదై
త్యానీకమ్మును ద్రుంచుచున్ సకల శిష్టానీకమున్ బ్రోచుచున్
నానా వర్ణిత వస్త్రసూత్రరచనా నైపుణ్యమున్ జూపుచున్
తానై బ్రహ్మగ వెల్గు దేవల పదద్వంద్వమ్ము భావించెదన్

ఎవని నాల్కపై వాగ్దేవి యెలమినాడు?
ఎవని నేత్రాబ్జములు లక్ష్మికెపుడు నెలవు?
ఎవని సౌందర్య మీశ్వరీ యెచ్చదనరు?
అట్టి శ్రీ దేవల బ్రహ్మనాశ్రయింతు.

# శ్రీ దేవదత్తాస్తుతి

సూర్యానుజాం స్వర్ణ వర్ణాం శుద్ధ సత్త్వగుణాన్వితామ్
శ్రీ దేవలస్య దయితాం దేవదత్తాం భజామ్యహమ్.



# శ్రీ దేవల మహర్షి చరిత్ర

## ఆషాఢమాస అమావాస్య- అమ్మవారి జయంతి

నిర్మల నీలాకాశంలో ఒకమూల దిక్చక్రంనుండి ఒక్కొక్క మేఘశకలం లేడిపిల్లలా గెంతుతూ వస్తోంది. మబ్బులు సంచార జలయంత్రాలలా అక్కడక్కడ తొలకరి జల్లులు చిలకరిస్తూ పోతోన్నవి. అంతవరకు మండు టెండలకు కాగివేగిపోయిన ఎడారి నేలలు కమ్మని మట్టివాసన గుబుల్కొంటూ నాసాపుట తర్పణం చేస్తోన్నవి. ఆకాశ బిందు నిషేకంతో భూదేవి నదీ నద కుల్యా ప్రవాహినీ గర్భాలసయై వివిధతరు లతా గుల్మ తృణ సస్యాదులను ప్రసవిస్తోంది. ప్రకృతికాంత రంగుపూల పచ్చిక పట్టు పచ్చడం మేలిముసుగు వేసికొంటోంది ఒకఉరుము, ఒకమెరుపు, ఒకజల్లు సమస్త స్థావర జంగమ ప్రాణులలో రసోద్దీపనం కల్గిస్తోన్నవి

అది ఆషాఢమాసం. అమావాస్య బ్రాహ్మీముహూర్తం. తూరుపు తొయ్యలి తొరపు పాపటి బొట్టులా వేగుజుక్క పొడిచింది. అంతలో పాలపిడత పొంగినట్లు ధవళిమ తోచింది. మొగలిపువ్వురేకులలా వేకువవెలుగు రేకలు విచ్చుకొంటున్నవి. పూజా మందిరంలో పూల పరపుపై అమ్మవారిని ఆవాహన చేయడం పూర్తిఅయింది.

పెట్టిన పుస్తకం అక్కడలేదు. అలమారలో ఉందేమోనని అవి ఇవి పుస్తకాలు తీసి చూస్తున్నాను. మా పిల్లలు కోట సువర్ణలత.

సువర్ణలక్ష్మి, లక్ష్మీ నారాయణులు, మందార పుష్పగుచ్ఛంలా ఒకచోట చేరిఉన్నారు పెద్దమ్మాయి సువర్ణలత ఏమిటి నాన్నా! వెదుకుతున్నావు? అన్నది. చౌడేశ్వరీదేవి సుప్రభాతమమ్మా! అన్నాను. ఇదిగో నాన్నా! మేము తీసి చూస్తున్నాము, మరి, ఈచౌడేశ్వరీదేవి ఎవరు? ఈమెను దేవాంగులు కులదేవతగా ఎందుకు పూజిస్తున్నారు? అన్నది. ఈ సుప్రభాతం నువ్వెందుకు వ్రాశావు? అన్నది సువర్ణ లక్ష్మి. బొమ్మను చూపిస్తూ ఈమె మన గుడిలో ఉన్న పార్వతీ దేవిలా ఉన్నది. నాన్నా! అన్నాడు లక్ష్మీనారాయణ.

ఆవిషయాలు మీకు తరువాత చెవుతాను అని పుస్తకం తీసి కొన్నాను. చిత్రాసనంపై కూర్చున్నాను. పిల్లలు దగ్గరకు వచ్చి కూర్చున్నారు. సుప్రభాత పఠనమూ, లఘుపూజ పూర్తిచేశాను తీర్థం, ప్రసాదం అందరికి అందించాను. తరువాత పిల్లల వైపు చూచాను వారు తామడిగిన ప్రశ్నల సమాధానం కోసం ఎదురు చూస్తున్నట్లని పించింది. మీరడిగిన వాటికి సమాధానాలు చెప్తాను. వినడానికి సిద్ధంగా ఉన్నారా? అన్నాను. ఆఁ. ఆఁ. చెప్పునాన్నా! అది కథగా చెవితే వింటాము అన్నారు పిల్లలు. నేను చాపపరచి కూర్చోండి అన్నాను పిల్లలూ నేను కూర్చున్నాము. ఇంతలో ఇది గమనించి అర్థాంగ లక్ష్మి నాగమ్మగూడ వచ్చి కూర్చున్నది.

## ప్రపంచం-దైవం-తద్విచారణ

ఊఁ ఇక వినండి మీతో నాతో సమస్త జడ వస్తువులతో వివిధ జీవరాసులతో ఈ ప్రపంచం కనపడుతోన్నది. ఆకాశం, వాయువు, అగ్ని,జలం, పృధివి అనే పంచభూతాలతో రూపొంది ప్రపంచ మనిపించుకొంటోంది ప్రపంచమంటే బాగుగా విస్తరించి విశాల మయ్యేదని గూడ అర్థం. ఇది తనకు తాను అవుతొందనీ,

దీన్ని నడిపించే వ్యక్తి వేరే ఎవ్వరు లేరనీ నాస్తికులంటారు. జడ పదార్థంనుండి చైతన్యం వికసిస్తోందనీ, దీనికి అధిపతి లేడనీ నేటి పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞులు వాదిస్తున్నారు.

అంతరాళంలో నిరంతరం క్రమం తప్పక తిరిగే గ్రహతారా నక్షత్రాల స్థితి గతులూ, ప్రకృతి సౌందర్య పోషకాలైనసూర్యోదయ చంద్రోదయాస్తమయాలూ, కొండలుకోనలు జలపాతాలూ,సరోవరాలు సాగరాలు, పుష్పఫలద్రుమాలు, పక్షులు, అరణ్యాలు వివిధ ప్రాణుల దేహావయవభాగ విభాగ రచనలూ, జీవ చైతన్య దశా విశేషాలూ, ఇత్యాదులన్నీ తమకు తాము కావనీ, దేవుడు చేసినవేయని కొందరం టున్నారు-అయితే లోకంలో తుఫానులు వరదలు అగ్ని పర్వతాల ప్రేలుడులు, భూకంపాలు, కడలి ఉప్పెనలు, వాటివలన కలిగే ఘోరవినాశనాలు, శిశుమరణ జనిత మాతృమూర్తుల ఆక్రందనాలు మాతృహీనులైన అనాధ శిశువుల రోదనలు, జరామరణ వ్యాధులు, మొదలైన వన్నిటినిగూడ అతడే చేసి ఉండాలి గనుక, అతడు దేవుడు గాడు; క్రూరరాక్షసుడని కొందరంటున్నారు.

ఎవరెన్ని ఊహాగానాలు చేసినా, ఎంతెంత వాదించినా యధార్థాన్ని- అందులోని పరమార్థాన్ని ప్రతి ఒక్కరూ గుర్తించి ఆలోచించాలి. ఎదుట విశాల విశ్వమున్నది. నిత్యం ఎదుగు బొదుగు లతో తన శరీరమున్నది. సంకల్ప వికల్పాలతో కలలుకనే మనస్సు న్నది. [illegible]ంచే మేధ ఉన్నది సమతా మమతేత్యాది ధార్మిక భావాలతో, మైత్రి కరుణా, ప్రేమానుబంధాలతో జీవితానికి ఉన్నత ప్రమాణాలు కల్పించే హృదయమున్నది. ఆపైన అన్నిటికినీ ఆధారమై పూసలలో దారంలా నిత్య చైతన్యస్వరూపమై జీవాత్మ ఉన్నది. ఈ జీవాత్మయే శరీరాన్ని తొడుక్కుంటోంది. విడుస్తోంది. దేహభ్రాంతితో సుఖదుఃఖాలను అనుభవిస్తోంది. ఆత్మభావనతో ఆనందంఅనుభవిస్తోంది

ప్రతిప్రాణి 25 తత్త్వాలతో కూడుకొని ఉన్నదనీ,-24 తత్త్వాలు జడ రూపాలనీ, 25వ తత్త్వం జీవాత్మ అనీ అనుభవజ్ఞులు, చెవుతున్నారు. ఆత్మ సత్తా మాత్రం చేతనే ప్రతి తత్త్వం పనిచేయ గలుగుతోన్నది. ఈ ఆత్మజ్ఞానం ప్రతి ఒక్కరికీ అవసరమయ్యే ఉన్నది.

ఆత్మలేని దేహాలకు అస్తిత్వమే లేదు.దేహాదులు పరిమితాలు. పరిమిత వస్తువు పరిమితజ్ఞానాన్ని మాత్రమే కలుగ జేసికొంటోంది. ఆత్మ అపరిమితం. అపరిమితమైనది. అపరిమితజ్ఞానాన్ని కలుగ జేసికొంటుంది. కాబట్టి, అట్టిఆత్మ ద్వారానే సత్యాన్వేషణ సాధ్యం. ఈ విషవలయాన్ని ఛేదించుకొని ఉపనిషదృషులు దైవాన్ని గుర్తించారు. అది నిత్య సత్యమనీ, దానియందే సమస్త విశ్వమూ తేలాడుతోన్నదని గమనించారు. ఇది దేహేంద్రియాలతోగాక, మనస్సుతోగాక, మేధతో గాక, హృదయాత్మలతో మాత్రమే చదువుకొని తెలిసికోవలసిన పర మార్థ సత్యం.

సైంటిస్టులు తమటెస్టు పరికరాలకు అందిన సమాచారాన్ని మాత్రమే యధార్థమంటారు. అందనిది లేదంటారు వారు మనస్సు వరకు ఎదిగి, మేధతో ఆలోచిస్తారు. భౌతికావరణం దాటడం వారి సిద్ధాంతంకాదు తతిమ్మా విషయసామగ్రి తెలిసికోవాలంటే వారు అతిసున్నిత సూక్ష్మతర సూక్ష్మతమ శోధనా నాళికలు సృష్టించు కోవాలేమో!!- ఒకవిషయ్యం రూపాన్ని రూపం చూస్తుంది అరూపాన్ని అరూపం చూస్తుంది.

డార్విన్ మహాశయుని పరిణామవాదం జీవసృష్టి ఏకకణజీవి (అమీబా)తో మొదలై ఇప్పటి మానవ జీవిగా రూపొందినట్లు ప్రకటి స్తోంది. దీనికిజలచరమైన మత్స్యావతారం కొంత నిదర్శనంగా కనపడు తోంది. మన పురాణాల్లోని దశావతారాలకు దీనికి ఏమైన సామ్య

ముందేమోమరి! వేద పురాణాలు వ్యంగ్యార్థ బోధనా విలసితాలు. ధ్వని ప్రధానాలు. ఏదేమైనప్పటికి పిట్టకు పిట్టే పుడుతున్నది గొడ్డుకు గొడ్డే పుడుతున్నది. మనిషికి మనిషేపుడుతున్నాడు. సృష్టి క్రమ పరిణామం పొందుతున్నదనేమాట పాక్షికమే. సృష్ట్యాది నుండి పశు పక్ష్యాదులలో ఏమార్పు కానరావడంలేదు. అప్పుడెట్లున్నాయో ఇప్పుడట్లున్నాయి ఒక్క మానవునిలోమాత్రం శారీరక పరిణామంగాక, చైతన్య పరిణామం కనపడుతోన్నది. ఆదిలో దిగంబరిగా తిరిగిన వాడు మేథతో ఆలోచించి వస్త్రసృష్టి చేసికొన్నాడు. నూలు వస్త్రాలు కట్టాడు, పట్టు వస్త్రాలు కట్టాడు, నైలాన్ టెర్లిన్ వస్త్రాలు కడుతు న్నాడు. మానవుడు ప్రకృతి శక్తులను లొంగదీసికొని అనేకరంగా లలో అభివృద్ధితోపాటు సుఖజీవనం సాధించాడు. కాబట్టి విజ్ఞాన శాస్త్ర పురోగమన ఫలితాల విలువలను త్రోసిపుచ్చడం విజ్ఞతకాబోదు. అన్నిటిని సమన్వయదృష్టితో సమీక్షించడం సహృదయుల లక్షణం.

పదార్థం శక్తిలో ఇముడుతోంది. శక్తి చేతనాత్మలో అంతర్భ విస్తుంది. సూక్ష్మతమమైన చేతనాత్మ వ్యాపకశీలమైనది. పదార్థ రూపమే ఈ ప్రపంచం. ప్రపంచం శక్తి సమన్వితమై వ్యాపిస్తూ స్థూల సూక్ష్మ స్థితిగతులను పొందుతోంది. శక్తికి చిహ్నం ఆదిపరా శక్తి చేతనకు సంకేతం పరమశివుడు పదార్థరూప ప్రపంచ ప్రకృతీ, - శక్తిరూప పరాశక్తీ, - చేతనరూప పరమశివుడు తాత్త్వి కంగా చూస్తే మూడూ ఒక్కటే. వైజ్ఞానికులు పదార్థమూలక పరిశీ లనా పాటవంతో పరమాణు గర్భ విచ్ఛేదంచేసి పరమాద్భుత శక్త్యా విర్భావం కాంచి పరవశులయ్యారు. అదే పరమావధి అని ఆగిపో యారు. పదార్థం శక్తిగా, శక్తిపదార్థంగా పరిణమిస్తుందని తలపోస్తు న్నారు. రెండొక్కటే అని చెవుతున్నారు. కాని, అపైనవున్న చేతన జోలికి వారింకా పోలేదు ఏనాడో భారతీయులు ఉపనిషత్కాల

మందే పదార్థ - శక్తి - చేతనల స్వరూప స్వభావాలను నిశితంగా పరిశీలించి చేతన నుంచే శక్తీ, ప్రపంచమూ వికసిస్తోందని కనుగొన్నారు. ఆ ఆత్మచేతనయందే సమస్త విశ్వమూ సంకోచ వ్యాకోచ రూపస్థితులను పొందుతున్నదని తేల్చారు. చూడండి. మన ఆత్మ చేతన ఉండబట్టే శరీరమున్నది. దానితో జాగ్రదవస్థ కలిగి అమ్మవారిపూజ యనీ, కథ అనీ చెప్పుకొంటున్నాము. స్వప్నావస్థ కలిగి తద్వ్యాపారంలో పడిపోతున్నాము. సుషుప్తి అవస్థకలిగి గాఢనిద్రాస్థితిలో మునిగిపోతున్నాము. జ్ఞానులు ధ్యానయోగంలో పరమాత్మాను సంధానం చేసికొని ఆనందిస్తారు.

ఇవన్నీ జీవచైతన్యం ఉండబట్టే జరుగుతున్నవి. జీవాత్మతో వ్యక్తి శివుడౌతున్నాడు. జీవం లేకపోతే దేహం శవమౌతున్నది. ఆత్మ చేతనలేని దేహం ఏయవస్థను పొందదు. పనిచేయదు. దేనికి పనికిరాదు. కుళ్లిపోయి గబ్బువేస్తుంది. చూచారా? చేతన ఎంత ప్రాధాన్యమైనదో! అంతటికీ చేతనమే మూలమైనదని ఈ పాటికి మీకర్థమై ఉంటుంది.

## దేవాంగ పురాణం

వ్యాసమహర్షి హృదయ వీణా తంత్రులను మీటి అష్టాదశ పురాణాలు ఆలపించాడు అందులో కమనీయ కల్యాణరాగ గీతిక బ్రహ్మాండ పురాణం - దానికి రమణీయ రాగచ్ఛాయ బ్రహ్మనారద సంవాదాత్మకమైన 29 అధ్యాయాల సంస్కృత దేవాంగ పురాణం. ఆదేవాంగ పురాణంలో శ్రుతిపక్వ మధురతానం తొలి రెండధ్యాయాలు. ఆభాగం ఆదిపరాశక్తి భక్తరక్షణకై అవతరించిన శ్రీ చౌడేశ్వరీ దేవి అమ్మవారి కథ.

ఆభక్తుడెవరునాన్నా? అన్నది పెద్దమ్మాయి. దేవాంగజాతికి మూల పురుషుడైన "దేవలబ్రహ్మ" అన్నాను. ఈయనగూడ ఒక

బ్రహ్మ? అన్నది. అవును. విశ్వసృష్టికర్త చతుర్ముఖ బ్రహ్మ అయి నట్లే దేవమానవాది జాతుల మాన రక్షణకు, - అవయవాచ్ఛాదనకు వస్త్రాలను సృష్టించి, బ్రాహ్మణ్యప్రాప్తికై గాయత్రీ సూత్రాలను గూడ సృష్టించి దేవలుడు బ్రహ్మ అయ్యాడు అన్నాను.

ఆదిపరాశక్తి ఆదిపరాశక్తిగా అవతరించక శ్రీ చౌడేశ్వరీ దేవిగా ఎందుకవతరించింది? అని శ్రీమతి ప్రశ్నించింది.

దేవలుడు శివాజ్ఞను శిరసావహించి వస్త్రోత్పాదనకై తంతువుల (నూలు) ను సంగ్రహించి వస్తున్నప్పుడు రాక్షసులు దారి నడుమ అడ్డగించారు. మారణాయుధాలతో మీదపడ్డారు. దేవలుడు తనరక్షణ జగద్రక్షణ అయి ఉన్నందున అంబను ప్రార్థించాడు. ఆదిపరాశక్తి సూర్య ప్రభాభాసమానమైన దివ్యచూడ (కిరీట)ముతో అవతరించి రాక్షసులను చంపి దేవలుని రక్షించింది. అప్పుడు బ్రహ్మాదిదేవతలు జయజయధ్వానములు చేస్తూవచ్చి దివ్యచూడా కాంతులకు చకితులై అమ్మవారిని చూడాంబ, చౌడేశ్వరి, చాముండీశ్వరి అని కీర్తించారు. ఆదిపరాశక్తి ఆదిపరాశక్తిగానే అవతరించింది. చకచ్చకిత కాంతిమయ కిరీటాన్నిబట్టి "చౌడేశ్వరి" అని ప్రత్యేక నామం ఏర్పడ్డది. దేవాంగులు ఆ నామాన్నే స్వీకరించారు. అన్నాను. నాన్నా! ఈకథ మొదటినుండి వివరంగా చెప్పమన్నది చిన్నమ్మాయి. వినండి అన్నాను.

## ప్రథమాధ్యాయం - కథాప్రారంభం - సృష్టిపూర్వస్థితి

సృష్టికి పూర్వం భూమిలేదు; ఆకాశములేదు; కాలంలేదు; దేశం లేదు; పాత్ర (వ్యక్తి)లేదు. ఏకమూ, అద్వితీయమూ, అఖండ పరిపూర్ణ చేతనామయమూ, స్వయంప్రకాశమూ అయిన పరంజ్యోతి పరమ శివస్వరూపమై వెలుగుతోంది. ఆపరమ శివునిలో భావ

స్పందన కలిగింది, ఆస్పందన క్రమంగా ఒక ఊపూ, వేగమూ అందుకొని ఆదిపరాశక్తిగా రూపొందింది. కాగా, చిన్మయునికి శక్తి తోడయింది, చిత్తు శక్తి రెండూ మిథునమై రాగరసలీలా కేళి తేలారు.

ఈ ప్రకృతి పురుషుల సంయోగంవలన శివాంశతో క్రమంగా రజోగుణ ప్రధానుడై చతుర్ముఖ బ్రహ్మ ఆవిర్భవించాడు. అట్లే సత్త్వగుణ ప్రధానుడై మహావిష్ణువు ప్రభవించాడు తరువాత తమోగుణ ప్రధానుడై మహేశ్వరుడు (రుద్రుడు) సముద్భవించాడు.

ఆదిపరాశక్తి అంశముతో క్రమంగా సరస్వతి జన్మించి బ్రహ్మకు సతీమణి అయింది. అట్లే లక్ష్మి జనించి విష్ణువునకు గృహలక్ష్మి అయింది. తరువాత పార్వతి కలిగి మహేశ్వరునికి అర్ధాంగి అయింది

నిరతిశయ నిరుపమాన మోక్షానందమైన నివృత్తి దశలో నుండు పరమశివుడు ప్రాపంచిక రూపప్రవృత్తిలో త్రిమూర్తులు కావడం ఆయన లీలావిలాస ఖేలనం మాత్రమే. అట్లే ఆదిపరాశక్తి ముగురమ్మలు కావడం గుర్తింపదగినది అందులో శివశక్తిద్వయం ఉమామహేశ్వరులుగా రూపాంతరం చెందడం ఒక ప్రత్యేకవిశేషం. అయినా, అంతా శివస్వరూపమే; శివమయమే. కదలక ఒకటై ఉన్నది. కదలి నానారూపాలు పొందింది. ఇది చైతన్య జన్య భావ రూపకళా కలాపం. సమస్త రూపారూప విశ్వస్వరూప సాక్షాత్కారం.

మూలచేతనా సుధాస్రోతస్వినీ ధారాభిషిక్తుడై బ్రహ్మ సృష్టి కారకుడై విశ్వరచనకు ఉద్యమించాడు. అట్లే విష్ణువు స్థితికారకుడై పోషణబాధ్యతను స్వీకరించాడు. మహేశ్వరుడు గూడ లయకారకుడై సర్వసంహార సంరంభ సంభారకుడయ్యాడు. అన్నిటికి ద్రష్టయై

సాక్షియై అంతస్సూత్రమై పంచవదనుడై పరమ శివుడు మహేశ్వ రునిలో ఉన్నాడు. అట్లే ఆదిపరాశక్తి పార్వతిలో ఉన్నది.

బ్రహ్మ నివాసం సత్యలోకం. విష్ణునివాసం వైకుంఠం, శివుని నివాసం కైలాసం. వీరు తమతమ లోకాలలో ఉంటూ కర్తవ్యాం శాలను నిర్వర్తిస్తుంటారు అన్నాను. కోట సువర్ణలత అందుకొని నాన్నా! ఈలోకాలు ఎక్కడున్నాయి, వాటిని తెలిసికొనే అవకాశా లున్నాయా? అన్నది. నేను ఆలోచనలోపడ్డాను. చిన్న పిల్ల అయినా, ప్రశ్న జటిలమైనది. సమాధానం చెప్పాలంటే పురాణంతో విజ్ఞాన శాస్త్రాన్ని జోడించవలసి నట్లున్నది. అమ్మాయి! ఆలోకాలు మన భూలోకంవంటివి కావు. భూలోకం, మర్త్యలోకం, చావుపుట్టుకలతో ఉంటుంది. అవి ఈ భూలోకం కంటె ఉన్నతమైనవి; ఉత్తమమైనవి; అమృతత్వ సిద్ధిని పొందినట్టివి. ఆలోకాలకు భూలోకానికి పూర్వకా లములో సంబంధమున్నట్లు పురాణాలు చెబుతున్నవి. ప్రస్తుత కాల ములో సంబంధాలులేవు. యుగాలు మారడంవలన జ్ఞానక్షేత్రం వికృతమౌతుందంటారు. ప్రళయాలవలన లోకాలస్థితిగతులు తప్పి మారిపోతాయంటారు, అజంతా గుహాకుడ్య శిల్పరచనా కౌశలం, వర్ణచిత్ర రచనాకౌశలం ఈనాటి శిల్ప చిత్రకారులకు లేదుకదా; కాబట్టి, ఊర్ధ్వలోకాలకు భూలోకానికి మధ్యనున్న జ్ఞానసేతు వేదైనా విచ్ఛిన్నమైనదేమో! ప్రస్తుతం ఆలోకాల గుర్తింపుగాని, అచటికి వెళ్లే వసతులుగాని ప్రస్తుతం లేనేలేవు.

ఏదేమైనా బ్రహ్మను ఒక వ్యక్తిగా కాక, సృష్ట్యారంభదశగా భావిస్తే ఈ చిక్కుముడి విడిపోతుంది. సుషుప్తి అవస్థాభిమాని (ప్రాజ్ఞుడు) హిరణ్యగర్భుడు. హిరణ్యగర్భుడు బ్రహ్మ. ఆ బ్రహ్మ దేవుని హృదయాకాశంలో భావరూపబ్రహ్మాణువు ప్రేలిబ్రద్దలయింది. బ్రద్దలైన ఆతేజోగోళాలు రగిలి పగిలిన చిచ్చుబుడ్డి రవ్వల్లా చివ్వున

పైకెగసి దూరదూర ప్రాంతాలకు దూసికొని పోయినై. అవే జ్యోతిర్వీధులు, జ్యోతిర్మేఘాలు, నక్షత్రాలు, తారాగ్రహాలు, ధూమకేతువులు మొదలైనవి.

పాలపుంత అనే నక్షత్రవీధిలో మన సూర్య కుటుంబమున్నది. భూమి చంద్ర సూర్యగతులను బట్టి కాలమేర్పడి దివారాత్రాలు, పక్షాలు, మాసాలు, ఋతువులు, అయనాలు, సంవత్సరాలు కలుగుతున్నాయి. భూగోళ కాల దివారాత్రాలు చంద్రగోళ కాల దివారాత్రాలకు సరిపోవు. దేనికాలం దానిదే. కాలబంధితమై లోకాలు జీవిస్తున్నవి. అనంతకోటి బ్రహ్మాండాలున్నట్లు పురాణాలు చెపుతోన్నవి. అందులో చతుర్దశ భువనాలు పరిగణన లోనికి వచ్చాయి ఆ పదునాలుగింటిలో భూర్భువాది సప్తలోకాలు, భగవత్ కళా విలసితాలుగా గాయత్రీ మంత్రం ప్రబోధిస్తున్నది. ఇదంతా నిగూఢమైనది గనుక ఈ చర్చ ముగిస్తున్నాను. అన్నాను. పెద్దమ్మాయి సువర్ణలత నాన్నా! బ్రహ్మదేవుడు సృష్టికర్త అని చెప్పావు గదా! ఆయన విశ్వాన్ని సృష్టించిన విధం చెప్పమన్నది.

## - బ్రహ్మదేవుని సృష్టి -

సరే వినండి అని ప్రారంభించాను. సృష్టికారకుడైన చతుర్ముఖ బ్రహ్మ విశ్వరచనకు ఉపక్రమించాడు. బ్రహ్మయొక్క చేతనాకాశం నుండి భూతాకాశం ప్రభవించింది. ఆకాశంనుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలం, జలంనుండి పృథివి, పృథివినుండి ఓషధులు, ఓషధులనుండి అన్నం, అన్నం నుండి జీవి ఆవిర్భవించాయి, స్థావరజంగమాత్మకమైన జీవులు అనేకంగా విస్తరించాయి. ఆ జీవులు జలచరాలనీ, భూచరాలనీ, గగనచరాలనీ ముత్తెరగులుగా గుర్తింపబడ్డవి.

అందులో సత్త్వగుణ సంపన్నులైన దేవతలు అత్యంత చేతనా వికాసంతో మహితాత్ములై జీవిస్తున్నారు. రజోగుణ ప్రవిష్టులైన మానవులు ఉన్నత చేతనాకక్ష్యలకు ఎగబ్రాకుతూ సృష్టికి ప్రతిసృష్టి సాగిస్తున్నారు. తమోగుణోద్రిక్తులైన ధానవులు బలదర్పాలు ప్రదర్శిస్తూ ఎదుటివారికి భీతావహం కల్గిస్తున్నారు. అని ఇంకేదో చెప్పబోతున్నాను. పెద్దమ్మాయి అడ్డుతగిలి నాన్నా! నేటి విజ్ఞాన శాస్త్రం ఏక కణజీవియైన అమీబాతో జీవసృష్టి ప్రారంభమైనట్లు చెవుతోంది. పరిణామవాదం వానరజాతుల నుండి నరుడు రూపొందాడని చెవుతోంది. నీవు ముందు దేవతలను గూర్చి చెవుతున్నావే మిటి? అన్నది. నాకు చిరునవ్వు వచ్చింది. అమ్మాయీ! ముందు జీవ సృష్టి జరిగిందని చెప్పానుగదా! ఆజీవుల్లో దేవతలు ఉత్తము లని చెప్పాను. భగవంతుడు వినోద లీలకై విశ్వసృష్టిచేశాడు అన్న ప్పుడు ముందు దేవతా సృష్టి జరిగితే మాత్రం తప్పు కాదుగదా! కుమ్మరి తనసారెమీద మట్టివేసి ముందు పెద్ద కుండలు చేస్తాడు. మట్టి తరిగిపోతుంటే చివరిలో చిన్నవిచేస్తాడు. పురాణాలు ఈపద్ధతి అనుసరిస్తాయి. ప్రకృతమనుసరామః పాయసం భక్షయామః

ఏదో విధంగా బ్రహ్మసృష్టి జరిగింది. గ్రహతారా నక్షత్ర మండలాలు రూపొందాయి. సూర్య కుటుంబంలో భూమి, - భూమి మీద కొండలు కోనలు, నదీనదాలు, సాంద్రారణ్యాలు, సాగరాలు చరాచర జీవరాసులు ఆకృతి వహించాయి; అట్లే యితరత్ర దేవ లోకాలేర్పడ్డాయి దేవజాతు లేర్పడ్డాయి. ఆ జీవరాసులలో పశు పక్ష్యాదులు ఎదుగుతూ దేహాభిమానంలేక, సిగ్గు తెలియక అట్లే జీవి స్తున్నాయి. బుద్ధి జీవులైన దేవజాతి మానవ జాతి రాక్షస జాతి, స్త్రీ పురుషులకు వయస్సు వచ్చేకొలది ప్రకృతి సిద్ధంగా దేహాభి మానం, జననావయవస్పందనం కలుగజొచ్చింది. వారికి దిగంబర సంచారం లజ్జా హేతువై అసహ్యంగా పరిణమించింది. మొదట

చేతులతో మర్మావయవ గోపనం చేసికోసాగారు. అది అన్నివేళల సాధ్యంకాదు గనుక భూర్జ పత్రాదికమైన ఆకులు అలములు అడ్డం పెట్టుకోసాగారు. జంతువుల తోళ్లు అడ్డంపెట్టుకోసాగారు. కొందరు ఏ పరికరాలులేక దిస్స మొలలతో గోగణంలా తిరుగుతున్నారు మానరక్షణకు మార్గంలేక వారి మతులు చితులై మండుతున్నాయి.

సురజాతి అసురజాతి నరజాతి స్త్రీ పురుషుల నగ్నరూప సంచారాలకు బ్రహ్మ ఎంతో బాధపడ్డాడు. ఒక గృహంలో కుటుంబ సభ్యులు సరియైన శరీరాచ్ఛాదనలులేక, లజ్జాకుంచితాంగులై వివర్ణ వదనులై జీవనం సాగించడం చూచి మిక్కిలి పరి తపించాడు. మూతికైతే మేతపెట్టి క్షుద్బాధ తీర్చాడు. అంగాచ్ఛాదనకు అవసరమైన పరిచ్ఛదం కల్పించి సిగ్గుబాధ, శీతాతపబాధ తీర్చలేక పోయాడు అందుకు బ్రహ్మ సిగ్గుటగ్గిలో చిమిడి పోయాడు. తన సృజన వ్యాపారం సంపూర్ణంకాక, అరగొర అయిపోయిందని వాపోయాడు. లోకుల మాన రక్షణకు మార్గం తనకు తోచడంలేదనీ, ఈ ముడిని విప్పి పరిష్కారమార్గం చూపించగలవాడు ఒక్క పరమ శివుడేయనీ తల పోశాడు.

## బ్రహ్మ రజతగిరికి ప్రయాణం

భూలోకానికి ఊర్ధ్వంగా ఉన్నది స్వర్గలోకం. స్వర్గలోకానికి అత్యుచ్ఛ్రాయమై ఉన్నది సత్యలోకం, సత్యలోకాధి పతియైన బ్రహ్మ తనకు అత్యున్నతమై నిర్వాసనా మౌన ముద్రా వరిష్ఠులకు పరమ ప్రాప్యమై పరమశివా వాసమైన కైలాసమునకు హంస వాహనా రూఢుడై బయలుదేరాడు.

ఇచ్చట బ్రహ్మ పరమపద కామ్య సాధకుడు. హంసయే శ్వాస అది సోఽహంభావ పూరక కుంభక రేచక ప్రాణాయామ సాధన.

మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక చక్ర సంచారంతో అధః కుండలినీ జాగరణమైనది అది మరల అనాహత విశుద్ధ ఆజ్ఞాచక్రసంచారంతో ఊర్ధ్వకుండలినిగా రూపొంది ఫణామణి ఛటాచ్ఛచ్ఛవులతో పురోగమించి సహస్రార కమలాంతర దివ్యచేతనాజ్యోతికి గొడుగు పట్టింది. గంగా యమునా సరస్వతీ సంగమమూ, త్రికూట స్థాన భంగిమమూ అయిన భ్రూమధ్యంలో వింత కాంతిరేఖలు ప్రసరించాయి. తారకయోగం సిద్ధించి వెలుగు ముద్ద వెండికొండ శిఖరం సాక్షాత్కరించింది. హిరణ్యగర్భుడు వినయ వినమితోత్త మాంగుడై చేతులుమోడ్చి గిరికి ప్రదక్షిణంచేశాడు అచటి సిద్ధగణాల పరిచయ భాగ్యంతో మొగసాలనున్న నందీశ్వరుని ప్రసన్నుని కావించుకొని అనుమతిపొంది స్తుతిపాఠ ప్రవచనాలతో పరమశివుని చేరవచ్చాడు.

ఆసమయంలో స్వామి పంచముఖాభి రాముడై ఉన్నాడు. మొదటిది సద్యోజాతముఖం, పూర్వదిశాభిముఖమై ఋగ్వేదం గానం చేస్తోంది. రెండవది వామదేవముఖం, దక్షిణదిశాభి ముఖమై యజుర్వేదం గానంచేస్తోంది. మూడవది అఘోరముఖం, పశ్చిమ దిశాభిముఖమై సామవేదం గానంచేస్తోంది. నాల్గవది తత్పురుష ముఖం, ఉత్తర దిశాభిముఖమై అధర్వవేదం గానంచేస్తోంది. ఐదవది ఈశానముఖం, ఊర్ధ్వాభిముఖమై ప్రణవవేదం గానంచేస్తోంది. ఈవిధంగా పరమశివుడు పంచ బ్రహ్మాత్మకుడై పరబ్రహ్మస్వరూపుడై ప్రకాశిస్తున్నాడు.

ఎదుట భృంగీశ్వరుడు మణిమయ పద్మశిల్పంపై నిల్చి కర చరణాద్యవయవాభినయాలతో బహువిధ నాట్యభేద ప్రక్రియలు ప్రదర్శిస్తూ జీవస్పందనం, ఆత్మానందం కల్గిస్తున్నాడు. శివపార్వతులు పర్యవేక్షిస్తూ శిక్షణ ఇస్తున్నారు. ఏకాదశరుద్రులు. ప్రమథ గణాలు, బ్రహ్మర్షులు, దేవర్షులు, దిక్పాలకాది దేవతాగణాలు, అప్సరోంగనలు తత్రత్యులై దర్శిస్తూ పరవశులై ఉన్నారు.

నాలుగు మోముల వేల్పు చొరవతో ముందుకువచ్చి అయిదు మోముల వేల్పు అడుగుదమ్ములపై వేయిరేకుల తామర పువ్వులు చేర్చి, కొబ్బరి బొండ్లాలు, తాంబూలం చేతికందించి ప్రణమిల్లి ఇట్లుస్తుతించాడు.

—— మత్తేభ కంద పద్యద్వయ గర్భిత సీసపద్యం ——

సీ॥ సు-గతి జూపించెడి జ్యోతివైతివిగదా!
కల్మాష విధ్వంసకా, - మహేశ!
వి-తత విజ్ఞాన వివేక వర్ధిత మహా
తత్త్వార్థ లక్ష్యప్రదా; - మహాత్మ!
మ-హిత మౌనీంద్రుల మానసాబ్జములలో
భృంగమ్ముగా నుందువే కపర్ది!
ప్ర-కృత కైలాసము పైన తాండవ కళా
లీలన్ ప్రదర్శింతువే - అయాప్తి

తే॥ నగము తనువందు నిల్చియు - జగములకును
సొగసులెల్ల సాధించెడి సో-యగముల
కామకళకు కా-నుగవికి కడిమి విరుల
నిడి మనసున గొలిచెద - నెంతేని భక్తి

తే॥ హ్రీం నమశ్శివాయైయని ఓం నమశ్శి
వాయ యని లోక సవితల భక్తిగొలుతు;
నిత్య నవయౌవనాంగులు నిరుపమాన
సుందరులు కటాక్ష శ్రీల సొగయువారు

పార్వతీ పరమేశ్వరులు ప్రహర్షోత్కర్షులై బ్రహ్మకు స్వాగతం చెప్పి ఆసనం చూపించారు. బ్రహ్మవచ్చి అర్ధాసనమున అధివసించాడు. పరమశివుడు మందస్మిత సుందర వదనారవిందుడై పద్మాసనా! నీకును, నీకుటుంబంవారికిని, నీ సృష్టి వ్యాపారానికీ

క్షేమమా? అన్నాడు. పరమేష్ఠి ముకుళిత కర కమలుడై దేవా! సర్వాంతర్యామివి, సర్వజ్ఞుడవైన నీకు తెలియని దేమున్నది? బాలకుని నోటి తొక్కుపలుక్కులు వినాలని నన్ను ప్రశ్నిస్తున్నావు నీ కరుణామృత వృష్టిచేత మేము క్షేమమే. కాని, నాసృష్టిలో బుద్ధిజీవులైన ప్రజలు శరీర మర్మావయవస్పందన తెలిసి, సిగ్గుతెలిసి దిగంబరతా స్థితి దుస్సహమై దుఃఖాత్ములై ఉస్సురుస్సురంటున్నారు. సరియైన దేహాచ్ఛాదనకై ఎదురు చూస్తున్నారు. జీవుల సర్వేంద్రియాలకు యోగ్యమైన భోగ్యమైన తత్తద్విషయ సామగ్రుల సంతరించాను. కాని, మర్మావయవగోపనానికి అలంకారప్రాయమైన వస్త్రాచ్ఛాదన కల్పించ జాలకున్నాను. అదెట్లో నాసృజన శక్తికి సాధ్యం కాకున్నది. ఈ విషయంలో నామేధ మొక్కపోయింది. అనుగ్రహంతో ఈసమస్యను పరిష్కరించి అంతా చక్కబరుస్తావనే ఆశతో వచ్చాను అన్నాడు.

ఆ మాటలకు అర్ధనారీశ్వరుడు పకపక నవ్వుతూ అబ్జసంభవా! అఖిలాండకోటి బ్రహ్మాండాలతో చరాచర జీవరాసులను సృష్టించి· బుద్ధిజీవి లజ్జా నివృత్తికి ఒక వస్త్రాన్నికాని, ఒక వస్త్రకారుణ్ణిగాని- సృష్టించజాలనంటున్నావు ఋతువు కల్పించి, ప్రేమ ఉదయింపజేసి సహజ సృష్టి వ్యాపారం కొనసాగిస్తున్నావు భావ వాహికతో మిథున మేళనంతో సూత్రబద్ధమై సర్వమూ నీకు సంపన్నమై ఉన్నది· తాళంచేసి తాళంచేయి చేయకుండరాదు కుండ చేసి మూతచేయకుండరాదు. ఇంటికి తలుపులేకుండ ఉండడమెట్లయ్యా? ఆలోచించు. వస్త్రంలేకుంటే లోకం నిందితమౌతుంది. బుద్ధిని ఉపయోగించి వస్త్రోత్పాదన చేయి. లేదా, వస్త్రకారసృష్టి అయినాచేయి అన్నాడు.

బ్రహ్మ వినయ వినమిత గాత్రుడై స్వామీ! నేను చేయజాలినదీ, చేయజాలనిదీ నీకు తెలిసియే ఉన్నది. నాహృదయాకాశంలో

సూత్ర వస్త్రకార సంబంధమైన వాసనా బీజాలుగాని, సంస్కార బీజాలుగాని లేవు. నీవు సర్వలోక పవిత్రమూర్తివి, సూత్రకర్తవు. గాయత్రీ మంత్రాధి దేవతవు. మంత్రవాచ్యార్థ లక్ష్యార్థమవు. సర్వాధి కారివి. కేవలం నీసృజనేచ్ఛ మాత్రమే నా యందు ప్రతి ఫలించింది తత్కారణంగా నా వలన ఈ సృష్టి జరుగుతున్నది. నేను నిమిత్త మాత్రుణ్ణయి అన్నిటిని సృష్టిస్తున్నాను. సర్వేశ్వరా! ఎందువల్లనో సూత్ర వస్త్రకారాణువులు నీ నుండి నాకు సంక్రమింపలేదు. అందు వలన వస్త్రోత్పత్తి నా వలన కాకున్నది. మహాప్రళయం సంభవింపని పూర్వ సృష్టియుగాలలో మను బ్రహ్మ అనువాడు దేవతలకు వస్త్రాలను, యజ్ఞోపవీతాలను నిర్మించి, ఇస్తుండేవాడని శ్రుతిమాత చెపుతున్నది ఆ మహర్షి సత్తముడు అంత్యకాలములో నీయందు సాయుజ్యమోక్షం పొందాడట. లోకహితార్థం, లోక సుఖార్థం, లోక గౌరవ సంపాదనార్థం వస్త్రకారుడైన ఆమహాభాగుని పునస్సృష్టి కావించు. లోకుల మానరక్షణ కావించు. నేను నీపరివారంలోని వాణ్ణి. నీవాజ్ఞాపించిన పని నా ప్రజ్ఞ కొలది చేస్తున్నాను. నాసృష్టి వ్యాపారంలో దొరలిన దొసగులను సరిదిద్ద వలసినదని ప్రార్థిస్తు న్నాను. అన్నాడు.

కోట సువర్ణలత నవ్వుతూ వాన్నా! బ్రహ్మ, శివుడు ఇద్దరు వస్త్రకారుణ్ణి నీవు సృష్టించు; నీవు సృష్టించు అంటూ వాదాలకు దిగారు. అప్పటికి ముందు వస్త్రకార సృష్టి లేకపోవుటచేత వస్త్రం లేనట్లేగదా? ఆ ఒడ్డోలగంలో కొలువుదీరి ఉన్నవారికి శరీరాచ్ఛా దనం ఉన్నట్లా? లేనట్లా? బ్రహ్మ పుట్టినప్పటి నుండి శివుని ప్రార్థించే నాటివరకు ఆబ్రహ్మకు వస్త్రమున్నట్లా? లేనట్లా? మొట్ట మొదట పరంజ్యోతి శివుడైతే ఆశివునకు వస్త్రముందా? ఆ శివుని ప్రక్కనేవున్న అమ్మవారికి వస్త్రమున్నట్లేనా ? చెప్ప మన్నది. చెప్పండి అన్నట్లు శ్రీమతి ప్రశ్నార్థకంగా చూచింది ఆ ప్రశ్నల

వర్షానికి క్షణం స్తంభించిపోయాను. ఆ మౌనవ్రతంలో ఆత్మోప లబ్ధి కలిగింది. కేంద్రాగ్రరేఖ శబలితమై తరంగితమైంది. మనస్సులోనికి ఒకభావం మెరపులా మెరసింది ఇదిగో సమాధానమన్నాను.

అమ్మాయీ ! పరమశివుడు సర్వలోక పవిత్రదేవత, సూత్ర కర్త, గాయత్రీ మంత్రాధిదేవత, సర్వతంత్ర స్వతంత్రుడని బ్రహ్మ వర్ణించి ఉన్నాడుగద! అంతేగాక, ప్రళయానికి పూర్వం పూర్వ సృష్టియందున్న ఒక వస్త్రకారుడు అంత్యకాలంలో శివునియందు సాయుజ్యముక్తి నందాడనిగూడ బ్రహ్మ చెప్పిఉన్నాడు. వస్త్రకార రూపం శివునియందు లయించి ఉన్నందున తద్రూపశక్తి ఆయన యందున్నది. అందుచేత సర్వతంత్ర స్వతంత్రుడైన శివుని సంకల్ప మాత్రాన దివ్యవస్త్రోత్పత్తి జరుగుట సహజమే. అలంకార ప్రాయ మైన అట్టి వస్త్రంతో ఆయన అవతరించాడు. అట్లే ఆయన నుండి వచ్చిన పరాశక్తి రూపొందింది. బ్రహ్మాదులు రూపొందారు. శివ లోక వాసులైన ప్రమథులు రూపొందారు. ఇచట దిగంబరత్వానికి ఆస్కారమే లేదన్నాను. హమ్మయ్య !! అని సంతోషంతో నిట్టూ ర్చింది శ్రీమతి. ఇక కథలోనికిరండన్నది సువర్ణలక్ష్మి. సరేవినండి అన్నాను.

## - దేవల మహర్షి జననం -

బ్రహ్మకోరికపై పంచముఖుడైన పరమశివుడు ప్రసన్నుడై వస్త్ర కారోత్పత్తికై ధ్యానముద్రాభిముద్రిత ప్రతిముఖ నేత్రత్రియ పద్మ డయ్యాడు. క్షణకాలం యోగం ఆత్మ సంయోగమైంది. అఖండ జ్ఞానతేజః ప్రవాహం మహాసాగరమైంది. అచట ఒక విశ్లేషణ వాయువు వీచింది. సాయుజ్య పదవీచ్యుతమై ఒక మహోజ్జ్వల దివ్యకాంతి కెరటం పూర్వ దిశాభిముఖమైన సద్యోజాతముఖ సహ

స్రార కమలమందుండి ఫాలనేత్రం ద్వారా బయటికి దూసికొని వచ్చింది.

ఆమహా దివ్యజ్యోతి క్రొమ్మెరపు దీవలతో చూపరుల కనుదో యికి మిరుమిట్లు గొలుపుతూ ఆసభామధ్యంలో లీలా నాట్యకేళి ప్రారంభించింది. బ్రహ్మాది దేవతలు వస్త్రకారుణ్ణి ఆవిర్భవింప జేయుమని ప్రార్థించారు. పార్వతీ పరమేశ్వరుల ప్రేమైక దృష్టికి, ఏకాగ్రదృష్టికి ఆజ్యోతిర్బింబం ఒక దివ్యపురుషాకృతి పొందింది.

నీలిముంగురుల తలజుట్టు సిగముడికి సన్నని రుద్రాక్షల హావళం చుట్టి ఉన్నది. అలికతలమున విభూతి పుండ్రములు, మధ్య కుంకుమబొట్టు, బ్రహ్మతేజం పుక్కిలించేలోచనాలు, రుద్రాక్ష కీలిత మణిమయ సువర్ణ నాగకుండల మండిత కర్ణద్వయి, యజ్ఞోప వీత, రుద్రాక్ష మాలికాలంకృత కంఠభుజోరస్థ్సలాలు, రుద్రాక్ష కంకణ సంఘటిత కరకమలాలు, దర్భాంగుళీయక పరిశోభితాం గుళులు, దివ్యాంబరద్వయాడంబర కటి బింబం, రవల పావకోళ్లు తొడిగిన పాదాలు కలిగి షోడశవర్షప్రాయుడుగా నిలిచాడు.

మిసిమిమేలిమి బంగారు మేనుగల ఆ ప డు చు వా డు ఆదిదంపతులకు ప్రదక్షిణ నమస్కారాలు చేస్తూ శంఖధ్వనిబోలు మధురకంఠ స్వరంతో ఇలా శివనుతి కావించాడు.

శ్లో॥ జనకాయ జనన్యైశ్చ - కుర్వేపాదాబి వందనమ్
ప్రదక్షిణ నమస్కారాన్ - వారంవారం కరోమ్యహమ్.

శ్లో॥ కాత్యాయనీప్రియ, దయామయ, గాంగజూట,
చంద్రార్ధ శేఖర, త్రినేత్ర, దరస్మితాన్య,
రుద్రాక్ష యుక్త ఫణికుండల, శూలపాణే,
శ్రీ రాజతాచల విభో! ప్రణమామి తుభ్యమ్.

ఒక్క తత్త్వమ్ము రెండయ్యె లెక్క కొరకు
ఈ యనంత బ్రహ్మాండమ్ము లెల్ల నీవ!
శివమయము గాని దున్నదే సృష్టియందు?
ప్రకృతి పురుష కేళియె విశ్వరచనమగును.

మీ లలిత లాస్యతాండవ కేళికిట్టె -
ఉదయ సాంధ్యవేళను విశ్వముదయమగును.
మీ సముద్ధత నాట్య విన్యాసములకు -
అపరసంధ్య విశ్వము ప్రళయమ్ము నొందు.

అనిస్తుతిస్తూ భ్రమరంలా పార్వతీ పరమేశ్వరుల పాద పద్మా లపై వ్రాలాడు. ఆ పురాణ దంపతులు సాదరంగా లేవనెత్తారు. ఆ దివ్యాంగుడు చేదమ్ములు మోడ్చి జననీజనకులారా! పునరావృత్తి రహితమైన సాయుజ్య పదవీస్థితి కల్పించి సౌధమునుండి క్రిందికి త్రోసినట్లు నన్నెందుకు పునర్భవుని చేశారు? చెప్పండి! అన్నాడు.

శివుడు వాని తల నిమురుతూ వత్సా! ఆందోళన పడకు. బ్రహ్మసృష్టికి వస్త్రలోపం కలిగింది. ప్రజలు వస్త్రహీనతచే దిగంబరులై అసహ్యంగా జీవిస్తున్నారు. దేవ మానవాది లోకవాసుల మానరక్షణార్థం నిన్ను అవతరింప జేయవలసి వచ్చింది, నీవు వస్త్రోత్పత్తి చేసి దేవాంగాలకు ఆచ్ఛాదన కల్పిస్తావు గనుక నీకు దేవలుడు, దేవాంగుడు అను పేరులు పెడుతున్నాను. ఇంతవరకు లోకులు వస్త్రాలులేక నింద్యజీవనం చేస్తున్నారు. నీవు వారికి వస్త్రాలిచ్చి వస్త్రాలంకృత దేహులను గావించి అనింద్యమైన, అత్యంత గౌరవాపాదకమైన సుఖజీవనం, నవజీవనం సమకూర్చు మన్నాడు.

ఆ దేవలుడు తండ్రీ! లోక హితార్థమని ఇపుడు నాకు జన్మ యేర్పరచి రూపమిచ్చావు. దేహధారులు చావుపుట్టుకలతో జనన

మరణ చక్రంలో పడి పరిభ్రమించ వలసినవారేగదా! అట్లే ఆకల్పాంతం నేనీ జనన మరణ యాతనా నరకం అనుభవించ వలసినదేనా? జ్ఞానామృతానందస్థితి వదలుకొని అజ్ఞాన మరణ దుఃఖ జీవనస్థితిని నేనెట్లు భరించగలుగుతాను? పరమేశ్వరా! శాశ్వతానంద ప్రదమైన సాయుజ్యమోక్షమిచ్చి ఈయని వాడవే అయ్యావుగదా, ఈమేను నీటి బుడగవంటిది. ఏక్షణంలోనైనా చితికిపోతుంది. రోగాలు, దుఃఖాలుగా పరిణమించే భోగాలు; శుష్క జర్జరిత శరీర వార్ధక్య శోకరాగాలు తరంగాలవలె మీదబడి ముంచెత్తుతుంటే జ్ఞానికి జీవితం ప్రేలిబ్రద్దలయ్యే అగ్నిపర్వతంలా ఉంటుంది. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాదులు మేఘాలు సూర్యుణ్ణి వలె ఎటువంటివారి జ్ఞానాన్నైన కప్పివేస్తోంటవి. దానివల్ల విపరీత జ్ఞానం కలుగుతుంది. విపరీత జ్ఞానంవలన లేనిదున్నట్లు, ఉన్నది లేనట్లు తోస్తుంది. దానితో అజ్ఞానం ప్రబలుతోంది. అజ్ఞానం చీకటి వంటిది కనుక వస్తుజ్ఞానం నశిస్తోంది. దానితో ఏదో చేస్తుంటాడు. మరేదో అవుతూంటుంది. అటువంటివాడు సంసార సాగరంలోబడి దారిగాని, దరిగాని కానక, ప్రయాణిస్తూ మధ్య సుడులలో బడి మునుగుతూ తేలుతూ ఝంఝా ప్రభంజనార్భటులకు ఎటో కొట్టుకొని పోతుంటాడు.

అజ్ఞాన పాశబద్ధుడైన జీవుడు మనోవాక్కాయాలు తానే అనుకొని త్రివిధకర్మలు చేస్తుంటాడు. ఆకర్మలు జన్మ పరంపరాప్రాప్తికి కారణములవుతోంటవి ఇట్టి అజ్ఞాన జనిత మాయావాగురలో నన్నెందుకు పడవేస్తావు? అని అన్నాడు.

భగవానుడు కటాక్ష వీక్షణాలతో ఒడలు నిమురుతూ నాయనా! విచారించకు, నీ అవతరణ తప్పనిసరియైనది. బ్రహ్మ సృష్టిలోని వక్రలోపాన్ని నీవు తప్ప మరొకరు చక్కదిద్దలేరు. లోక

కల్యాణం కోసం నీవురావలసి వచ్చింది. కేవలం వస్త్ర సూత్ర నిర్మాణం కొరకే గాక, లోకంలో శివాద్వైత మత సిద్ధాంత ప్రతిష్ఠా పన చేయుటకొఱకు, వివిధ శాస్త్రాధ్యాపనం కొఱకు, మంత్ర తంత్ర యోగాభ్యాస విద్యా ప్రదర్శనల కొరకు నీజననమవసరమైంది. నీవు కారణ జన్ముడవు. భూలోక కాల ప్రమాణాన్ని బట్టి నీవిక ఏడు జన్మలెత్తుతావు. చివరి జన్మాంత్యకాలంలో పాము కుబుసం విడిచి నట్లు దేహబంధాన్ని విడిచి, మరల యధాపూర్వ సాయుజ్యపదవిని పొందుతావు, ఈ సప్తావతార జీవితకాలం భూమిపై బహుదీర్ఘకాల మనిపించినా అది ఈకైలాసంలో అత్యల్ప క్షణికకాలం. సాయుజ్య మోక్ష స్థాయిలో దానికి పరిగణనమేలేదు. అది సంకల్పం వెంట సంకల్పం వంటిది.

లోకంలో సృష్టికర్త ఈచతుర్ముఖ బ్రహ్మయైనట్లే సూత్రవస్త్ర సృష్టిచేత నీవూ దేవలమనుబ్రహ్మగా, దేవల మహర్షిగా కీర్తింపబడ తావు. లోకంలో కూడూగూడూ లేకుండ కొంతకాలం జీవించవచ్చు మొలకు గుడ్డ లేకుండ సంఘంలో క్షణకాలమైనా మనగలగడం సాధ్యంకాదుగదా! కూడు గుడ్డలనే ద్వంద్వసమాసంలో కూడు శబ్దం ముందు చెప్పినా ప్రతి ఒక్కరికి ముందు కావలసినది గుడ్డ. వస్త్ర లోపం అగౌరవాపాదకమైనది, తిన్నదెవ్వరు చూడరు; ఉన్నదెవ్వరు చూడరు. కట్టుకొన్న వలువనుచూస్తారు పెట్టుకొన్ననగను చూస్తారు. ఒంటికి వలువ అలంకారప్రాయం. స్వర్గాధిపతి దేవేంద్రుడైనా వస్త్రలోపం కలిగిఉంటే నింద్యుడవుతాడు పూటకూటికి టికాణాలేని నిరుపేదయైనా ఒంటినిండ వస్త్రముంటే గౌరవార్హుడవుతాడు.

కాబట్టి చెదరిన మనస్సును కుదురు పరచుకో. నీవు వస్త్రో ద్యోగానికి పూనుకొని వస్త్రదానంతో దేవాంగాలంకరణ కావించి దేవాంగ నామధేయుడవవుతావు. లోక హితకారివి కావడం చేత

నీజన్మ చరితార్థమవుతూంది. నీవు దిగంత విశ్రాంత కీర్తివంతుడవౌ తావు, అన్నాడు. పార్వతీదేవి కలుగజేసికొని బిడ్డా! అయ్యఆజ్ఞను జౌదల దాల్చు. నీకన్ని విధాల అండగామేముంటాము కర్తవ్య నిర్వహణానంతరం నీ సాయుజ్య పదవి నీకుండనే ఉంటుంది. అన్నది.

దేవలుడు వారి సాంత్వన వచనాలకు ఊరటచెంది తల్లి దండ్రులారా! శివపూజానిర్మాల్యంలా మీ ఆనతిశిరసావహిస్తున్నాను. కర్తవ్యముపదేశించండి అన్నాడు అంత అంతకాంతకుడు సంతు ష్టాంత రంగుడై పుత్రకా! వినుము. ఆదికాలంలో నా ఉచ్ఛ్వాస నిశ్వాసలకు వేద వాఙ్మయముత్పన్నమైనది. దానితోపాటు పద్మ నాళాత్మక తంతు సంతానం పుట్టింది. వేద వాఙ్మయం బ్రహ్మ కిచ్చాను. పద్మతంతు సంతానం విష్ణుమూర్తికిచ్చాను. విష్ణువానూలును సూక్ష్మీకరించి నిజనాభికమలంలో భద్రపరచాడు. అవి నీవు తెచ్చు కోవాలి. ఈ రోజే నీవు క్షీరసాగరమందలి శ్వేత ద్వీపానికి వెళ్లు. శేషతల్పశాయిని సందర్శించి ప్రసన్నుని చేసికో నా పనుపున తంతువుల కోసం వచ్చానని చెప్పు. అతడవి ఇస్తాడు. వాటిని సంగ్ర హించి నీ నేర్పుతో వస్త్ర సృష్టి సాగించు, నీకు పూర్వజన్మ జ్ఞానం, పూర్వకర్మ కౌశలం కలిగిస్తున్నాను అన్నాడు.

దేవలుడు అంజలి బద్ధుడై విశ్వనాథా! తంతు పరిగ్రహణానం తరం నేనెచటికి చేరుకోవాలి? నా కార్యక్షేత్రమెక్కడ? నా పరివార మెవ్వరు? నాకు బ్రహ్మచారి జీవితమా? గృహస్థాశ్రమ జీవితమా? నేతపని నాతో పరిసమాప్తమా? లేక, అది వారసుల కెవరికైన అప్పగించాలా? శివాద్వైత మత సిద్ధాంత ప్రచారం ఎలాసాగించాలి? ఇవన్నీ వివరంగా చెప్పుమన్నాడు.

పరమ శివుడు కుమారా! నీవు తంతు సంతానం సంతరించు

కొని శ్వేత ద్వీపం (వైకుంఠం) నుండి భూలోకమందలి జంబూ ద్వీపానికి వెళ్ళాలి. ఆద్వీపంలో సర్వదేవతా వాసమైన మేరు పర్వత మున్నది. దానికి దక్షిణ దిశగా భూదేవికి రత్నఖచిత సువర్ణకిరీట ప్రాయంగా భరత ఖండమున్నది. ఆ భరత భూమికి కంఠహారంగా సర్వసౌఖ్యావహమై స్వర్గాన్నితలపించే సగరదేశమున్నది. ఆ సాగరికి రాజధాని ఆమోదపట్టణం. ఆ ఆమోదపట్టణానికి నీవు చేరుకోవాలి. అదే నీ వస్త్ర సూత్రోద్యోగాలకు కార్యక్షేత్రం. ఆమోదపట్టణానికి నీవు చేరుకొన్నప్పుడు దానిపాలకుడు చంద్రునిగన్న సాగరంలా ఉప్పొంగి నిన్ను రాజును చేసి తాను తప్పుకొంటాడు. నీవు సగర దేశాధీశుడవై రాజ్య పరిపాలన చేస్తావు. పూర్వజన్మ జ్ఞానంచేత వస్త్రోత్పత్తిచేసి లోకుల కిస్తావు.

## - దేవలునికి గాయత్రీ సూత్ర మంత్రాధికారం -

ఒక పరమ రహస్యం నీకు చెవుతున్నాను. నీవు గాయత్రీ సూత్రంతో జన్మించావు గాయత్రీ మంత్రం, శివపంచాక్షరీ మంత్రం నీజిహ్వా పల్లవంపై ఆడుతున్నవి. నీకవి ఊపిరియై ఉన్నవి. అందు వల్ల నీవు జన్మతో బ్రాహ్మణుడవు. గర్భబ్రాహ్మణుడవు. ఇతరులు ఉపనయనంతో ద్విజన్ములై బ్రాహ్మణులౌతారు. గాయత్రీ సూత్రం, గాయత్రీ మంత్రం నీ జన్మ హక్కులు. నా వల్ల నీకు గాయత్రీ మంత్రోప దేశికత్వాధికారం సంక్రమించింది. లోకులకు వస్త్ర మిస్తావు. గాయత్రీ సూత్ర మిస్తావు మాంగళ్య సూత్రమిస్తావు.

నీకు పెండ్లి అవుతుంది. సంతానం కలుగుతుంది. నీ పుత్రులు వస్త్ర సూత్రోద్యోగాలలో నీకు సహాయులుగా ఉంటారు. విద్యాధికులై సకల శాస్త్రపారంగతులై శివాద్వైత మత ప్రచారంలో నీకు చేదోడు వాదోడుగా ఉంటారు. ఉన్నత ప్రమాణ జీవనులై దేవాంగ జాతిగా

పరిగణింప బడతారు. నీతర్వాత నీ కార్యక్రమాన్ని స్వీకరించి లోకోద్ధరణకు పాటు పడతారు.

నా సద్యోజాత ముఖకమలం జన్మస్థాన మగుటచేత నీకు సద్యోజాతప్రవర,-నా సద్యోజాతముఖం ఋగ్వేదం పఠిస్తుండటం చేత నీకు ఋక్ శాఖ,-నా వలన గాయత్రీ మంత్రోపదేశికత్వాధికారం సంక్రమించటం చేత నీకు పరమశివ గోత్రం,-అశ్వలాయన సూత్రం సిద్ధించింది. ఇట్లే నీ వంశీయులకు నిన్నుబట్టి సద్యోజాత ప్రవర, ఋక్శాఖ, శిక్షణను బట్టి ప్రత్యేక మహర్షి నామగోత్రం, అశ్వలాయన సూత్రం సిద్ధిస్తుంది.

దేవాంగ జాతివారికి జన్మతః సూత్రాధికారం సంక్రమిస్తుంది. అందువల్ల దేవాంగ జాతి వారెల్లరు గర్భబ్రాహ్మణులే. అయినా, బ్రహ్మజ్ఞాన సంపన్నులెవరైన బ్రాహ్మణులే. కానివారెవరైనా శూద్రులవుతారు. బ్రాహ్మణత్వానికి బ్రహ్మజ్ఞానం మూలమై ఉన్నది. సత్యజ్ఞానం కల్గిఉండటమే బ్రాహ్మణత్వం. విపరీత జ్ఞానం కల్గిఉండటం శూద్రత్వం. పుట్టుకతో ఎవ్వరూ గొప్పవారుకారు; జ్ఞానసముపార్జన చేతనూ, సత్ ప్రవర్తన చేతనూ గొప్పవారవుతారు. యధార్థానికి నీ వొక్కడవే నా మనస్సంకల్ప సంజాతుడవుకావు; సర్వ మానవ జాతులు, సర్వ దేవతాజాతులు, సర్వ రాక్షసజాతులు, సమస్త పశు పక్ష్యాది క్రిమికీటక జీవరాశులన్నీ నా మనస్సంకల్ప సంజాతాలే. ఒకరు ప్రియులు, మరొకరు అప్రియులు కారు. అందరూ నాకు సమానులే. అన్నిజాతులవారూ అన్ని జీవరాశులూ నా సంతానమే. కాని, ఎవరు నాకు దగ్గరైతే వారికి నేను దగ్గరవుతుంటాను. ఎవరు నాకుదూరమైతే వారికినేను దూరమౌతుంటాను. అయినా, నాసహజ కరుణామృతవృష్టి చేనిపై వర్షంవలె అందరియందు సమంగానే ఉంటుంది.

నన్ను గుర్తింపజేసేదే గాయత్రీ మంత్రం. గాయత్రీ మంత్రం నేనూ ఒక్కటే. గాయత్రీ మంత్ర పరిపక్వ జ్ఞానమూ, నేనూ ఒక్కటే. గాయత్రీ మంత్ర చోదిత అజప గాయత్రీ మంత్రోద్భాసిత నిత్యై కాగ్రతాస్థితి నందిన ఆత్మా, నేనూ ఒక్కటే. ఒక్కటే. ఒక్కటే అంటూ స్వామియోగ సమాధి నిష్ఠుడయ్యాడు.

దేవలుడా పరిస్థితి గమనించి శివవామాంగమందు అనుపమ సౌందర్య తేజో విరాజిత దివ్య మంగళ విగ్రహయై చిద్విలాసంతో కన్నుల పున్నమి వెన్నెల పుక్కిలిస్తూ, శ్వాసల సన్నజాజుల గుమ గుమలు పరిమళించే ముగురమ్మల మూలపుటమ్మకు మోకరిల్లి పాదాభివందనం చేశాడు.

అమ్మా! తండ్రి జ్ఞానం మాత్రమే ప్రసాదించాడు. అమ్మవు శక్తియుక్తులు ప్రసాదించవలసి ఉన్నది తల్లీ! నీ ఆజ్ఞలేక ఆకైన అల్లలాడదు. నీవులేక, పరమ శివుడుగూడ ఏ పనిచేయలేడు. లోకం లోని సమస్త శక్తులకునీవేమూలశక్తివి. ఆదిశక్తివి. పరాశక్తివి. సమస్త నదీనదాలు సాగరంలో సంగమించునట్లు లోకాలోక సమస్త శక్తులు నీయందు చేరుతున్నవి. సమస్త తరు లతాగుల్మాదులకు భూమి సార మందిస్తున్నట్లు అన్నిశక్తులకు జీవన వాహినివై బలిమి కలిమి కలుగ జేస్తున్నావు. జగదీశ్వరీ! నీ చల్లని చూపు సృష్టి వ్యాపారమౌతున్నది. నీ వేడిచూపు జగత్ ప్రళయమౌతున్నది. అమ్మా! నీ కరుణామృత నిర్ఝరిని ఈ కసుగందుపై ప్రసరించు. కంటికి రెప్పవలె నన్ను కాపాడు, నా కార్యక్రమం విజయవంతమవటానికి శుభాశీస్సుల నిమ్ము. అయ్య నిర్వాత దీప కళికవలె నిశ్చలయోగ సమాధిలో ఉన్నాడు. అయ్యవైన నీవే; అమ్మవైన నీవే. ఈ బిడ్డను చక్కదిద్దే భారం నీదే. నాయనగారి ఆజ్ఞమేరకు పుట్టు వొప్పుకొని నూలు

తేవడానికి పాలకడలికి పయనమవుతున్నాను. నాకు రక్షాకవచమై నీవే మార్గోపదేశికురాలవు కావాలి అని ప్రార్థించాడు.

ఆయమ్మ మాతృప్రేమ మోసులెత్తి మొగ్గదొడగగా, చిరునగవు చిందిస్తూ ఆ ముద్దులయ్యను వద్దకు తీసికొని ముద్దాడి బిడ్డా! లోక కల్యాణార్థం ఈ కార్యక్రమం నీ కప్పగించాము. నీకేసమస్య ఎదురైనా, ఏ కష్టం వాటిల్లినా నిన్నాదు కొనే బాధ్యత మాకున్నది అవశ్యం నీకు రక్షణగా నిలబడతాము. మార్గమధ్యంలో గాని' మరెక్కడైనా, ఎప్పుడైనా ఏ విపత్తు ఎత్తి వచ్చినా, ఎవ్వరు చుట్టు ముట్టి బాధించి వేధించినా నన్నుధ్యానించు. వెంటనే వచ్చి నిన్ను కాపాడుతాను. మీ తండ్రి నీకు మధ్యమలోకం నివాసంగా నిర్ణ యించాడు. అందువలన నీకు దేవ మానవ లక్షణాలు సహజాతై నవి. అబ్బాయీ! నీకు కామగమన శక్తి అనుగ్రహిస్తున్నాను. దివ్య శక్తులపై అధికారం గూడ కల్పిస్తున్నాను. ఇదిగో పూల ప్రేపసజ్జ తీసికో. దీనిలో శ్రైప్రియమైన పూలు పండ్లు వగైరాలున్నాయి. విష్ణు మూర్తి సందర్శనవేళ శ్రద్ధాభక్తులతో సమర్పించు. ఈ శుభసమ యాన ప్రయాణం సాగించు. నీకు మేలవుతుంది అన్నది. అంతట్ట దేవలుడంజలి బద్ధుడై అమ్మా!

శా॥ ఐంబీజాత్మ సరస్వతమ్మవయి సృష్ట్యారంభమున్ జూపవా?
శ్రీంబీజాత్మక లక్ష్మివై మనుపవా? హ్రీంబీజమిట్లుండవా?
క్లీం బీజాత్మ త్రిమూర్తతన్ వెలయవా? లీలార్ధ సౌఃబీజమై
ఓం బీజమ్మయి జ్ఞానమోక్షఫల రూపోత్సాహమందీయవా?

ఖడ్గబంధము—యోగము గలుగదెయిగ నిగ-
మాగమనుత, అంబ! త్వద్దయార్ద్ర సుతునకున్
శ్రీ గగన సుధా లహరీ-
యోగధురీ! దివ్యశక్తు లొసగవె నాకున్.

శా॥ జయ శంభ్వర్ధ శరీరిణీ! శ్రుతి శిరస్సౌధాగ్ర సంచారిణీ!
జయబ్రాహ్మీ మధుకోశ బిందుకళికా! జ్ఞానప్రసూనాంబికా!
జయ హృత్కోశ నిధానమా! ద్యుతిమతీ! సౌవర్ణ వర్ణాత్మికా!
జయ కామేశ్వరి! వందనమ్ము నను వాత్సల్యమ్ముతో బ్రోవుమా!

అని స్తుతివాక్యాలు పలుకుతూ పురాణదంపతులకు ప్రదక్షిణ నమస్కారాలు చేసి అనుమతి పొందాడు. బ్రహ్మాదిదేవతలు కొంత దవ్వువెనువెంటవచ్చి వీడ్కొలిపారు. దేవలుడు క్షీరవారాశికి పయన మయ్యాడు అన్నాను.

కోట సువర్ణలత అడ్డుతగిలి నాన్నా! కొంచెంసేపాగాలి. మేరు పర్వతమంటే ఏమిటి? అన్నది. మేరు పర్వతమా? మేరువనే పేరు గల పర్వతమన్నాను, అయమ్మాయి అది సరే. లోగడ మాకుఏడవ తరగతి తెలుగువాచకంలో వింధ్యమేరుపర్వతాల మాత్సర్యాన్నిగూర్చి "ఆత్మగతము" అనే పాఠంవచ్చింది. అపద్యపాఠం చెప్పేటప్పుడు మేరుపర్వతమంటే బంగారుకొండ అని చెప్పారుగదా! అమేరు పర్వతం, ఇప్పటి కథలోని మేరుపర్వతం ఒక్కటేనా? వేరువేరా? చెప్పమన్నది. వింధ్యం మత్సరించిన మేరువు దేవతావాసమైనదే. ప్రస్తుత కథలోని మేరువూ దేవతావాస మైనదే. కాబట్టి రెండూ ఒక్కటే అన్నాను. అయితే, మేరువంటే బంగారుకొండేగదా! అన్నది. పూర్వులు చెప్పినదాన్నిబట్టి ఔనన్నాను.

మరి, అమేరు పర్వతానికి దక్షిణదిశగా భరతఖండమున్నట్లు కథ చెవుతున్నావుగదా! దాన్నిబట్టి మనదేశానికి ఉత్తరంగా బంగారు కొండ ఉన్నదా? అన్నది ఇంత వివరంగా అడుగుతున్నావు. ఉంటే బంగారుకొండను త్రవ్వి తెచ్చుకోవాలనా? అన్నాను. అసలుంటేనా? బంగారు కొండే ఉంటే, ఇంతకాలంగా భారతదేశం బీదదేశంగా

ఎందుకుంటుంది? భారతదేశానికి ఉత్తరంగా హిమాలయ పర్వత మున్నది గాని మేరుపర్వతమెక్కడున్నది నాన్నా? అన్నది.

నేనేదో చెప్పబోయి-అంటే సంకల్ప మంత్రంలోని "జంబూ ద్వీపే... మేరోర్దక్షిణ దిగ్భాగే...అని చెప్పబోయి కుదరక నాలుక కరచుకొన్నాను. కొంచెం నిలదొక్కుకొని అమ్మాయీ! నేను పురాణంలో ఉన్నమాట చెప్పాను. కాని, నీ వన్నదే యధార్థం. హిమాలయానికి దక్షిణ దిశగా ఉన్నదే భారతదేశం. భారతదేశానికి ఉత్తరంగా ఉన్నదే హిమాలయం. భారతదేశానికి ఉత్తరాన హిమాలయం పెట్టని కోటగా ఉండటంచేత అది ప్రజల పాలిట బంగారు కొండే దానిలో అపారమైన ఓషధీ సంపద, ఖనిజ, సంపద, ఉండుటచేత అది బంగారు కొండే. దానిలో అత్యున్నతమైన గౌరీ శంకర శిఖరం, కైలాస శిఖరం; గంగోత్రి, యమునోత్రి, మానస సరోవరం. బదరీ నాథ అమరనాథ కేదారనాథాది పుణ్యతీర్థక్షేత్రాలుండి సర్వదేవతా నివాసం కావడం చేత అది బంగారు కొండే అన్నాను.

నాన్నా! నీవేమి చెప్పినా అది హిమాలయ పర్వతమే. మంచు కొండ, బంగారు కొండ ఒక్కటెలా అవుతాయి?—ఇక క్షీరసాగర మేమిటి? ఎక్కడైనా సముద్రాలలో నీళ్లగాని పాలుంటాయా? ప్రపంచంలో పాల సముద్రముంటే ఆపాలను చౌకగా దేశదేశాలకు పంపుకోవచ్చు. ఇక పశువుల్ని పెంచే బెడద తప్పిపోతుంది గదా! అన్నది.

నా మనస్సు ఆకాశంలోనికి దూసికొని పోయింది. పాలపుంత నక్షత్రవీధి (గెలాక్సీ) పైన నిలచింది. అమ్మాయి! ఆక్షీరసాగరం భూలోకం లోనిదికాదు. వైకుంఠానికి సంబంధించింది. చూడు. రాత్రులందు సుదూరతీర నీలాకాశంలో పాలపొంగులా వెలుగు పొంగు కనపడుతోంది. అదంతా జ్యోతిర్మేఘాల వరుసలతో అనేకానేక

నక్షత్రకూటాలతో ఒక వీధిదారిగా కనపడుతోంది. మన భూమి గ్రహంతో ఉన్న ఈ నక్షత్రవీధినే పాలపుంత, క్షీరోదం, క్షీర సాగరం అంటారు. స్వాతీ శ్రవణా నక్షత్రాల మధ్యభాగంలో పరమ పదమున్నది. దాన్ని వైకుంఠమంటారు. దానిమధ్య నక్షత్రాల రూపంతో శేషతల్పమున్నది. ఆతల్పంమీద విష్ణువు పవ్వళించి ఉన్నాడు. ఆస్వామి నాభికమలంలో బ్రహ్మ, వీణాపాణి వాణి ఉన్నారు. ఇదే విశ్వానికి కేంద్రమని అనుభవజ్ఞులు బోధిస్తున్నారు.

మనం ఈభూమిమీద జన్మించాము. భూమిమీద జీవిస్తు న్నాము భూమిగత జ్ఞానంతో భూవాతావరణాన్ని బట్టి దేనినైనా ఊహిస్తాము. ఈలోకజ్ఞానం మనకు అస్తిగతమై ఉన్నది. భూభ్రమ ణాన్నిబట్టి సూర్యోదయాస్తమయాలు జరుగుతున్నాయి అవి నిజమే అని మనంభావిస్తున్నాము. మనం అంతరాళంలోనికి ఎగసి చూస్తే సూర్యుడు తూర్పున ఉదయించుట గాని, కదలి పోయిపోయి పడ మట అస్తమించుటగాని ఒప్పుకోము గదా! అప్పుడు సూర్యుడు కదలుటలేదని, భూమి కదలి తిరుగుతోన్నదంటాము.

సాగరమనగానే మనభూమిమీద చూచే జల సముద్రంగా భావిస్తాము. ఈ జలసముద్ర పరిస్థితులే ఆసాగరానికి ఆపాదిస్తాము. అందువలననే క్షీరసాగరమంటే మనకు విడ్డూరంగా ఉంటుంది. క్షీరసాగరంలో పాలుండుటకాదు; అది ఆకాశంలోని తెలి వెలుగుల పొంగు.

ఒకవిధంగా ఆధ్యాత్మిక దృష్టితో చూస్తే క్షీరసాగరం బ్రహ్మ రంధ్రమందలి సుధా సింధువు. అచటి శేషతల్పం ఊర్ధ్వకుండలిని దానిమీద శయనించిన విష్ణువు పరమాత్మ. నీటికొలది తామర అన్నట్లు వినువారి అధికారాన్నిబట్టి అర్థరీతులేర్పడుతాయి. ఇంత

విచారించినపుడు క్షీరసాగరంలో ఉండేవి నీళ్లా, పాలా? అనే ప్రశ్నలకు ఇక ఆస్కారముంటుందా?

కొందరు ఈలోకాలు పైనెక్కడో లేవనీ, అవి భూమి మీద ఉన్న కొన్నిప్రాంతాలనీ, - హిమాలయంలోని కైలాస శిఖరప్రాంతం కైలాసమనీ, టిబెట్టు ఇంద్రుని త్రివిష్టపమనీ, బర్మా బ్రహ్మపుర మనీ, అమెరికా పాతాళమనీ నిర్వచిస్తూంటారు. శివుడు హిమాలయాలలో తపస్సుచేశాడు గనుక, ఆయన భూమికి చెందినవాడనీ చెప్తారు. పార్వతి హిమవత్పర్వత రాజ పుత్రిక గనుక మానవస్త్రీ అంటారు. విష్ణ్వవతారాల్లో కొన్నిభూమిమీదవనీ ఆయనభూమికి చెందిన వాడని అంటారు. ఆనాడు ప్రయాణ సౌకర్యాలులేవు. దూరప్రాంతాలకు నడచి పోవాలంటే కొన్ని నెలలు, సంవత్సరాలు -పట్టేవి. అందువలన వాటిని ప్రత్యేక లోకాలుగా, అచటివారిని దేవతలుగా, భావించేవారని చెవుతారు. తీగ కదిలిస్తే డొంకంతా కదలుతూంది. ఇవన్నీ చూస్తుంటే పుఱ్ఱెకొక బుద్ధీ జిహ్వకొక రుచీ అన్నట్లుంటుంది. ఎవరి భావన వారిది. ఈ విమర్శ ఇక నిలుపుతాము.

## ద్వితీయాధ్యాయం - దేవలుడు పాలకడలికి పయనం

దేవలుడు కైలాసాన్ని వదలి అంతరిక్షంలోనికి వచ్చాడు. విశ్వాంతరాళంలో జ్యోతిర్మండల భ్రమణ పరిభ్రమణాలు తిలకిస్తూ ఈమనోహర సౌందర్య దృశ్య సంఘటనకు హేతుభూతమైన భగవత్కళావైభవ ప్రాభవానికి శి. :కంపంచేశాడు. ఆపరమాణుబ్రహ్మాండం భగవదాజ్ఞా బద్ధమై కేంద్రకాకర్షణతో జీవనవ్యాపారం చేస్తుందనీ,- చిద్బిందు వికసనమే ఈ సమస్త విశ్వసృష్టిగారూపొందుతున్న దనీ,-బీజం మొక్కయి పూచికాసినట్లుజీవాణువు వ్యక్తిగా రూపొందుతున్నదనీ భావించి ఒకవిధంగా నిజ జన్మావతరణం దైవ విలాసంగా ఎంచి ఊరట, తృప్తి పొందాడు అతడు కామగమనం

కలవాడు గనుక సంకల్ప మాత్రాన క్షణకాలంలో వైకుంఠలోకానికి వచ్చాడు. క్షీరసాగర తీరమందున్న సువర్ణాశ్రమం చేరుకొన్నాడు.

ఆశ్రమమంతా శ్రీ మహావిష్ణు లక్షణ లక్షితమై విష్ణుమయమై ఉన్నది. విష్ణుమందారాలు, విష్ణుపారిజాతాలు, విష్ణుహరిచందనాలు విష్ణు కల్పకాలు, విష్ణు సంతానాలు గుత్తులు గుత్తులుగా విరబూసి కాసి ప్రతిచెట్టు సాలంకృత విష్ణు స్వరూపంగా ప్రతిభాసిస్తున్నది. పొన్నలు పొగడలు, పనసలు తినిసెలు, ఏడాకుటరటులు, ఎల మావి గుమురులు, విరిసి అల్లిబిల్లిగా అల్లుకొన్న వెన్నెల తీవలు, విరజాజులు, సన్నజాజులు, మల్లెలు మొల్లలు పరిమళ పవనాంకు రాలతో అతిథులను విష్ణుదేహచ్ఛాయవంటి తమ చల్లని నీడలకు ఆహ్వానిస్తున్నవి తుమ్మెదలు ప్రణవ మంత్రకలిత ఝుంకృతులతో పూలపై మూగుతోన్నవి. గండు కోయిలలు సప్త సామాలను స్వర సహితంగా కుహుకుహూకారంతో ఆలపిస్తున్నాయి. నెమళ్లు పింఛాలు విప్పి నాట్యం చేస్తూ శ్రీ హరిగుణగానం చేస్తున్నాయి. అచట నవవికసిత సువర్ణపద్మ సరస్తీర వృక్షచ్ఛాయల్లో సప్తర్షులు భాగవతోత్తములు తులసీదళాలు చేర్చి పూలమాలలు కడుతూ అల్లంత దూరంలో శైవతేజంతో వెలుగుతున్న నూతనాతిథిని చూచారు. ఎదురుగా వచ్చి అభివాదనపూర్వకంగా స్వాగత వచనాలు పలికి తోడ్కొని తెచ్చారు. ఆసనార్ఘ్యాది పూజా సపర్యలు కావించి వచ్చిన పని తెలిసికొని మేముగూడ శ్రీ మహావిష్ణు సందర్శనార్థం వస్తున్నా మన్నారు. పూలమాలలు పూర్తిచేసి అందరూ కలసి బయలు దేరారు.

శివసుతునకు పాలకడలి గూడ వెండికొండే అనే భ్రాంతి కల్గించటానికా? అన్నట్లు తరగలు చెలియలికట్టమీద తెల్లని నురుగు కొండల్ని చేరుస్తున్నాయి. కడలితరగల ఘుంఘుమ ఘోష దశవిధ

నాదాలను పోలుతున్నవి. సాగరమనే శేషకుండలిని ఉత్తుంగ తరంగ సహస్ర ఫణామణి మండలిని విప్పి వేలారంగస్థలిమీద అపూర్వ నాట్యకళా విన్యాసం చూపుతోంది. వాయు వీచీ పరంపరా విక్షేప శకలిత నీల జలద ఖండాలు బహు విధ విష్ణ్వవతార మూర్తులు పొందుతూ క్షీరసాగరోపరిస్థల గగన భాగంలో విష్ణులీలా వైభవాన్ని ప్రదర్శిస్తున్నవి. సాగరానికి రత్నాకరమనేమరో పేరున్నది. పెద్ద పెద్ద అలలు చిరత్న రత్నాలను పైకెత్తుకొని వస్తున్నాయి. ఆరత్న పంక్తులు నీళ్లతో జారుతూ గగనాన వెలుగు పంటల్ని పండిస్తుంటే అది సాధకుని ఒకానొక అలౌకిక సిద్ధావస్థను తలపింప జేస్తోన్నది. సాగరం తనలోని ముత్యాలను కుప్పపోసి కూర్చిందా? అన్నట్లు వైకుంఠం వెలుగుల వెల్లువలతో ప్రకాశిస్తోంది.

ఆ వైకుంఠంలో రాచనగరు. ప్రక్కనే ఆనందవనం. ఉత్తర దిశగా రత్నగిరి. దాని ముత్యాల సెలయేళ్లతో రూపొందినదే అమృత సరస్సు ఆ అమృత సరస్సు గూడ శ్రీమన్నారాయణ స్వరూపాన్నే కలిగి ఉన్నది. అది సుధారసాశ్రయం. సువర్ణసహస్ర దళ పద్మోదరం. శంఖ చక్రమనోహరం. హంసోత్తరీయ భాసురం. నవ వికచోత్పల వర్ణ శోభితం.

ఆ అమృత సరస్సులో తేలియాడు శేషతల్పంపై అధివసించి విష్ణు భగవానుడు సాధనా సిద్ధులకు బ్రహ్మోపదేశం చేస్తున్నాడు. దేవలుడు గరుత్మంతుని అనుమతిపొంది అంజలి బద్ధుడై దూర మందుండియే ఓం నమో శ్రీమన్నారాయణాయ అనే మంత్రోచ్చారణ చేస్తూ బిరబిర చేరవచ్చాడు ఆదివ్య మంగళ విగ్రహ దర్శనంతో పట్టరాని ఆనందోత్సాహాలతో ఇలాస్తుతించాడు.

సీ॥ క్షీరాంబునిధిలోన శేషతల్పముపైన
పవ్వళించినయట్టి పద్మనాభ!

రత్న రంజిత సువర్ణ కిరీట రుచులతో
వదనబింబంబొప్ప వరదరాజ!
శ్రీదేవి భూదేవి చివురుపాదములొత్త
పులకించి పోయెడి పుణ్యమూర్తి!
నాభి పద్మముమీది నలువ వేదముపల్క
ఆనందమొందెడి అమృతహృదయ!
ఆ సహస్రార కమల పీఠాంతరమున
వెలుగు జ్యోతిర్మయుడవీవు జలజనయన!
పరమ పదమందు నెలకొన్న పరమపురుష!
శరణు, శ్రీమన్మహావిష్ణు! శరణు శరణు

- చక్రబంధము -

శా॥ భక్తౌఘమ్ములు త్వత్పదమ్ములకు హృత్పద్మమ్ములందీయవా?
రక్తిన్ తుమ్మెదవోలె రాగలహరీ ప్రాచుర్యమున్ జూపవా?
భుక్తిన్ ముక్తినిగూర్చి వారల సదా పోషింపవా? కేశవా!
వాక్తోషా! భవతారణా! ప్రభువరా! వార్ధ్యుద్భవా మాధవా!

## - విష్ణువు దేవలునికి తంతువులతోపాటు చక్రమిచ్చుట -

దేవలుడు స్వామికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి సెజ్జలోని శైవీయ పుష్పమాలను శ్రీహరి మెడలో వేశాడు. టెంకాయ పెట్టి తాంబూలం సమర్పించి పాదాభివందనం చేశాడు. అంతట విష్ణువు నాయనా! లెమ్ము. ఇటు సుఖాసీనుడవు కమ్మన్నాడు. దేవలుడు కూర్చొని జగద్రక్షకా! లోగడ పూర్వసృష్టి అంత్యకాలంలో శివ సాయుజ్యం పొందిఉన్నాను. బ్రహ్మకోరికపై ఈసృష్టికి వస్త్రో త్పత్తి చేయుటకై శివతేజస్సునుండి మరల జన్మించాను. నా పేరు దేవలుడు. శివపార్వతుల ఆజ్ఞమేర నీచెంతనున్న తంతువులను

స్వీకరించడానికి వచ్చాను. భగవానుడా! అవినాకు అనుగ్రహించుమన్నాడు. సంస్కారవంతములైన ఆ మాటలకు నారాయణుడు సంతసించి దేవలా! ఎంత మంచిమాట వినిపించావు! ఇపుడు లోకుల మానరక్షణ అత్యంతావశ్యకమై ఉన్నది. బ్రహ్మ సృష్టి దిగంబరతా దూషితమై ఉండుటచేత మాదృశులకు జుగుప్సావహమై ఉన్నది. దీనిని చక్కబరచువారెవ్వరు? ఎవ్వరని? ఎదురు చూస్తున్నాను ఇప్పటికి నీవు వచ్చావు. వెదికే సంజీవితీగ చేతికందినట్లు ఆనందంగా ఉన్నది.

సృష్టి ప్రారంభకాలంలో వేదాలతోపాటు తంతు సంతానం కలిగించి. అప్పటినుండి వాటిని నాభినాళ కమలంలో భద్రపరచి ఉంచాను. ఈకమల తంతువులతో వస్త్రాలు నేసి సర్వలోకవాసుల దిగంబరతా దోషాన్ని పోగొట్టు. వారి దేహాలకు అలంకారప్రాప్తి కలిగించు. ఇవిగో పరిగ్రహింపుమని ఇచ్చాడు. దేవలుడు పుచ్చుకొన్నాడు. పుండరీకాక్షుడు దేవలుని వినయవిధేయతలకు మెచ్చుకొని అబ్బాయీ! ఇందరి వైష్ణవులలో నీవొక్కడవే శైవుడుగా ఉన్నావు. సాధుమూర్తిగా తోస్తున్నావు, ఒంటరిగాఉన్నావు. రక్షణకెట్టి ఆయుధం నీవద్దలేదు. దారినడుమ అనేకులువంచకులుతారసిల్లవచ్చు, అపాయాలు కల్పింపవచ్చు, చంపటానికి రావచ్చు. ఆత్మరక్షణకు ఆధారంగా నాచక్రం నుండి ప్రతిచక్రం తీసి నీకిస్తాను. దానితో నీ ప్రయాణం విజయవంతమౌతుంది. అని చక్రమిచ్చాడు.

దేవలుడు మహాప్రసాదమని అందుకొని భక్తి తాత్పర్యాలతో ప్రణమిల్లి దేవా! వస్త్ర సూత్ర నిర్మాణంలో విఘ్నకారకులైన దుష్టులను దునుమాడుటకు చక్రాయుధప్రదానం చేశావు. ఇట్లే ఇతర కార్యక్రమాలలోగూడ నాకు రక్షణగా ఉండుమని ప్రార్థించాడు. నారాయణుడు అన్నిటికి అజగదీశ్వరుడు జగదంబ ఉన్నారు. జ్ఞానస

శక్తి యుక్తుడవై విజయం సాధిస్తావు అన్నాడు. దేవలుడు స్వామీ! నీవద్దకు నేను బయలుదేరేవేళ జనకుడు యోగసమాధిలో ఉన్నాడు, జనని నన్నుదీవించి ఈ పూల సెజ్జ ఇచ్చి పంపింది. అమ్మ నారాయణి, నీవు నారాయణుడవు, అమ్మగారి పుంస్త్వ రూపమే నీవు. నీ అనుగ్రహముంటే అమ్మగారి కరుణా కటాక్షమున్నట్లే. తల్లివంటి వాడవు నీవే అన్నాడు. గోవిందుడు దేవలుని శిరస్సు నిమురుతూ వత్సా! నీ సంకల్ప మీడేరుతుంది. నీకు విజయం కలుగుతుంది. ప్రస్తుతం నీ నివాసమెక్కడ? అన్నాడు. దేవలుడు దేవా! సూర్య కుటుంబమందలి భూలోకంలోని జంబూద్వీపాంతర్గత భారత దేశ భాగమైన నగరదేశం నానివాసంగా నిర్ణయించబడింది. ఈ బిడ్డను గుర్తుంచుకోండి వెళ్లివస్తాను అని లక్ష్మీనారాయణులకు మ్రొక్కాడు. అచటివారికి అభివాదనం జేశాడు.

## దేవలుడు భూలోకానికి వచ్చుట

అతడు సంకల్పమాత్రాన వైకుంఠ గగనాన్ని అధిగమించి నవగ్రహాత్మక సూర్యకుటుంబంలోనికి వచ్చాడు. అందున్న భూలోకాన్ని కనుగొన్నాడు. సప్తద్వీపాలను వేర్పరించుకొన్నాడు. భూదేవికి హృదయకోశంవంటి జంబూద్వీపానికి వచ్చాడు. అందున్న హిమాలయాలను బట్టి భారతదేశాన్ని నిరూపించుకొని సముద్ర తీరారణ్యం చేరుకొన్నాడు. భూలోక వాతావరణ స్థితిగతులు అర్థంచేసికోదలచి తన సహజ కామ గమన వేగాన్ని తగ్గించుకొని మంద మంద గమనంతో ముందుకు సాగిపోతున్నాడు. నానావిధ తరులతాగుల్మ సంకీర్ణమైన ఆకీకారణ్యం సూర్యాతపాన్ని చొరనీకుండా సింహ శరభ శార్దూలాది దుష్టమృగ రక్షకమై ఉన్నది. అట్లే ఆ క్రూర జంతువులు కాంతార రక్షకములై ఉన్నాయి. ఉభయ రక్షకత్వం అక్కడ నెలకొని ఉన్నది. ఆతడు కాకులుదూరని కారడవులను, చీమలు

దూరని చిట్టడవులను దాటుతూ ఒకపర్వత పాద పట్టణ సమీ పానికి వచ్చాడు.

## - కపటముని ఆశ్రమం -

అల్లంతదూరంలో ఇద్దరు అరణ్యక వేషధారు లెదురయ్యారు. వారేవేవో గుసగుసలు పోయారు. లొట్టలేసుకొన్నారు ఈజోగి పడుచు వాడు వెన్నపూసముద్ద. లేతపాకం నవుజు. కల్లు నంజుడుకు మా బాగా ఉంటాడు. వీడిదగ్గర ఏదో మూటగూడ ఉన్నది. అని ఊరిపో యారు. వారిలో ఒకడు ఇంకొకడితో ఒరే! నువ్వుపోయి ఈవిషయం యజమానివర్గానికి చెప్పు. గురుశిష్య సన్యాసన వేషాలు వేసుకోండి. నువ్వు అయ్యగారికి ఉపచారాలు చేస్తూవుండు. నేను ఈ పిలగాడికి మాయమాటలు చెప్పి తోలుకవస్తాను. రాత్రి విందు భోజనం చేసు కొంటాము ఉన్నకాసులు పంచుకొంటాము. జాగ్రత్త. పో పొమ్మ న్నాడు. వాడు తల ఎగరేసి వెళ్లాడు. వీడు నెమ్మది నెమ్మదిగా అడుగులేసుకొంటూ దగ్గరికి వచ్చి చూపులతో తినేస్తూ ఇలా ప్రశ్నిం చాడు.

వాడు:- బాబూ! మీదేవూరు? అసురసంధ్యాకాలమయింది. ఎక్క డికి వెడుతున్నావు?

దేవ:-మాది కైలాసం. భరతఖండంలోని సగరదేశానికివెడుతున్నాను.

వాడు:- కైలాసమా? అదెక్కడ? ఎక్కడైతే ఏమిలే. ఇపుడు నువ్వు సగరదేశానికి వెడుతున్నావా? అబ్బో! అదిచాల దూరమే? సాగ రికి పోవాలంటే రోజులు, వారాలు పడతాయి. పాపం పసి వాడివి. ఎక్కడో కైలాసంనుండి వస్తున్నానంటున్నావు. ఎప్పుడు తిన్నావో ఏమో! ఎప్పుడుబయలుదేరావో ఏమో! ఎండదెబ్బ తగిలి ముఖం కంది వాడిపోయింది. మా మునిపల్లెకు వచ్చి ఈ రాత్రి విశ్రాంతి తీసుకొని వెళ్లరాదా?

దేవ:- ఇక్కడ మున్యాశ్రమముందా? ఆవాతావరణం కనపడటం లేదే?

వాడు:- అదే బాబూ! ఆ గొఱ్ఱెల మందలు, గొడ్లమందలు పోతున్నాయే, ఆదారినే, ఆ కొండకోనలో ఆశ్రమముంది. అక్కడ నీవంటి కుఱ్ఱకారు మునులు, వయసు మునులు, ముసలి మునులు చాలామంది ఉన్నారు. వచ్చిచూడు నీకే తెలుస్తుంది. ఆపూరిపాక పై తలగోపురం అదిగో కనపడుతున్నదిచూడు.

దేవ:- ఆఁ అవును. ఆశ్రమాధిపతుల నామధేయమేమిటయ్యా?

వాడు:- పరివ్రాజక యతీంద్ర బ్రహ్మానంద స్వాములవారు.

దేవ:- అట్లయితే వారిదర్శనం తప్పక చేసికోవాలి. పద. ముందు దారి తీయుమన్నాడు. వాడు అట్లాగే అని ముందుకు అడుగులేస్తూ అబ్బాయీ! ఎంతసేపటినుంచో ఆమూట మోయలేక మోస్తున్నావు. అదినాకీయవయ్యా! మోసుకవస్తాను? అన్నాడు.

దేవ:- అది బరువైనదికాదు. నడువుమన్నాడు.

ఇద్దరేవేవో మాటలు చెప్పుకొంటూ నడచి ఆ కృతకాశ్రమంలోనికి ప్రవేశించారు, దేవలునిరాక గండుపిల్లుల గుంపులోనికి చిలుకపిల్ల వచ్చినట్లయింది. పర్ణశాలలో ఒకవైపు యజ్ఞకుండం మండుతోంది, కొందరు స్రుక్స్రువాలతో నేయి వంచుతూ ఆహుతులు చేవుతున్నారు. కొందరు పుష్ప మాలలు కడుతున్నారు. ఇంకొకవైపు వ్యాఘ్రాసనంపై యోగనిష్ఠా గరిష్ఠుడుగా ఉన్న ఒక పెద్ద జడదారి అటునిటు చూస్తూ స్ఫటిక జపమాల త్రిప్పుతున్నాడు. ఇద్దరు శిష్యులు జడదారిగురువుకు వింజామరలు విసరుతున్నారు. దేవలుడు ఆవాతావరణానికి సంబరపడుతూవచ్చి స్వాములవారికి నమస్కరించాడు, ఆ స్వామి క్రీగంట చూస్తూ పరమసుఖప్రాప్తిరస్తు అన్నాడు. వారిద్దరికి ఈక్రింది సంభాషణ జరిగింది.

దేవ:- స్వామీ! తాత్త్వికంగా మీనిర్ణయమేమిటి?

స్వామి.- **అయమాత్మా బ్రహ్మ.** నాయనా! విశ్వమూ **ఆత్మా** బ్రహ్మమే. **అహం** బ్రహ్మాస్మి. నేను బ్రహ్మమే.. **తత్త్వమసి.** నీవూ **ఆ** బ్రహ్మమౌతున్నావు.

దేవ:- బ్రహ్మమంటే ఎవరు స్వామీ!

స్వామి:- అవాఙ్మానస గోచరమైనది నాయనా!

దేవ:- బ్రహ్మము పరమ శివుడు కాదా, స్వామీ!

స్వామి:- కాదని ఎవరన్నారయ్యా? శివుని ఆజ్ఞలేక చీమైనా కదలుతుందా? అంతా శివమయం "నిరాకార సాకారమోంకారగమ్యమ్. సహస్రారమధ్యస్థ బిందుస్వరూపం. చిదాకారరూపం. శివోహం శివోహమ్" హరహర మహాదేవ శంభో, హరహర మహాదేవ శంభో-అంటూ అందరికి సైగచేశాడు అక్కడి వారందరూ పెద్దపెట్టున ఆపదాలు ఉచ్చరించారు. దేవలుడు ఆధ్వనికి సమాధి నిష్ఠుడయ్యాడు. ప్రక్కవాడు మాడుమీద దెబ్బవేయగా దేవలుడు క్షణంలో తేరుకొన్నాడు. కళ్లుతెరిచాడు.

స్వామి:- నాయనా, బిడ్డా! నీ పేరు?

దేవ.- దేవలుడంటారు.

స్వామి - నీ జన్మభూమి?

దేవ:- శివలోకమైన కైలాసం.

స్వామి:- ఆఁ. కైలాసమే? మరి ఇప్పుడెక్కడనుండి వస్తున్నావు?

దేవ·- వైకుంఠంనుంచి

స్వామి·- ఆఁ.. వైకుంఠంనుంచే? సరిసరి. బాగుబాగు. అచంకలోని మూటేమిటి?

దేవ·- నూలు కట్టలు.

స్వామి.- వాటివలన ఉపయోగం?

దేవ:- వస్త్ర సృష్టిచేసి బ్రహ్మసృష్టికి మానసంరక్షణ చేస్తాను. ఇది శివాజ్ఞ.

స్వామి:- ఓహెూ హెూ!! లోకోపకార కార్యాచరణకు పూనుకొన్నా వన్నమాట! మంచిపని. నీవు చాలమంచివాడవు నీరాక మాకు రాకాచంద్రోదయంలా ఉన్నది. ఉపకారబుద్ధిగలవారిని చూస్తే మాకెంతో సంతోషంగా ఉంటుంది. బిడ్డా! నీవంటి లోకోపకారికి ఆతిధ్యమిచ్చే అవకాశం కల్గినందుకు ఆనందపడుతున్నాము.

దేవ:- నేను ఆతిథ్యం కోసంరాలేదు. మీదర్శనంకోసం వచ్చాను.

స్వామి:- అలాగే... ఒప్పుకొంటాను. దర్శనం చేసికొన్నావుగదా! స్పర్శనంగూడ ఉండాలి. మా ఆశ్రమంలో అడుగు పెట్టడంతో నీవు మావాడవైనట్లే. నీవు మా కంటికి అమృత కలశంలా ఉన్నావు. నీమాటల్లో అమృతమున్నది. చూపుల్లో అమృతము న్నది. అమాంతం నిన్ను జుర్రుకోవాలి అన్నంత ఆశగా ఉంది. అంతరుచిగలవాడవు.

దేవ:- స్వాములవారికి జిహ్వాచాపల్య మున్నట్లున్నది. దాన్ని కోసి వేయాలి.

స్వామి:- అదివీలుకాదులేవయ్యా! మూతిదేనికి? మేతకుగదా! ఒరే శిష్యులారా! ఈపిలగాడికి దేహశుద్ధికావాలి. సోమపానం పట్టిం చండిరా అన్నాడు.

ఒక శిష్యుడు ముందుకువచ్చి సోమపానంతో అతిధి సత్కా రము ప్రారంభమౌతుంది ఇదిగోపాత్ర. త్రాగరా. అని ఈయబో యాడు దేవలుడు ఉలిక్కిపడి త్రాగరా ఏమిటి? భాష మారిందే? దుర్వాసనగా ఉంది. అది సోమరసమెలాఅవుతుంది? అయితేమాత్రం నేనెందుకు త్రాగాలి? అన్నాడు. స్వామి ఒరే గడుగ్గాయి! పిట్ట కొంచెం కూతఘనంగా ఉన్నదే, గుడ్లగూబిలా చూస్తావేమిరా? ఇదిగో చూడు. స + ఉమ = కలిపితే సోమ అవుతుందిరా, మీ ఉమా

మహేశ్వరులు త్రాగేవిరా. అది శివామృతంరా. ఏమిరా, అందు కోవు? పిల్లకాకికేంతెలుసు ఉండేలుదెబ్బ ఒరే, శిష్యా, వీడికిదేమి అర్థంకానట్లుంది. ఆనందా! ఒక్క దెబ్బవేసి రసం పట్టించండిరా. అన్నాడు. ఒకడు దేవలుణ్ణి పిడికిటిపోటుపొడిచి ఇది నీవుత్రాగితే నీ శరీరమాంసం శుద్ధి అవుతుంది. నువ్వు శుద్ధి అయితే ఈ యజ్ఞ కుండం నిప్పుల్లో కాల్చుకొని నిన్నుతింటాముగా. వెధవాయ్! తొంద రగా త్రాగరా అని గదమాయించాడు.

దేవలుడా పరిస్థితిని ఎదుర్కోటానికి మౌనంతో ఆలోచిస్తు న్నాడు ఆపెద్ద జడదారి గుర్రుముతూ ఒరే, శిష్యా! ఇంత అల స్యమా? ఇక వాడు త్రాగడు. వాణ్ణిపట్టుకొని సోమరసం నెత్తిమీద పోసి నిప్పులమీద పెట్టండిరా అన్నాడు వీడు వంటింటి కుందేలు. ఇంకెక్కడికి పోతాడు? అని ఆకపటముని వేషధారులు దేవలుణ్ణి పట్టుకోబోయారు. వలను తన్నేసి బయటపడ్డ గండుమీనులా దేవలుడు వారిని విదలించుకొని పర్ణశాల లోపలనుండి బయటకు వచ్చాడు.

## దేవలుడు రాక్షసులతో యుద్ధము చేయుట

ఆ రాక్షసులు వచ్చి మీద పడ్డారు. దేవలుడు విష్ణువును ధ్యానించి చక్రధారతో వారి శిరస్సులను ఖండించాడు. పదిమంది రాక్షసులు ఖడ్గహస్తులై పైకివచ్చారు. శివాత్మజుడు వారిని సంహ రించాడు నూరుమంది మనుజాశనులు వివిధాయుధాలతో వచ్చి ఎదుర్కొన్నారు. వారు క్రమంగా విగతజీవులయ్యారు వేయి మంది రేద్రిమ్మరీంద్రుడు మిడతలదండువలె, ఉసిళ్లపుట్టవలె వచ్చి చుట్టుముట్టారు, దేవలహస్త ముక్త చక్రం అనేక చక్రాలై విజృంభిం చింది. వారును గుత్తులుగుత్తులుగా తెగిపోయారు.

అప్పుడు రాక్షస నాయకులైన వజ్రముష్టి, ధూమ్రవక్త్రుడు, ధూమ్రాక్షుడు, చిత్రసేనుడు, పంచసేనుడు అనువారు పరిస్థితి గమనించి వీడు పిల్లవాడు గాదు పిడుగు. మ్రింగరాని కబళం. చిన్నపామునైనా పెద్దకఱ్ఱతో కొట్టాలి. అని కూడబలుకుకొని సేనలను సమకూర్చుకొని తలపడ్డారు. దేవల కరప్రసారిత చక్రం ప్రచండ మార్తాండ మండలంలా మెరుగులు తురంగలించి కనులు మిరుమిట్లు గొల్పుతూ ప్రళయకాల పర్జన్య గర్జానుకారియై దిక్కుడ్యాలు గ్రక్కదలి పోయేటట్లు బొబ్బరిస్తూ రక్కసి మూకలను జక్కాడసాగింది. కొందరి తలలు తెగి తన్నిన బంతులవలె పైకెగిరి పోతుంటే- మొండెములు స్తంభాలలా నిలబడి పోతున్నాయి. కుప్పించి ఎగసేవారి తలలు, చేతులు, కాళ్లూ ముక్కలు ముక్కలై పోతున్నాయి. వజ్రముష్ట్యాది రాక్షస వీరనాయక పంచకం క్రోధ ఘూర్ణిత తామ్రాక్షులై కహకహారావాటులతో వికటాట్టహాసాలతో దేవలునిపైకి వచ్చారు. అతడు సమంత్రకంగా మరల చక్రం ప్రయోగించాడు. అది పంచరూపాలుగా విభక్తమై ప్రచండ జ్వాలలు క్రక్కుతూ విరోధి శిరోధులు తాకింది. తాకుటతోనే చందన శీతలప్రాయాలై ఆ అయిదు చక్రాలు తిరిగి ఒక్కటై అది దేవలుని చేరుకొన్నది.

చక్రం వ్యర్థమైనందుకు అసురులు అవహేళనగా కేకలేస్తూ ద్విగుణీకృతోత్సాహంతో ఆయుధాలు గుప్పించారు దేవలుడీసారి చూద్దామని మరల చక్రం ప్రయోగించాడు. అది విభక్తమై శత్రువులను తాకి మునుపటిలా వ్యర్థమయింది. అదానవులు మరల పిల్లి కూతలు, కుక్క అరపులు, కోతిచేష్టలు ప్రారంభించారు. ఆ పంచ వీరయోధులు వివిధాయుధ ప్రయోగాలతో దేవలుని శరీరం జర్జరితం చేశారు. శరీరమంతా జల్లెడతూంట్లయి రక్తం కారుతూ పూచిన మోదుగ మొక్కలా ఉంది. రక్త స్రావంతో బలం తగ్గిపోయింది.

కాళ్లు తేలిపోతూ నేలమీద నిలబడలేకపోతున్నాడు. కళ్లుతిరుగ సాగినాయి. చేతిలో చక్రం తప్ప ప్రత్యాయుధంలేదు. యుద్ధంచేసే శక్తి క్రమంగా సన్నగిల్లిపోతోంది. వజ్రముష్టి రాక్షసుని వజ్రసదృశమైన బాణం దేవలుని గుండెలో గ్రుచ్చుకొని దూసికొనిపోయింది. ఆదెబ్బకు తాళలేక అమ్మా! అని కేకపెట్టి నేలపై వాలిపోయాడు. అతడు ఆ బాధతో ఆత్మకేంద్ర బిందువు పైకెగసి అంబికను ధ్యానించాడు.

## - శ్రీ చౌడేశ్వరీదేవి అవతరణం -

వెంటనే రాక్షసులు మిఠాయిపై ఈగలవలె మూగబోయారు. కాని, అడుగుముందుకుపడక స్తంభించి ఇదేమని విస్తుపోయి చూస్తున్నారు. అంతలో ఆకాశంలోనుండి ప్రణవశబ్ద తరంగాలు ఘంటాగణగణ ఘోషలా వినవచ్చాయి. అది అషాఢమాసం అమావాస్య. అర్ధరాత్రి. రోదసీ కుహరం కటికి చీకటితో కాటుక కాయలా ఉంది. ఆ ప్రణవధ్వనిలో ఒక దివ్యతేజోబిందువు కారుచీకట్లను కరగిస్తూ తోచింది. అది తత్క్షణమే కదలి పెరుగుతూ జ్యోతిగా, అఖండ జ్యోతిగా, మహాజ్యోతిగా, పరంజ్యోతిగా, చిజ్జ్యోతిగా వెలుగుతూ సమస్త విశ్వాన్ని వెలిగిస్తూ దేవలునికి ప్రక్కగా వచ్చి నిలిచింది. సర్వజ్యోతిస్సులకు మూలజ్యోతియైన ఆచిజ్జ్యోతి ఆది పరాశక్తిగా రూపొంది - క్రిందపడి కెవ్వుమన్న పసిబిడ్డకేకవిని పరుగున వచ్చి గుండెకు హత్తుకొనే తల్లిలా అమృతహస్తంతో దేవలుని నిమిరి లేవదీసింది; గుండెకు హత్తుకొన్నది. దేవలుని కాయం గాయాలు లేక పూర్వంవలె తేజోవంతమైంది.

అప్పుడు బ్రహ్మాది దేవతలు పుష్పవృష్టి కురియిస్తూ జయజయ ధ్వనులతో వచ్చి, కోటి సూర్యప్రభాభాసమానమై ధగధగ ప్రకా

శిష్టోన్న బృహద్రత్న చూడాలంకృత శిరస్కయైన దేవిని చూచి మొక్కి చూడాంబ, చౌడేశ్వరీ, చాముండీశ్వరి అని కీర్తించారు. దేవలుడు గూడ వారితోపాటు అంబా, చౌడేశ్వరీ! శరణు శరణు. పాహిమాం పాహి మామ్ అన్నాడు.

ఇదంతా రాక్షసులకు దేవలుడు చేసే ఇంద్రజాలమనిపించింది. ఏమిచేసినా, ఎంతచేసినా వచ్చింది ఆడదేగదా! ఉరిమి చూస్తే వణకిపోయేఒకఆడది కొండంత వీరయోధుల్ని ఏమిచేస్తుంది? చల్లని పిల్లగాలి పూదీవలను కదలిస్తుందిగాని, కొండల్ని కదలిస్తుందా? అని అనుకొంటూ ఆపరిణామాన్ని పరికిస్తున్నారు. వెకిలి చేష్టలతో నవ్వుతున్నారు.

అయినా, ఆజగజ్జనని రాక్షసులకు మృత్యుదేవతగా, దేవలునికి మాతృదేవతగా కనపడుతోంది. ఆ అపరాజితాదేవి సింహవాహనయై మంజు మంజీర శింజాన లాక్షారంజిత చరణ కంజాతయై బంగారు జరీ పేటంచు బుటా తొగరుపట్టుచీర కట్టుకొన్నదై నవరత్న ఖచిత కాంచన కాంచీదామం నడుమున తాల్చినదై లేతాకు పచ్చ పట్టు జరీ బుటా రవికె తొడుగుకొన్నదై మెడలో చింతాక పతకంతో రత్నహారాలు ధరించినదై ముక్కు ముంగర, వజ్రకలిత సువర్ణ కర్ణావతంసం, కుంకుమ తిలకం కలదై ఫాలనేత్రాధిక్యంతో చంద్ర రేఖతో దివ్యరత్నకీలిత కిరీటంతో ప్రకాశిస్తూ చతుర్బాహువులందు చక్రత్రిశూల ఖడ్గ బాణాద్యాయుధాలు కలిగి శ్యామాంగియై దేదీప్యమానంగా వెలుగొందుతోన్నది.

## - వజ్రముష్ట్యాది రాక్షసులతో అమ్మవారి యుద్ధం -

ఆయమ్మ దృష్టులు రాక్షసులపై క్రోధాగ్ని వృష్టులు కురుస్తున్నాయి. దేవలునిపై ప్రేమామృత వృష్టులు కురుస్తున్నాయి.

ఆ లోకేశ్వరి రాక్షసులకు దవ్వయి క్రొవ్వణగించేట్లున్నది. దేవలు నికి దాపై ప్రాపై స్తన్యం చేపుతోంది ఆ చౌడేశ్వరి దేవలుని భుజముపై చేయివైచి వత్సా! నీకభయమిస్తున్నాను. ఇక తలపూవాడక విశ్రాంతి తీసికో. నిర్వక్ర పరాక్రమ విక్రములై అజేయులై అఖర్వ వర గర్వాంధులై దర్పోద్ధతులైన ఈ క్రూర రాక్షస వీరయోధుల్ని రణాంగణమందు క్షణంలో నాశనంచేస్తాను. ఈ కాళి యుద్ధకేళి సాక్షివై పరిశీలిస్తూఉండుమని తనసింహ వాహనాన్ని రాక్షసుల మీదికి నడిపించింది. ఈ పసివాణ్ణి ఒంటరివాణ్ణి చేసి చంపబూను కున్నారటరా? పశువుల్లారా! మీ పాశవిక శక్తుల్ని నాశనంచేసిదైవీయ శక్తుల్ని ఆవిష్కరించడానికి వచ్చాను. మీ భుజబలం బుద్ధిబలం ఏపాటివో మీ శస్త్రాస్త్ర పాండిత్య శౌండీర్యమేపాటిదో నాముందు చూపండి అని సింహనాదంచేసింది. సింహంగూడ రోదసీకుహరం విదళన మయ్యేట్లు గర్జించింది.

ఇంతవరకు దేవలుడేదో గారడీ తంతు చేస్తున్నాడనీ, వాని మాయలకు ఈసృష్టి జరిగిందనీ భావిస్తూ అమ్మవారి రూపసౌంద ర్యానికి రిమ్మతెవులుపుట్టి వికారాలుపోతున్న మున్నిక్కిడి రక్కసులు వికటంగా నవ్వుతూ మదవతీ! మావంటి వీరాగ్రేసరులు ఒక అబలా రత్నంతో యుద్ధానికి తలపడటం మాకే అవమానం అదీగాక, శిరీష కుసుమ పేశల శరీరవైన నిన్ను మారణాస్త్రాలతో ఎదుర్కొనడం సిగ్గుచేటు. మల్లెపువ్వులపై నిప్పులు పోసె అరసికులం కాము. మేమొక మాట చెప్తాము. వింటే ఉభయతారకంగా ఉంటుంది. నీవు చూపే ప్రేమనుబట్టి వీడు నీబిడ్డలాఉన్నాడు. నీవెంతోచక్కని చుక్కవు; ఒప్పులకుప్పవు; అందాల నాట్యమయూరివి, ఒయ్యారివి. నీవు మాదానవైతే వీణ్ణి హింసించడం మానుకొంటాము. నీకూ, నీబిడ్డకూ అన్నిసౌకర్యాలు కలుగజేస్తాము మాలో ఒక్కరిని ఎన్ను కొన్నాసరే. లేదా, మాయైదుగురిని పెండ్లాడినాసరే. అది నీ యిష్టానికి

వదలేస్తున్నాము నీ అందచందాలు అడవిగాచిన వెన్నెలగా చేసి కొనక, సార్థకం చేసికొమ్మన్నారు.

అంబ నేత్రత్రయినుండి నిప్పులు చెరుగుతూ ఏమికూశారురా? మీ నాలుకలు చీలికలుచేస్తాను నేను అబలనా? మిమ్మల్ని పెండ్లాడాలా? నేను అబలనో సబలనో ఇప్పుడే ఋజువు చేస్తాను. మీకు పెండ్లాము కావాలటరా? మీ పాలిటి మృత్యువునై వచ్చాను. కాల సర్పం పూదండ ఔతుందా? విషవల్లి పూదేనె విషమై అసువులను గ్రసిస్తుంది. నన్ను సామాన్యస్త్రీగా తలచారటరా? నేను అసామాన్యను, జగన్మాతను, తల్లి పెండ్లామౌతుందటరా? నేను మీకుకూడా తల్లినైనా మీపై కత్తిగట్టి వచ్చాను. మీ కండలుచెక్కి కాకులకు, గ్రద్దలకు వేస్తాను.

సత్త్వగుణ సంపన్నుడైన విష్ణుదేవుని వలన జన్మించినవారై మీరు సత్త్వగుణం అలవరచుకొనక తమోగుణ ప్రవిష్టులై మనుజ మాంస భోజనులయ్యారు. మీకు ఏ అపరాధంచేయని ఈ బిడ్డను చంపబూనుకొన్నారు. మీకు కండకావరమెక్కి కళ్లకు పొరలుక్రమ్మి జగన్మాతనైన నన్ను పెండ్లాము కమ్మని కారులుకూస్తున్నారు ఈ కారణాల వలన దురహంకారపూరితులు, దుర్మార్గాచరణులు, పాపాత్ములైన మిమ్మల్ని లోక కల్యాణంకోసం చంపవచ్చాను. ఇక మీ అబ్బను తలచుకోండిరా అని తన తేజస్సును కిరీటరత్నకాంతులందు ఇనుమడింపజేస్తూ బ్రహ్మాండం బ్రద్దలయ్యేట్లు సింహనాదంచేసింది. ఆ పెడబొబ్బకు గుండెలవిసి కొందరుదానవులు గ్రుడ్లు తేలవేశారు. ఆకిరీట రత్నకాంతులు సూదులై కళ్లలో గ్రుచ్చుకొని పాపలు మాడి పోయి, ఒళ్లు మండిపోయి చాలమంది నేలగూలారు.

రాక్షస వీరపంచకం క్షణకాలం శిలా ప్రతిమలవలె చేష్టలుడిగి మరల తేరుకొన్నారు. ఒక ఆడది గాడిదలా ఓండ్రపెట్టి

మనల్ని ఆదలిస్తుందా? బెదరిస్తుందా? మనమంత వాజెమ్మలమా? ఈక్షణం వరకు ఇంద్రాది దిక్పాలకులను ముప్పతిప్పలబెట్టి, మూడు చెఱువుల నీళ్లు త్రాగించాము. ఇంతవరకు మనల్ని నిరోధించే ప్రాణి పుట్టనేలేదు. ఈపె చంపుతానంటుందేమిటి? మనం విష్ణువు నుంచి పుట్టినట్లు ఎలా తెలుసుకోగల్గింది? తానేమో జగన్మాత నంటున్నది. ఒకవ్యక్తి జగత్తును కని తల్లి అయినదంటే మనం ఒప్పుకోము ఈపె జగన్మాతృత్వమేమిటో కాస్తకదలించి ఊపి చూస్తామని అనుకొంటూ వారు దీపజ్వాలపై రెక్కలపురుగుల్లా దేవిపై వారసిల్లారు.

వజ్రముష్టి రాక్షసుడు ధనుష్టంకారం చేసి మేఘాస్త్రం ప్రయోగించి కాంతులకడ్డంగా నీలిమబ్బుల పరదాలతో కారుచీకట్లు కల్పించాడు. వాడు గావుకేకపెట్టి చూడు, నాప్రతాపమంటూ ఓసీ! నీవు జగన్మాతనని వాగుతున్నావు. మనిషికి మనిషే పుడుతున్నాడు, పిట్టకు పిట్టే పుడుతున్నది. చెట్టుకు చెట్టే పుడుతున్నది. నీ నుండి పుట్టేదంతా నీరూపంగా ఉండక ఈప్రపంచం పురుగులతో, పాములతో నక్కలతో కుక్కలతో ఎలుగులతో పులుగులతో, చెట్లతో చేమలతో ఉన్నదేమిటే? ఈప్రపంచానికి మూలం ఒకవ్యక్తిఅంటే మేము నమ్మము అని అన్నాడు.

అంబ వెంటనే వాయవ్యాస్త్రం ప్రయోగించి మేఘాస్త్రాన్ని అణచి నీలిమబ్బులతోపాటు కారుచీకట్లను పారద్రోలింది. ఓరీ! రాక్షసాధమా! నీ మేఘాస్త్రం మట్టికరచింది. చూశావా? ఓరీ! నాజగన్మాతృత్వం నిరూపించి నీకు నమ్మకం కల్గించవలసిన అవసరం నాకులేదు. అయినా, నీకొక్క ఉదాహరణమిస్తాను. సూక్ష్మ జ్ఞానముంటే ఆలోచించి అర్థంచేసికొంటానికి ప్రయత్నించు.

నీ స్వప్నస్థితికి నీవే ఆధారం నీస్వప్నదృశ్యాలన్నీ నీలోనుండే కలుగుతున్నాయి. అవన్నీ నీరూపంగానే ఉండక వేరువేరు రూపా

లతో ఉంటున్నాయేమిరా, పశువా? - నీరూపం సైతం ఒకవిధంగా ఉందా? కన్నుల స్థితివేరు, చెవులస్థితివేరు. చర్మావృతమైన నీశరీరం సప్తధాతువులతో ఉన్నది. ఈమాంస పిండంలో శక్తిఉన్నది శక్తిలో చైతన్యమున్నది. శక్తి చేతనా ! వశంవదమై సృష్టి జరుపుకొంటో న్నది. ఆశక్తిని నేనురా! అన్నది

అంతట ధూమ్రవక్త్రుడు బాలా! అందంగా మాట్లాడుతున్నావు. ఇదిగో అగ్నేయాస్త్రం కాచుకో. నీఅందం కందిపోకుండా చూచుకో అని ప్రయోగించాడు. అది గర్జిస్తూ తర్జిస్తూ జ్వాలా మాలికలు సృష్టిస్తూ పాలికలనిలో తీవ్రతాపం కలుగజేసింది. వాడు వికటాట్ట హాసం చేస్తూ కారుణ్యవతీ! నీవు జగన్మాతనని సమర్థించుకోవడం' ఉపపత్తులు చూపడం ఇతరులంగీకరింపక పోయినా మేమంగీక రిస్తున్నాము. అందుకొక పరమార్థమున్నది. జగన్మాతనని చెప్పుకో వటంలో నీకు స్వాతంత్ర్యమున్నట్లే, జగత్పితరులమని చెప్పుకోవ డంలో మాకునూ స్వాతంత్ర్యమున్నది. నీవు రూపంతో ఉన్నావు. మేమూ రూపంతో ఉన్నాము. మేము విష్ణుదేవుని వలన జన్మించా మని నీవే చెప్పావు. అందుచే మాకూ దేవత్వమున్నది. నీవూదేవత నంటున్నావు ఏతావతా నీశక్తి, మాయుక్తి సమతాస్థితిలో ఉన్నది నీకూ మాకూ సాంగత్యం సమకూరితే బంగారానికి పరిమళ మబ్బి నట్లవుతుంది. ఈ చివ్వలో నిన్ను నొవ్వజేయడం మాకే రవ్వ సుమా! కవగూడి గువ్వలా ఉంటాము ఏమంటావని అన్నాడు

ఇంతలో చాముండీశ్వరీ కోదండ గండశిలా వినిర్ముక్త వారుణాస్త్ర నిర్ఝరీ జల ప్రవాహం ఆగ్నేయాస్త్రాన్ని భగ్నపరచి జ్వాలా మాలికలను తుడిచివేసింది. కాగి వేగి పోయిన కదనభూమి సన్న జల్లుతో చల్లబడింది. అంబిక కలుగజేసికొని ఏమిరా, నీ అగ్గి బాణం బొగ్గులయింది. వాచాలా! మీరు జగత్పితృత్వం చెప్పుకొం

టారా? పితృత్వమంటే ప్రేమామృతం చిలుకరిస్తూ పలుకరించి రక్షించడమా? లేక, కత్తులతో, గొడ్డళ్లతో అమాయికుల మీద బడి చంపుకొని భక్షించడమురా? బెబ్బులి మేకలను పట్టినట్లు మద్యపానంచేస్తు మనుష్యులను పట్టి వారి రక్త మాంసాలను తినమరిగిన మీకు జగత్పితృత్వం సంభవిస్తుందా? మీరు హంతకులు, జారులు చోరులు లోకసౌందర్య వినాశకారులు క్రూరులు. మీ స్తన శల్య పరీక్షలు, ఎత్తులు, జిత్తులు, గారడీలు యుద్ధప్రలాపాలు, శస్త్రాస్త్ర ప్రయోగ నైపుణ్యాలు నాదగ్గర పనిచేయవురా! అనిఅన్నది.

ధూమ్రాస్యుడు నవ్వుతూ అంతమొండిదానవా చండీ! ఇదిగో సర్పాస్త్రం. నీ ప్రాణవాయువులను గ్రోలి నిన్ను బలిగొంటుంది. కాచుకొమ్మని ప్రయోగించాడు. అది బుసగొడుతూ త్రాచుపాముల్ని విసర్జిస్తూ రంయ్‌మని వస్తున్నది. వెంటనే అపర్ణాదేవి సుపర్ణదైవత గారుడాస్త్రాన్ని ప్రయోగించి దాన్ని వ్యర్థంచేసింది

చిత్రసేనుడు జాంతవాస్త్రం ప్రయోగించాడు. దానివలన పులులు, చిరుత పులులు, ఏనుగులు ఎలుగుబంటులు మున్నగు అడవిజంతువులతో భండన భూమి నిండిపోయింది. పరమేశ్వరి సింహవాహనాన్ని అదలించి దూకించింది దాని భీకర గర్జనలకు జంతువులన్ని భయంతో తిరుగుముఖమై రాక్షస సైన్యంమీద బడి చీల్చి చెండాడినాయి. వారే వాటిని హతమార్చవలసి వచ్చింది.

పంచసేనుడు వంచనావ్యాపారంతో ఆకుసుమకోమలి కొప్పు పట్టి ఈడ్చుకొని వస్తానని ప్రతిజ్ఞచేసి ఆకాశంలోనికెగిరి అదృశ్యుడయ్యాడు. వాడు గాలిలో తేలాడుతూవచ్చి చేరువైనంతనే ఎండకు మంచుపొర విచ్చినట్లు వానిమాయ విచ్చిపోయింది. వాడు దృశ్యుడయ్యాడు. కాళిసమరనాట్యశీలియైపడగెత్తినపామువంటిత్రిశూలాన్ని

సారించి చేతికొలది విసరివైచింది. దానితో వాని శిరస్సు తెగి పడిపోయింది మిగిలిన శరీరభాగం గగనాన వింతనాట్యంచేసి చివరికి పడిపోయింది

పంచసేనుడు పంచత్వం చెందటంతో మిగిలిన సోదర చతుష్టయం కోపారుణితనేత్రులై పళ్లు కొరుక్కుంటూ అసంఖ్యాకమైన మూలబలాన్ని తోడుచేసికొని పొట్టేళ్లు కొండను ఢీ కొన్నట్లు వివిధాయుధాలతో చూడాంబను ఢీకొన్నారు. వారి సహస్రాధిక బాణ వర్షపాతం కొండమీద వానజల్లులా ఆతల్లిమీద వృధా అయింది. అయినా అందరూ ఆమె జగన్మోహన దివ్యసుందరాకారానికి సమ్మోహితులై కారుణ్య లావణ్య రూపరేఖా విలాసాలు చెక్కుచెదరకుండా కనుగందకుండా ఆమెను పొదివి పట్టుకోవాలని కడలి ఉప్పెనలా మరి మరీ దగ్గరకు రాసాగారు. ఆదుష్టుల దుస్తంత్రం గుర్తించి కాకుల గుంపుపై రాయి విసరినట్లు ఆ కామాక్షి గదను గిర గిర త్రిప్పి వారిపై విసరివైచింది అది భీకర ధ్వనితో ఉరవళ్ళు పరవళ్ళు త్రొక్కుతూ అందరినీ మోదసాగింది దానితో రాక్షస సేనావాహిని చెల్లాచెదరై కకవికలై గందరగోళంగా పారిపోసాగింది.

దైత్య వీరనాయకులు ఆ ఉపద్రవమెట్లో తప్పించి అందరిని చేరదీసి ఇక వైరి నిర్మూలనమే ప్రధానాశయమని యుద్ధానికి పూరికొల్పారు. అందరూ జారిన కాసెలు బిగించి ఆయుధాలతో అప్ఫటిస్తూ ఆహవదోహలులై నిలిచారు. బాకులు, బరిసెలు, బల్లెములు, ఈటెలు, గొడ్డళ్ళు, కత్తులు పుంఖాను పుంఖబాణ పరంపరలు గగన వీధిలో మబ్బులులేని మెరపులై మెరుస్తూ, కాత్యాయనిని కప్పివైచాయి. అయమ్మ చక్రప్రయోగముతో వాటిని తుత్తురుము చేసి కామరూపిణియై కత్తి డాలు పట్టి ప్రతివీరునకు ప్రతి వీర వనితయై ముఖాముఖి తలపడింది. చేతికి చిక్కినట్లే అందరికి చేరు.

వయింది. ఎక్కడచూస్తే అక్కడ తానై వీరవిహారం చేసింది. ఖడ్గ విద్యాకౌశలం చూపిస్తూ ప్రతిదెబ్బ చెప్పికొట్టింది. ప్రతిపోటు చెప్పి పొడిచింది. ఆమె ఖడ్గ ప్రహారాలకు శత్రువుల తలలు తెగిపోతున్నాయి. గదా ఘాతాలకు రొమ్ములు పగిలి గుండెకాయలు ఊడిపడుతున్నాయి. మాడు పెంకులు లేచి మెదడు దిబ్బలు, దిబ్బ లుగా పడుతున్నాయి. చక్రాహతులకు తనువులు తునా తునకలవు తున్నాయి. సింహ వాహనంగూడ దంష్ట్రాటంక కోటీ పుటాలతో ఎందరనో చీల్చి రక్తపానంచేసింది, ఆభయంకర సంకుల సమ రంలో పేరుమోసిన వీరయోధులెందరో కంఠ తుండెములై భూమికి ఎరువయ్యారు. నేల నెత్తురు మడుగు కట్టింది. ఆరక్త ప్రవాహంలో ఖండిత శిరస్సులు, మేదోమాంస ఖండాలు కొట్టుకొని పోతు న్నాయి.

ఆసంగ్రామ రంగస్థలం ఒకయజ్ఞశాలకాగా, ధర్మకోప, అధర్మ నిరసనద్వయం అరణి మధిత జ్వలితాగ్ని కుండమ యింది. కరుణా ప్రసార అభయ ప్రదానాలు అజ్య సంగృహీత స్రుక్స్రువాలు అయినాయి. రక్షోవీరసేనలు సమిధలయ్యారు. సాలం కృత చక్రత్రిశూల ఖడ్గగదా ద్యాయుధయుత చతుర్బాహు సమన్విత సావష్టంభ విజృంభిత చాముండీశ్వరీదేవి హోత - దేవల మను బ్రహ్మ అధ్వర్యుడు అయినారు

దేవలుడు బ్రహ్మవిద్యా సాధకుడుకాగా, సాధనాలబ్ధ శుద్ధ చైతన్యం శక్తిగా ఆవిర్భవించింది. అద్వైతైక శుద్ధ చైతన్యశక్తి తమో గుణ వాసనా బీజ వికసిత సమస్త సంకల్ప వికల్ప దుస్సంకల్ప రాక్షసబలాన్ని మూలముట్టగా తుడిచివేసింది.

అన్నదమ్ములు అగ్రోహోదగ్రులయ్యారు. ముందువెనుక ఎట్టి బలగమూ లేదు. ఇక తమ శాంబరీ విద్యా ప్రభావంతో దేవిని

ఎదుర్కొదలచారు. నలుగురు నాలుగువైపులకు వచ్చి అదృశ్యు లయ్యారు. ఆదేవి ఉన్నమిత ఫాలనేత్ర జ్వాలకు వారి మాయాయవ నికాపటం దగ్ధ పటలమయింది. పొయ్యిసెగ పొంతకుండకు తగిలి నట్లు ఆ మంట వారి ఒంటికిగూడ అంటుకొన్నది దానితో వారి తిక్కకుదిరి ఖడ్గపాణులై చావో బతుకో తేలిపోవాలని ఒక్కొక్కర్లు ఒక్కుమ్మడి మీదకు వచ్చారు. అంబ దిక్కులు పిక్కటిల్లేట్లు, ఆకాశం హూరెత్తేట్లు అట్టహాసం చేసింది. ఆయమ్మ మల్లెమొగ్గల వంటి తెల్లని పలు వరుస కాంతులు వేయి చందమామల వెన్నెల వెలుగుల వెల్లువలై నేలనింగి అంతట పరచుకొన్నవి. దానితో ఒకనాటి వాసనా బీజాలుగ ఉన్న శుక్రుని కుమార్తె దేవయాని శాపాక్షరాలు వారి హృదయాకాశంలో తళుక్కున మెరిశాయి. ఈ స్త్రీ చేతిలో మీరు మరణిస్తారు అని హృదయం పలికింది.

అంతతమ్ముడే అంతమయ్యాడు. ఇంతదాక వచ్చి ఒక ఇంతికి వెరచి ముండలవలె ముసుగు వేసికొంటామా? పిరికి కండ ఎరుగుని బిరుదు మగలం. చావవలసివస్తే చస్తాము. చంపగలిగితే చంపుతాము అంతేగాని మడమత్రిప్పేది లేదని అనుకొంటూ ఆ దానవ సోదరులు వికటా వష్టంభ సంరంభంతో బారకత్తులు ఝుళిపిస్తూ చెదపురుగులు నిప్పుపైకి ప్రాకినట్లు, కప్పలు పడగ విప్పిన త్రాచు పైకి ఎగిరినట్లు దేవిని ఢీకొన్నారు.

రుద్రాణి రౌద్రోద్రేకంతో సింహవాహనాన్ని దూకించి మహా కాళంవంటి చేతిలోని త్రిశూలాన్ని చకచ్చకితంగా ఊపుతూ ఆరేద్రి మ్మరుల రొమ్ములన్ని నజ్జు నజ్జుగా పొడిచింది. నెత్తురు సెలయేళ్లవలె జాల్వారుతూ నేలరొంపి కాసాగింది. అయినా, వారు గుండె దిటవు చెడక రెక్కల పర్వతాలవలె కవిసి కాత్యాయని కాయాన్ని గాయ పరచాలని మాయా రూపధారులై ఆయుధాలు మార్చి మార్చి

ప్రయోగిస్తూ విఫల ప్రయత్నాలు చేశారు. చివరికి దివ్య తేజో దుర్నిరీక్షణయైన అకామాక్షిరూక్షేక్షణాలతో ఆరాక్షసులతేజస్సునూ తీవ్రోచ్ఛ్వాసంతో వారి ప్రాణవాయువుల్ని ఆకర్షిస్తూ త్రిశూల ప్రహారాలతో వరుసగా వజ్రముష్ట్యాది రాక్షసుల శిరస్సుల్ని నరికి వేసింది. దానవ పీడా పరిహారమవడంతో దేవతలు పూల వర్షం కురిపిస్తూ దేవ దుందుభులు మ్రోయిస్తూ విజయ గీతాలాపన చేశారు అంతలో వేగుజుక్క పొడిచింది తూరుపు తామర పువ్వు తెలిరేకలు విరుస్తున్నాయి.

దేవలుడు భక్త్యానంద కందళిత హృదయారవిందుడై కర యుగళము ముకుళించి ఆనంద బాష్పములు రాల్చుతున్నాడు. తన అంతర్దృష్టికి అంబ పరంజ్యోతి స్వరూపిణిగా చల్లని తెలికన్నుల నుండి కరుణామృత పూరాన్ని, గుబ్బచన్నుల నుండి మధుర క్షీర పూరాన్ని స్రవిస్తూ మాతృ స్వరూపిణిగా కనపడుతోంది. అతడు బ్రహ్మాది దేవతలు భావించినట్లు అంబికను చౌడేశ్వరిగా, చూడాంబగా చాముండీశ్వరిగా భావిస్తూ ఇట్లు స్తుతించాడు.

శ్లో॥ ప్రాతః స్మరామి శివమానస పద్మహంసీం
చౌడేశ్వరీం త్రిణయనాం పరమార్థరూపామ్!
బ్రహ్మాండ భాండ మణిమండిత గర్భపేటీం
జ్యోతిర్మయీం భగవతీం శ్రిత కల్పవల్లీమ్!

శ్లో॥ జననీ జనకౌచ, గురుశ్చశివా.-కులదైవత, మాతృకలాచ శివా,
స్మిత చంద్రికయా, మృదువాక్సుధయా-మమ జీవనదీపశిఖా
జయతే.

సీ॥ శ్రీ చక్రమందున చింతామణీపీఠి
జ్యోతిర్మయిగ వెల్గుచుంటివమ్మ!
జగము రూపించెడి ముగురు మూర్తులకును
ముగురమ్మలకు మూలమగుదువమ్మ!
ఉభయసంధ్యల మధురోద్ధత శివతాండ
వా కృష్టవై నాట్యమాడుదమ్మ!
స్వాంశ కళామూర్తులవతరింపగజేసి
లోకభీకరులను ద్రుంతువమ్మ!

భక్తజనులకు ముంగొంగు బంగరువట;
పరమతులకు చంద్రాదామృత వర్షిణివట;
రసికులకు సచ్చిదానంద లక్ష్మివమ్మ!
శరణు! చౌడేశ్వరీదేవి! శరణు, శరణు

## దేవలుడు నూలును రక్తసిక్త గైరిక ధాతువులలో ముంచుట

ఆ భక్తలోక కల్పకం చిదానంద లహరియై బిడ్డా! నీ మధుర స్తుతి వాక్యాలకు నా అంతరంగం పరవశించింది. కష్ట సమయాలలో నన్నుధ్యానిస్తే నీకు వజ్రకవచమై రక్షణగా ఉంటాను ఇదిగోచూడు. నా వాహన సింహ పాదనఖటంక కోటీపుట ఘట్టనలకు ఇచటి రంగు రంగుల గైరికాది ధాతువులు నుగ్గు నుగ్గయి పొడి పొడియై ఉన్నవి. ఈ రంగు ధూళులపై వజ్రముష్ట్యాది రాక్షసుల రక్తంపడి ఎరుపు, పసుపు, ఆకుపచ్చ, నలుపు మున్నగు రంగు లేర్పడ్డాయి. దేవలా, నీ వద్దనున్న పట్టు తంతువులను, పత్తి తంతువులను ఈ ద్రవాలలో ముంచు ఆ రంగులు తంతువులకు సంక్రమిస్తాయి. అట్లయితే! రంగువస్త్రాలు వేర్వేర నిర్మింపవచ్చు. వర్ణ సమ్మేళనంతో చిత్రాం బరాలనూ. నిర్మింపవచ్చు. కొన్ని ధవళాంశుకాలను నిర్మింపవచ్చు

అని ప్రబోధించింది. వల్లె అని దేవలుడు ఆ వర్ణద్రవాలలో తంతు వులను ముంచి వేర్వేరు రంగు నూళ్లను చేసికొన్నాడు. పెద్దలమాట పెరుగన్నంమూట గదా!

## సింగం బంటు

ఇంతలో అంతవరకు సింహంకాళ్లచాటున దాగియుండి భయ కంపితుడైన ఒకకిరాయి బంటు వెలువడ్డాడు. రాక్షసుడేమోనని దేవలుడు ఖడ్గంతో వానిని చంపబోయాడు వాడు చూడాంబికను శరణుజొచ్చాడు. అంబ దేవలుని వారించి వీడు భారతీయుడు; నా భక్తుడు. ఒకప్పుడు రాక్షసులకుచిక్కి బందీయై వారితో బ్రతు కుతూ వారి బలవంతాన పోరాటానికి వచ్చి ఇచ్చట దాగిఉన్నాడు. వీడు క్షమార్హుడు. వీడు సింహంనుండి వచ్చాడుగనుక ఇకమీదట సింగం వాడనేపేరుతో వ్యవహరింపబడుతూ బాకాబట్టి తానూ, తన వంశంవారూ, నిన్నూ, నీవంశంవారినీ ఆశ్రయించి జీవిస్తుంటాడు. వీడు నీకు సేవకుడై ఉంటాడు అన్నది. దేవలుడందుకు సమ్మతిం చాడు. ప్రేమాదరాలతో వాణ్ణిచూచాడు. వాడూ భక్తివినమ్రుడై చేతులు మోడ్చాడు.

## అమ్మవారి పూజాఫలితం

మరల దేవి వీణాస్వనంవంటి కంఠస్వరంతో నాయనా! నిన్ను రాక్షసులు బాధిస్తుంటే అమ్మా! రక్షింపుమని నన్ను పిలిచావు, నేను సరిగా ఆషాఢమాస అమావాస్య అర్ధరాత్రివేళ చౌడేశ్వరీ దేవిగా అవతరించి రాక్షస నిర్మూలనంచేసి నిన్ను రక్షించాను. కావున, నా దివ్యావతారానికి ఆశ్రయహేతువైన ఈదినం నీకూ, నీవంశంవారికీ మహాపర్వదినమౌతుంది. నేను మీకు కులదేవతను. నీసంకల్పభావ సంజాత నగుటచే పుత్రికగూడ అవుతున్నాను. ప్రతిసంవత్సరం ఈ

ఆషాఢమాస అమావాస్య దినమందు మానేతవృత్తిని, ఇతర వ్యాపారాదులను మానుకొని శ్రద్ధాభక్తులతో నా సుప్రభాత పూజాస్తోత్ర కార్యక్రమాలను నిర్వహించండి. అట్లు నిర్వహించినవారికి ఇష్ట కామ్యార్థాలను, సకలైశ్వర్యాలను సమకూర్చుతాను. పుత్రపౌత్రాభి వృద్ధిని కలుగజేస్తాను. నన్ను కొలిచేవారు సంస్కార హృదయులై ఆత్మజ్ఞానంతో ఉత్తములౌతారు. కొలవనివారు సంస్కారహీనులై దుస్సంకల్పాలతో అధములౌతారు. కన్నతల్లి బిడ్డకు కంటికి రెప్ప వంటిది. ఆమె కనుచూపులు కప్రపు హారతులౌతాయి. కన్నతల్లిని విస్మరించినవారికి గతులుండవు గదా! దేవలా! ఈ సింగంవాని సాయంతో ఆమోదపట్టణానికి బయలుదేరు. నీకు శుభమౌతుంది. అని అభయముద్రతో దీవిస్తూ దేవి పరంజ్యోతియై ఓంకారమై అంతర్ధానమయింది. దేవలుడు భక్తితాత్పర్యాలతో హస్తద్వయం జోడించాడు. తరువాత దేవలుడు సింగంబంటుతో బయలుదేరాడు.

పెద్దపిల్ల సువర్ణలత అడ్డుతగిలి నాన్నా! విష్ణుసుదర్శనచక్రం వజ్రముష్ట్యాది రాక్షసులను ఏమిచేయలేక వ్యర్థమౌటానికి కారణమేమిటి? అన్నది. ధర్మపత్ని అందుకొని దేవయాని శాపంవలన పంచ రాక్షస వీరులు పరమేశ్వరిచేతుల్లో మరణించారని చెప్పారు. ఆశాపమేమిటి? శాపకారణమేమిటి? అన్నది. చిన్నమ్మాయి సువర్ణలక్ష్మి కలుగజేసికొని నూలును నెత్తురులో ముంచడమేమిటి? ఏబ్బే! అని ఏవగించుకొన్నది.

## వజ్రముష్ట్యాది రాక్షసులు చక్రంచేతచావకుండా విష్ణువరం

అంతట నేను మీరడిగిన ప్రశ్నలు పూర్వంనారదుడు బ్రహ్మదేవుణ్ణి అడిగాడు. ఆయన చెప్పినది మీకు నేను వివరిస్తానువినండి. ఈ సృష్టి జరుగకముందు పూర్వసృష్టికి జలప్రళయం వచ్చింది.

అని ప్రారంభించుటతో ప్రళయమంటే ఏమిటి? నాన్నా! అన్నది చిన్నమ్మాయి. ఆదిలోనే హంసపాదా? సరే. ప్రళయమంటే కొండలు కోనలు, గ్రామనగరాలు, ప్రజలు, పశుపక్షి క్రిమికీటకాలు సమస్త సృష్టి నశించి కనపడకుండా పోవడం. అప్పుడు ఏడుసముద్రాలు కలసి మన్నుమిన్నేకమై పొంగి పరవళ్లుతొక్కుతూ ప్రవహిస్తోన్నవి. ఆప్రళయ జలధి ఉత్తుంగ తరంగాలపై ఉయ్యాలఊగుతున్న వటపత్ర శయనంపై పవ్వళించి శ్రీమన్నారాయణమూర్తి యోగనిద్రాముద్రిత నేత్రపద్ముడై ఉన్నాడు.

ఆసమయంలో ఆదేవుని చెమటకు పేలవలె నల్లులవలె వజ్రముష్ట్యాది రాక్షసులు జన్మించారు. వారు తత్క్షణమే వృద్ధిపొంది తమోగుణ ప్రవిష్టులై దురాత్ములై తిట్టుతూ కొట్టుతూ నెట్టుతూ పట్టుతూ స్వామిని పలుతెరగుల బాధింపసాగారు. విష్ణువు యోగనిద్ర చెడి లేచాడు. వారెవరైనదీ తెలుసుకొన్నాడు. తనబిడ్డలేయైనా రాక్షసాంశకలవారని గుర్తించాడు. వారు తనను చంపాలని పూనుకొన్నారు. తాను వారిని చంపడమా? మనసొప్పలేదు. కుపుత్రులుండవచ్చు. కుమాత ఉండదుగదా! వారైదుగురు పిడికిటి పోటులతో తనను కవ్విస్తున్నారు. నొవ్విస్తున్నారు. నారాయణుడు బలం కూడగట్టుకొని వారిదెబ్బలను తట్టుకొంటూ, కొన్నిటిని వ్యర్థంచేస్తూ వారి దెబ్బలు వారిలోనివారికే తగిలేట్లుచేస్తూ పెరుగుకుండలోనికవ్వంలా గుద్దులజగడం చేయసాగాడు. వారు మదపుటేనుగులవలె భీకరంగా ఘీంకరిస్తూ శ్రీహరి మీదపడి చే చరపులతో బాదసాగారు. ఆయన ఒక్కొక్కరిని పట్టి దూరంగా విసరివేస్తున్నాడు. వారు మరల పరుగునవచ్చి శ్రీహరిని చుట్టుముట్టి ఇద్దరు భుజములెక్కారు. మరియిద్దరు చంకల్లో దూరారు. ఐదవవాడు చేతుల్లో బంతిలా ఆడుతున్నాడు. మాధవుడు వాయుకుంభకముతో పైకిలేచాడు. వాళ్లను క్రిం

దికి దులిపివేశాడు. వారునూ తండ్రిలక్షణాలు కలవారేకనుక, అట్లే పైకి లేచి నియుద్ధ యుద్ధ సన్నద్ధులై క్రుద్ధులై గ్రుద్దులతో తద్దయు విష్ణువును పీడించసాగారు. వారికి సుదర్శన చక్రాలే లేవుగాని ఆయైదుగురు బలంలోగాని, బలప్రకటనంలోగాని అచ్యుతునికి ప్రతి బింబాలే. సరితూకం కలవారే. వారు పరస్పర విజయాకాంక్షులై ఎంతోకాలం పోరాడారు జయలక్ష్మి ఎవరిని వరించలేదు. పుత్రులు గనుక పురుషోత్తముడు వారిని పొలియించలేడు. వదలించుకొన నూలేడు. వారంతకంటె వదలరు.

పసిపిల్లలు ఆట తమకంతో గిలక్కాయను త్రిప్పుతూ నోట క్రుక్కుకొంటూ కొంతసేపు నేలకేసి కొడుతూ కేరింతలాడేట్లు ఆ దానవులు దామోదరుని పెక్కుతెరగుల మల్ల యుద్ధంలో విసిగించారు: గద్దరులై కసిగించారు. ఆయన అలసి సొలసి పోయాడు. నారాయణుడు తెంపుచేసి కుమారులారా! ఇకచాలు; ఆగండి అన్నాడు. వాళ్లు రిచ్చపడి ఏమిటి? మేము నీకు కుమారులమా? అన్నారు. చక్రధారి అవును. నేను యోగనిద్రలో ఉన్నప్పుడు నా శరీర ఘర్మోదకమందు మీరు జన్మించారు. మీరు నా కుమారులే. నన్నెదుర్కొని మీ మీ బలవిద్యా నైపుణ్యాలు ప్రదర్శించారు. మీరు మంచి యుద్ధవీరులు. ఇంతతడవు మీ మీ బలాలను పరీక్షించాను. మీరు బలపరాక్రమాలలో నా యంతవారు. సర్వ. సమర్థులు. వాత్స ల్యంతో మీకొక వరమీయదలచాను. కోరుకొనండి అన్నాడు. వారు ఒకరి మొగ మొకరు చూచుకొని మంతనమాడి అయ్యగారు! మేము కోరుకొన్న ఆయుధం వశంకావాలి. నీ చక్రంవల్ల చావులేకుండాలి. అటువంటి వరం ప్రసాదించండి అన్నారు. అట్లే ఇచ్చాను. పొండి అన్నాడు. వారు సెలవు తీసికొని వెళ్లిపోయారు. దుష్టులకు పైసా డబ్బులిచ్చియైనా దూరం చేసికోవాలి. అట్లే మంచి వారిని కొను

క్కోవాలి. ఇందువలన విష్ణుచక్రం వజ్రముష్ట్యాది రాక్షసుల్ని తాకి గూడ ఏమిచేయలేక పోయింది.

## వజ్రముష్ట్యాది సోదరులకు స్త్రీ వలన మరణమని దేవయాని శాపం

తరువాత విశ్వసృష్టి జరిగింది. రాక్షసులని దేవతలని రెండు జాతు లేర్పడ్డాయి. స్వర్గరాజ్యం కోసం ఆజాతిద్వయం పరస్పరం యుద్ధంచేస్తుండేవారు. స్వర్గం చదరంగంలోని పావులాగా ఎవరికి బలమెక్కు వుంటే వారికి దక్కుతోంటుంది. దేవతల గురువు బృహస్పతి. రాక్షసుల గురువు శుక్రాచార్యులు. ఆవీరుల భుజబలమేపాటిదో ఈ ఆచార్యుల మంత్రాంగం అంత శక్తిమంతమైనది. అందువలన వారు తమ గురువులను దైవ సమానులుగా చూచేవారు.

వజ్రముష్ట్యాది రాక్షసులు తమ జాతివారిని ఆకర్షించి నాయకులై కోటలు కట్టుకొని రాజ్యా లేర్పరచుకొన్నారు. శుక్రుని మంత్రాంగంవలన మరింత శక్తిమంతులై తమ బలంతో సర్వత్ర విజయం సాధిస్తూ నిరంకుశ పరిపాలన చేస్తున్నారు.

ఒకనాడు సోదర పంచకం శుక్రాచార్యుల వారి ఆశ్రమానికి వచ్చారు. గురువు పర్ణకుటీరంలో లేరు. ఏదో పనిమీద బయటికి వెళ్లారని అక్కడ ఉన్న శిష్యులు చెప్పారు. వారు ఆశ్రమ ప్రకృతి సౌందర్యానికి ముగ్ధులై చూచి పోదామని ప్రక్కకు వచ్చారు. పచ్చని పట్టు పచ్చడం వంటి పచ్చిక పూల పరవులపై కుందేళ్లు లేళ్లు నెమళ్లు ఒయ్యారంగా సయ్యాటలాడుతున్నాయి. పూచిన గున్న మామిళ్లపై పుంస్కోకిలలు కువకువలాడు తున్నాయి. చిలుకలు గోర్వంకలు కాటుక పిట్టలు లకుముకులు. దోరపండ్లను కొకిబికిగా కొట్టివేస్తూ కిలకిలధ్వనులు చేస్తున్నాయి. అచటనే అల్లంత దూరంలో చెట్ల

పాదులను జలకుండికతో తడుపుతూన్న దేవయాని కనపడింది. ఆ పిల్ల మరల నీళ్ళకై తామర కొలనికి వచ్చింది. రేవులో మూగిఉన్న రాయంచల్ని తోలుతూ నీళ్ళలోదిగి కుండికను ముంచుతోన్నది.

ఆ యమ్మాయి పదారేండ్ల పడుచుపిల్ల. మేనిచాయ మేలిమి బంగారం. ముంగురుల జుట్టు గండు తుమ్మెదలకు చెంపపెట్టు. చిరునవ్వుమోము పున్నమి చందమామ. ముద్దులొలికే నుదురు, ధనుస్సువంటి కనుబొమలు, పద్మద్వయంవంటి కన్నులు, శ్రీ కారముల వంటి చెవులు, నువ్వుపువ్వువంటి ముక్కు, మల్లెమొగ్గలవంటి పలువరుస, దొండపండు వంటి పెదవి, కనక కలశములవంటి స్తనములు, మన్మథ జయకేతనంవంటి పైటచెరగు కలిగి దేవయాని జగదేక సుందరిగా మెరసిపోతున్నది.

ఆ విలాసిని మల్లెపూల జడను ముందుకువేసి జలకుండికను చంకను బెట్టుకొని తిరిగి వస్తుంటే ఆ రాక్షసులకు నోరూరింది. చక్కెరబొమ్మ, ముద్దులగుమ్మ వలపుల పూరెమ్మ అని లొట్టలు వేసికొంటూ మాటాడి చూద్దామని ముందుకు వచ్చారు.

సుదతీ! ఈ ఆశ్రమానికి మణి దీపంలా ఉన్నావన్నాడొకడు. ఆకాశగంగలో బంగారు పద్మంలా ఉన్నావన్నాడింకొకడు. సర్వజన నయన చకోర చంద్రికగా ఉన్నావన్నాడు వేరొకడు జంగమపుష్పలతికగా ఉన్నావన్నాడు మరియింకొకడు. మన్మధుని అరవభాణం నీవే అన్నాడు వేరే ఇంకొకడు.

దేవయాని నిలువబడి అన్నలారా! మీరు రాజులై ఉండి గురుపుత్రికను ఇలా వర్ణించడం తగదన్నది. వారు గూడనిల్చి అమ్మమ్మా!! సత్యం దాస్తే దాగుతుందా? మబ్బుక్రమ్మితే మాత్రం చందమామ మనోహరమైన దనడం తప్పవుతుందా? మేముయథార్థ వాదులం సుమా! ఈ ఆశ్రమంలో నీవు రెక్కలు ముక్కలయ్యేట్లు

నీళ్లు తెచ్చి పాదులు తడపడం చూడలేకున్నాము. నీవు మా రాచనగరులో ఉండదగిన దానవన్నారు రాణివాసం నాకెందుకు? నేను బ్రాహ్మణ కన్యను. నియమనిష్ఠలతో చదువు సంధ్యలతో ఉండవలసినదాన్ని అన్నది. అట్లయితే. చేతిగాజు కాలికీ, కాలిఅందె చేతికి తొడిగినట్లవుతుంది. అన్నారు. అది మీ భ్రమ అన్నది. ఇందులో భ్రమఏమున్నది.? నియమ నిష్ఠలనీ, శ్రమ పడాలనీ బాల్యచాపల్యంతో మాటాడుతున్నావు. నీవు మాదానివైతే నీకు రాణివాసం ప్రాప్తిస్తుంది అన్నారు ఏమిటీ, మీరనేది? మీకు నేను గురుపుత్రిని. చెల్లెలివంటిదాన్ని, మీతో బొట్టువును చూచే కళ్లతో నన్ను చూడండి నన్నుచూచే కళ్లతో మీతోబుట్టువును చూడండి అన్నది.

మేమైదుగురమేకాని వేరే మాకు తోబుట్టువులు లేరు. ఆ చూపులు త్రేపులువద్దు. మేము యువకులం. నీవు యువతివి. ఒళ్లు ఒళ్లు కలుపుకొందామన్నారు. బుద్ధి గడ్డి తింటున్నది. వాగ్దోషానికి పాల్పడుతున్నారు. నోరు కట్టుకోండి అన్నది. నోరుకట్టుకోవడం బలహీనుల పని, తెలివిమాలినవారిపని. ప్రకృతి సిద్ధంగా పలికేనోరు పలుకవలసిందే. శారీరక సౌఖ్యాలు అనుభవించవలసిందే. నీ అంద చందాలు అందుకొని పొందవలసిందే, మిసమిసలాడే నీ జవ్వనం మదురపండిన మామిడి పండులా ఉన్నది. తినవలసిందే. చంద్రోదయాన్ని చూడకుండా కంటిచూపును అపు వారెవ్వరు? పుష్పసౌరభాన్ని ఆఘ్రాణించకుండా ముక్కును నొక్కి పట్టే వారెవ్వరు? అన్నారు. కన్నులెఱ్ఱజేసి పడగ విప్పిన కోడెత్రాచులా బుసగొడుతూ ఏమిరా? మీకు భూమిపై బ్రతకాలని లేదా? పోగాలం దాపురించినట్లున్నది. నూకలు చెల్లినట్లున్నది అన్నది ఈ పిల్లి శాపాలకేమిగాని, మా చేతుల్లో చేరిపో. మా కౌగిట్లో ఒదిగిపో. మాకు నీరుచి చూపించావంటేనీ కు స్వర్గసుఖాలు అందిస్తామన్నారు. కామాంధులకు మానమర్యాదలూ, ఉచితానుచితాలూ ఉండవంటారు. కంచే

చేనుమేస్తోన్నది పాలకులు మేరతప్పితే హద్దులు దాటితే ఇక ప్రజలేమైనా చేస్తారు. పిచ్చికూతలు మాని వివేకం తెచ్చుకొని ఇక నైనా ఈ చోటువిడిచి పొండి అన్నది. ఈ హద్దులు పద్దులు పెట్టి మమ్మల్ని మభ్యపెట్టజూస్తున్నావు కామ మనేది సర్వప్రాణి సహజ మైనది. అల్పప్రాణులైన పశుపక్ష్యాదుల్లో గూడ అది ఉన్నదే. దాన్ని నిరసించడానికి నీ వెవరవు? అదిగాక, రాజులకు రత్నాలన్నీ స్వాధీన మైనట్లు స్త్రీ రత్నాలుగూడ స్వాధీనం కావలసిందే లోకంలో పురు షుడు ఏస్త్రీనైనా ప్రేమించవచ్చు; సుఖించనూవచ్చు. అలాగే స్త్రీ గూడ. అందుబాటులో ఉన్నదాన్ని అందుకోవాలి. "ఎట్టిదాని ముఖము ఏ ప్రొద్దుచూచినా, బ్రహ్మకైన కలుగు రిమ్మతెగులు" అని అను భవజ్ఞులు ఊరకే అన్నారా? నిన్ను చూస్తూంటే మాకట్లాగే ఉంది. నీవు మా కోరిక మన్నించి మా వెంటరా. ఈ నికృష్ట జీవనం లేకుండా హాయిగా సుఖపడతావు అంగీకరించుమన్నారు. అలాగైతే కేవలం లైంగిక సుఖాభిలాషులైన మీరు మీ అమ్మ అలంకరించు కొని అందంగా కనబడితే మీద పడటానికి సంకోచించరు; వెనుకాడ రనుకొంటాను అని అన్నది. మా యిష్టానిష్టాలను నిర్ణయించడానికి నీ వెవ్వతెవు? మేము పాలకులం. బలవంతులం. సర్వాధికారులం. మేము కోరుకొన్నది. అనుభవించడానికి ఏ పద్ధతైనా అవలంబిస్తాము అని వారంటుండగా ఆమె అడ్డు తగిలింది. అయితే, నన్ను బలా త్కరించి ఎత్తుక పోవడానికి ప్రయత్నిస్తున్నారన్న మాట అన్నది

అన్నమాటేమిటి? ఉన్నమాటే. మంచిగా చెవితే విననప్పుడు చేయవలసింది అదేకదా! మాటబలం, బాహుబలం, శస్త్రబలం చూపించవలసినచోట చూపించాలి అన్నారు ఆమె ఒడలు తుకతుక ఉడికి పోయింది నేయిపోసిన అగ్నిజ్వాలలా భగ్గుమన్నది. ఓరీ, పాపాత్ములారా! అన్నం పెట్టిన ఇంటికే కన్నం పెట్టినట్లు నిరంతరం మీ మేలుకోరే శుక్రాచార్యులవారి యింటికే ఎసరు పెడతారటరా?

సాధ్వులను అన్యాయంగా బలాత్కరించినవారు సర్వనాశనం కాక తప్పదు. మీ బలం మీరు చూపించ దలచుకొంటే, నా బలం నేను చూపిస్తాను. నా శాపాగ్నితో మిమ్మల్ని ఈ క్షణంలో భస్మం చేయ గలను. కాని, రాక్షసరాజ్య పరిపాలకులై బ్రతికి పోయారు. మా నాన్నగారి శిష్యులవడం చేత మీ ఆళ్లత్రాళ్లు గట్టివైనాయి. అయి నప్పటికీ మిమ్మల్ని ఊరక విడిచి పెట్టేదిలేదు. ఓరీ దుష్టులారా! ఇంతవరకు నా వెంటబడి మడుగులో రాళ్లు రువ్వినట్లు నా అంత రంగాన్ని కలచి అలజడిపాలు చేశారు, కావున, మీ రెంత బల వంతులైనా, శస్త్రాస్త్ర విద్యాపారంగతులైనా, మాయా విద్యామహి తాత్ములైనా చివరికి నా వంటి ఆడుదాని చేతిలో హతమై పోతారు అని శపించి జలకుండికను అక్కడనే విడిచి విసవిసఆశ్రమ గృహం లోనికి వెళ్లిపోయింది.

వారు వెంటాడుటకు భయపడ్డారు. కుడిచి కూర్చుండలేక గొడవతెచ్చుకొన్నామని ఒకరి మొకమొకరు చూచుకొన్నారు. నేల బోవుదాన్ని నెత్తిన రాచుకొన్నామనీ, కొరవితో తలగోకుకొన్నామనీ విచారిస్తూ దొంగకు తేలు కుట్టినట్లు కిమ్మనకుండా, శాప పరిహార మైన అడగకుండా కాళ్లు త్రొక్కుకొంటూ వచ్చినదారిని వెళ్లిపోయారు. పుణ్యస్త్రీలను అవమానించిన వారిగతి ఇంతేగదా! ఇందువలన వజ్రముష్ట్యాది దుష్ట రాక్షసులు ఏ యింద్రాదులచే చావక, దేవలుని చేతనైన, చావక చివరికి అంబచేతిలో చచ్చారు అన్నాను.

విష్ణుదేవుని కుమారులు విష్ణువంతటి బలపరాక్రమాలు కల వారు, విష్ణువునే ముప్పతిప్పలు పెట్టినవారు సామాన్యులెట్లవతారు? అంతటి దుర్మార్గులు దీర్ఘకాలం జీవించడం విడ్డూరం. అందుకనే "పాపీ చిరాయుః, సుకృతిర్గతాయుః" అన్నారు. దేవయాని శాపం వారిధైర్యగిరికి వజ్రాఘాతమై ఉండాలి. తరువాత వారు బుద్ధి తెచ్చు

కొని ఉన్నారా? పూర్వంవలె పైలా పచ్చినుగా ప్రవర్తించారా? వివరించండి అన్నది శ్రీమతి నాగమ్మ. వారి రక్తం మాటేమిటి అన్నది సువర్ణలక్ష్మి.

## వజ్రముష్ట్యాదులు శివునిగూర్చి తపస్సు చేయుట

చెప్తాను వినండి అన్నాను. దేవయాని శాపంతో రక్కసులు నిజంగా ఖంగు తిన్నారు. అప్రతిహత శక్తి సామర్థ్యాలు కలవారమని విఱ్ఱవీగేవారి వీపులపై కొరడా ఝుళిపించి నట్లయింది. వారి మిడిసి పాటుకు గుఱ్ఱానికి కళ్ళెం తగిలించి నట్లయింది. ఇంత బ్రతుకు బ్రతికి ఇంటివెనుక చచ్చినట్లు ఒక ఆడదాని చేతిలో మరణమా? బ్రతుకు వీణలో అపస్వరం పలికింది దీన్ని సరిదిద్దుకోవాలి. ఎలా? ఎలా? దీన్ని సిగ్గువిడిచి ఎవరికి చెప్పుకోవాలి? ఎలా పరిహరించు కోవాలి? ఐదుగురు క్రింద మీదపడి కొన్నిరోజులు దీర్ఘాలోచన చేశారు. మృత్యువును జయించి చిరంజీవత్వం సాధించాలి. మృత్యుంజయుడు ఒక్క పరమ శివుడు మాత్రమే ఆయనను గూర్చి తపస్సు చేయాలి. అని తీర్మానించుకొన్నారు.

అదే తడవుగా హిమాలయాలకు వెళ్లి గంగోత్రి దగ్గర ఆశ్రమ మేర్పరచుకొన్నారు. ఐదుగురు ఐదు యజ్ఞకుండాలు కల్పించు కొన్నారు. శాస్త్రోక్తంగా శివార్పణమని హోమద్రవ్యాలు ఆహుతి చేస్తూ బహుకాలం తపశ్చర్యకు పూనుకొన్నారు. పూలకారు వానకారు మంచు కారులతో ఋతుచక్రం గిర గిర తిరిగిపోతోన్నది. కొన్నాళ్లు కందమూల ఫలాహారంతో గడిపారు. కొన్నాళ్లు జలపానంతో గడిపారు. కొన్నాళ్లు వాయుభక్షణతో గడిపారు. కొన్నాళ్లు వాయు కుంభకం సాధించి ఐక్యైకాగ్రతతో ఘోర తపస్సు చేశారు బక్క చిక్కి శల్యావశిష్టులయ్యారు. అయినా, పట్టువదలక ఆసనం వదలక కూర్చున్నవాళ్లు కూర్చున్నట్లే ఉండిపోయారు. జడలు గడ్డాలు భూమి

లోనికి చొచ్చుకొని వెళ్లుతున్నాయి. మీద పుట్టలు పెరిగాయి. బ్రహ్మ రంధ్రంనుండి ప్రణవ శబ్దతరంగాలు, మృత్యుంజయ శబ్దతరంగాలు ఉవ్వెత్తుగా లేస్తూ గగనాంతరాళం లోనికి అవ్యాహతంగా ప్రవహింప సాగాయి. ఈ కామ్యం, ఈ తపస్సు భౌతిక ప్రపంచ పరిధిలోనిది. విషయావరణం దాటనిది. అయినప్పటికీ, ఐహికకాంక్షా ప్రవాహ తరంగ శృంఖల పరమేశ్వరుని స్పృశించింది. కదలించింది.

పరమశివుడు భౌతికార్థ నిరూపిత చంద్రకళాశోభిత జటా జూటుడై ప్రసన్న వదనంతో ప్రత్యక్షమయ్యాడు. కమండలూదకం చేతి చేరతోపట్టి ఐదుపుట్టలపై ప్రోక్షించాడు వెంటనే పుట్టలు విచ్చి పోయినై. ఆ పవిత్ర జలస్పర్శతో ఐదుగురు ధ్యాన విముక్తులై, యథాపూర్వ శరీరులై, కన్నులు తెరచి, స్వామిని చూచి, సాష్టాంగ దండ ప్రణామాలుచేసి, పైకిలేచి ఔద్ధత్యంతో పరమశివుని పరి పరి విధముల ప్రస్తుతించారు. శంకరుడు వారి ధోరణికి విస్మయమంది రక్షోవీరులారా! ఈ మీ ఘోర తపస్సునకు కారణమేమి? మీ కోరిక ఎట్టిది? అని అడిగాడు, వారు మహేశ్వరా! మీకులాగా మాకూ మృత్యువులేకుండా, శాశ్వత చిరంజీవత్వం సిద్ధించే వరమీయండి అన్నారు.

ఆడుదాని చేతిలో మరణిస్తారనే శాపమున్నదిగదా! మీరు కోరినవరం ఎలాసాధ్యం? అన్నాడు శివుడు. నీవు మృత్యుంజయు డవు. దేవదేవుడవు ఆ శాపంమార్చమన్నారు. దానవులు. అదిఅక్రమ మన్నాడు అభవుడు. చిరంజీవత్వంలేని వరం మాకవసరం లేదన్నారు దైతేయులు. విధివిధానం తప్పదు. కాని, కొంతసవరణ చేస్తానన్నాడు శంభుడు ఆడదాని వలన మరణం అవమానకరమైనది. సగమాడ సగంమగదైన వ్యక్తిచే మరణం సిద్ధింపజేయండి. మా శరీరాంశం ఏదో ఒకటి చిరంజీవిగా ఉండేట్లు మార్చండి అన్నారువారు.

అటువంటి రూపం లోకంలో ఉండదు. కావున, లోకులచేత చావు లేకుండా పోతున్నది. ఇక పతివామాంగాన్ని పరిగ్రహించిన పార్వతి ఉన్నది. ఆ యంబిక తప్ప మరెవ్వరూ మృత్యువు కారాదని మీ భావమా? మీరు నారాయణ పుత్రులు. ఆమె నారాయణి. సరే, అట్లే కానీయండి. మరణానంతరం మీరక్తం రంగుల మడుగులౌతాయి. ఆ రంగులు నూలుకెక్కి వస్త్రాలవుతాయి. ఆ వస్త్రాలు లోకులు ధరిస్తారు. ఈ విధంగా మీ శరీరాంశమైన రక్తం రంగుల రూపంతో ప్రపంచమున్నంతకాలం జీవిస్తుంది. దీనితో మీకు చిరంజీవత్వం సార్థకమౌతుంది, అని పరమేశ్వరుడు తిరోహితుడయ్యాడు. అడదంటే సామాన్యస్త్రీగాక సాక్షాత్ పరమేశ్వరియే మృత్యువు కావడం తమకు గౌరవ కారణమే అనీ, తమరక్తం రంగుల రూపంలో ఉండి తమకు చిరంజీవత్వం సిద్ధింపజేస్తుందనీ తృప్తిపడి ఆరాక్షస సోదరులు నిరంకుశ స్వైర విహారులయ్యారు.

శివునికి పార్వతి అర్ధశరీరం గనుక. సగమాడ, సగంమగ రూపం అంబికదే కావున, చివరికి చౌడేశ్వరీదేవి చేతిలో వజ్రముష్ట్యాది రాక్షసులు చనిపోయారు. వారి నెత్తురు మడుగులు అచటి గైరికాది ధాతు పరాగ సమ్మేళనంతో వివిధ వర్ణాలుగా పరిణమించాయి. దేవలుడు అమ్మవారి ఆజ్ఞమేరకు నూలుకట్టల్ని అయా రంగుల మడుగులలో ముంచాడు. దానితో రకరకాల రంగులనూలు కట్టలేర్పడ్డాయి.

అంతర కథల్లో పడ్డాము. రాక్షస వీర పంచకం చక్రాయుధం వలన ఎందుకు చావలేదో తెలిసిందిగదా! వారొక స్త్రీ చేతిలోనే ఎందుకు మరణించారో తెలిసిందిగదా! అట్లే ఆ రాక్షసుల శరీరాంశం, అనగా రక్తం పంచవర్ణాల రూపంలో వస్త్రాలకెక్కి అవి ప్రజలు ధరించేట్లు పరిణమించి ప్రపంచమున్నంతవరకు చిరంజీవత్వం కలిగి

ఉండుటగూడ తెలిసిందిగదా! ఈ విధంగా పూర్వకథలో అంతర్గర్భితంగా ఉన్న అనేక కథాంశాలు మీకు తేటతెల్లం చేశాను. ఇకమూల కథలోనికి వస్తాము. దేవలుడు తనలక్ష్యమూ గమ్యమైన ఆమోద పట్టణానికి ప్రయాణ మయ్యాడని ఇతః పూర్వం చెప్పాను.

## తృతీయాధ్యాయం-దేవలుడామోద పట్టణానికి ప్రయాణం

ఆయన తన ప్రయాణంలో ఎడనెడ నదినదాలు, కొండలు లోయలు, బహు విధారణ్యాలు తిలకిస్తూ భగవానుని సృష్టిలీలా వైభవాలను కొండాడుతూ ముందు ముందుకుసాగిపోతున్నాడు. అట్లే తనకెదురైన పల్లెలలో. పట్టణాలలో నివసిస్తున్న ప్రజల ఆచార వ్యవహారాలను గమనిస్తూ వారికి శివాద్వైతమత సిద్ధాంతాలను ప్రబోధిస్తూ వెడుతున్నాడు, ఈతడు బాలవయస్కుడైన శంకరుడని ప్రజలు మ్రొక్కుతూ కానుకలు తెచ్చియిస్తున్నారు.

ఇట్లు కతిపయ ప్రయాణాలు సాగించి దేవలుడు నగర దేశాంతర్గత ఆమోదపట్టణ బాహ్యోద్యానవనానికి చేరుకొన్నాడు. అచటి వనపాలురు దేవలునిరాక సింగంవాని వలన తెలిసికొని ఉద్యానవనమందిరం విడిది చేయించారు. వారు ఆయాచెట్ల పండ్లను తినుటకిచ్చి కొబ్బరి బోండ్లాలనీళ్లు త్రాగుట కిచ్చారు. వనపాలురలో కొందరు రాచనగరునకువెళ్లి శివాజ్ఞనుబట్టి భవిష్యత్ప్రభువైనదేవల బ్రహ్మరాక సునాభమహారాజునకు తెలియపరచారు. ఆమహీపాలుడు మంత్రి పురోహితదండనాథ ప్రజానాయకులను రావించి దేవలమను బ్రహ్మ నగరబాహ్యోద్యానవనానికి వచ్చియున్నాడని ప్రకటించాడు. పురోహితుడు పంచాంగంచూచి తిథివార నక్షత్రాదులను పరికించి రేపటిదినం గోధూళిలగ్నంలో నూతనాగంతకుడైన దేవల ప్రభువును నగర ప్రవేశం చేయింపవచ్చుననీ,--ఈలోగా నగరాలంకరణ పూర్తి

చేసికొనవచ్చుననీ, మరుసటిదినం పూర్వభాగంలో పట్టాభిషేక కార్యక్రమం కొనసాగింపవచ్చుననీ విశద పరచాడు. అందుకు మంత్రులంగీకరించారు. అందరూలెస్స అన్నారు. సునాభుడు దేవల నగర ప్రవేశానికి అన్నిఏర్పాట్లు చేయించండని మంత్రులను ఆదేశించాడు. అల్లే పట్టాభిషేక మహోత్సవానికి అన్ని ఉపకరణాలు, సంభారాలు సమకూర్చండని పురోహితులకు చెప్పి తాను తన పట్టమహిషి కలావతితో, దాసదాసీ జనంతో దేవల దర్శనార్థం ఉద్యానమందిరానికి వెళ్లాడు.

మంత్రులు కార్యకుశలురైన తగు పరివారాన్ని రావించి వెంటనే నగరాలంకరణ చేయుటకు నియమించారు. వినోద కార్యక్రమాలకు వివిధ కళాకారులను ప్రోత్సహించారు. తరువాత శివాజ్ఞ చొప్పున నగర భవిష్యత్ ప్రభువైన దేవల మనువు ఎగరబాహ్యోద్యానవనానికి వచ్చి ఉన్నాడు కాన రేపటిదినం ప్రజలందరు తగు సన్నాహంతో అన్ని మర్యాదలతో అయనను తోడ్తెచ్చుటకు సహకరించాలని దేశంలో చాటించారు.

అందరు ఇది పెండ్లి వేడుకగా భావించి గృహాలంకరణలు. వీథి అలంకరణలు చేయసాగారు ఇంటింట, వీథి వీథి, రాజమార్గాలలో పెద్ద పెద్ద పందిళ్లువేశారు. చాందినీలు కట్టి మణిమయ కేతుతోరణాలు మణిమయ లతాపుష్పాలు, రతనాల చిలుకలు, హంసలు,నెమళ్లు, జింకలు,అనేక దేవతా ప్రతిమలు అమర్చారు అంతటా జలనాళికాయంత్రాలతో, రత్నపుత్రికలతో. వివిధరత్నదీపమాలికాలంకరణలతోనగరాన్ని దిద్దితీర్చి భూలోక స్వర్గంగా రూపొందించారు.

క్రొత్తరాజును చూడటానికి దేశంలోని పల్లెటూళ్లజనం తిరుణాల జన.లా తండోప తండాలుగ వచ్చి పడుతున్నారు. పొరుగూళ్ల

ప్రజలకు నగరంలో అన్ని వసతులు కల్పించారు. ఎక్కడచూచినా చలువ పందిళ్లు చలివేంద్రలు, భోజనశాలలు అంగడులు అసంఖ్యాకంగా అందరకూ అందుబాటులో ఉన్నాయి.

## దేవలుని నగర ప్రస్థానోత్సవం

మరునాడు ఉత్తరార్ధకాలంలో సునాభ మహారాజు మంత్రి పురోహిత సామంత దండనాథ ప్రజానాయక పౌరజానపద పరివార జనంతో దేవలుని విడిదికి వచ్చి విలువైనవస్తువులు కానుకలిచ్చారు. మంత్రి పురోహిత దండనాథులు ఒక్కొక్కరు ముందుకువచ్చితమ్ము తాము పరిచయం చేసికొన్నారు. రాజపురోహితుడు మంగళపూర్ణ కుంభాన్ని ముందుంచి వేదమంత్రాలు చదువుతూ సువర్ణాక్షతలతో దేవలుని దీవించాడు. మంత్రుల పర్యవేక్షణలో పట్టపుటేనుగు అంబారీతో అలంకరింపబడి మావటీనితో సిద్ధంగా ఉన్నది. ఇంతలో నగరప్రస్థాన భేరీ భాంకారం మ్రోగింది. అనుసంధాన మంగళ వాద్యాలు అందుకొన్నాయి. సునాభ మహారాజు ప్రేరణపై సుబుద్ధి, కార్యదక్షుడు, నీతిమంతుడు, దీర్ఘదర్శనుడను మంత్రులు ముందుకు వచ్చి మహాభాగా! స్వాగతం. నగరప్రవేశం చేయగోరుతున్నాము. ఈ రాజ్యపరిపాలనా భాధ్యత మీ కప్పగించవలసినదిగా శివాజ్ఞఅయింది. లెండి. రండి అన్నారు. పుణ్యాంగనలు వచ్చి దేవలునికి తిలకంపెట్టి మంగళ నీరాజనాలిచ్చారు.ఆయనలేవడంతో అందరు లేచారు. సింగంబంటు బాకా ఊదుతూముందు నిలిచాడు. సునాభమహారాజు దేవలుని చేయి పట్టుకొని మందిరద్వారం వెలువడి తిన్నగా పట్టపేనుగు చెంతకు నడిపించుకొని వచ్చాడు. అనవ యౌవనుడు మావటీని సహాయంతో భద్రగజాన్ని అధిరోహించాడు. పురోహితుడు పూర్ణకుంభాన్ని తెచ్చి ముందుపెట్టాడు. సునాభుడు వేరే ఏనుగును అరోహించాడు. మంత్రులు సామంతులు, సేనాపతులు

వారి వారి వాహనాలెక్కారు. మంగళ వాద్యాలు మేళతాళాలు బోరు కొన్నాయి. వైదిక బ్రాహ్మణులు స్వస్తివాక్యాలు పలుకుతున్నారు. వంది మాగధ స్తోత్రపాఠకులు దేవలగుణ గానం చేస్తున్నారు.

వేశ్యానర్తకీ జనంశివపార్వతీ మిథున వేషాలతో మధురలాస్య తాండవం గీతికా సహితంగా ప్రదర్శించారు. ఉత్సవం నడక ప్రారంభించింది. వేశ్యలెక్కడికక్కడ ఆడుతూ పాడుతూ ప్రజలకు వినోదం కల్పిస్తున్నారు. వస్తాదులు కఱ్ఱసాము, కత్తిసాము, గదా యుద్ధం, ధనుర్విద్యాకౌశలం, మల్లయుద్ధం మున్నగు క్షాత్రవిద్యా ప్రదర్శనలు చేస్తున్నారు. ప్రేలుడు మందులు పలురంగుల వెలుగుల మందులు కాలుస్తున్నారు. ఆ కాంతులకు మసక చీకట్లు విరిసి పట్టపగలయింది. వెలుగు పొగలకు మన్నుమిన్నేకమై రంగుల వెలుగు వంతెన కట్టినట్లయింది. నేల ఈనినట్లు జనం అంతట క్రిక్కిరిసి కిట కిట లాడుతున్నారు. ఇసుకవేసినా రాలనట్లు జన ప్రవాహం నడుస్తోంది. ఆ యుత్సవం క్రమక్రమంగా సాగిపోతూ పర్వత జల దుర్గాలను దాటి, బురుజులతో ఒప్పారు. నగరదుర్గ ప్రాకార సింహ ద్వారం చేరుకొన్నది.

రక్షకభటులు వేత్రహస్తులై ఎక్కడికక్కడ జనాన్నినర్ది, అదుపులోనికి తెస్తూ ఉత్సవాన్ని ముందుకు పోనిస్తున్నారు. రాజ పురోహితుడు- సింహద్వారంవద్ద దేవలునికి దోషపరిహారార్థం మంత్ర పఠనంతో బల్యన్నాది కార్యక్రమాలు నిర్వర్తింపజేశాడు. సాధ్వీ మణులు కప్రపు హారతులిచ్చారు. ప్రజలు జయజయధ్వనులు చేస్తున్నారు. నగరం అంచుల నివసించే కృషీవల కుటుంబాలు సింహద్వారంనుండి దారిపొడవునా బారులు తీరినిలిచి ఉన్నారు. అందులోని ఒక రైతుయువతి నయనానందకరుడై ప్రత్యక్ష మన్మ థునిలా ఉన్న దేవలుణ్ణి దగ్గరగా చూడాలనే తమకంతో చంకనున్న

చంటిబిడ్డనోటికి చన్నుఅందించి ముందుముందుకు వచ్చి చూస్తున్నది. ఇది మంచి శుభ శకునం. క్షీర పూర్ణ కుచకుంభం మంగళ పూర్ణ కుంభాన్ని తలపిస్తున్నది. చంటి బిడ్డతో యువతి ఎదురొట చూడగా, వెంటనే వివాహప్రాప్తి, సంతానప్రాప్తి కలుగుతుందని అర్థమౌతున్నది,

ప్రక్క ప్రక్కలనే బారులు తీరి ఉన్న కన్నె పడుచులు, కుఱ్ఱవాండ్రు బావగారనీ, అన్నగారనీ క్రొవ్విరి చెండ్లు రువ్వుతూ మురిసి పోతున్నారు. మధ్యవయస్కులు మేలిమి బంగారు ముద్దఅనీ, తల నెలవంకలేని బాల శంకరుడనీ మల్లెలు, మొల్లలు జాజులు రోజాలు చల్లుతూ భక్తితాత్పర్యాలు ప్రకటిస్తున్నారు. పండు ముదుసళ్లు చూచి పాలబుగ్గల పసివాడనీ, బాల సుబ్రహ్మణ్యస్వామిలా ఎంచక్కనయ్య! చెక్కిలినొక్కి ముద్దాడాలనిపిస్తుందనీమాపుణ్యాన ఈ పుడమికి ఒడయడై పదికాలాల పాటు రాజ్యపాలనచేస్తూ పదికాయలుకాసి పచ్చ పచ్చగా ఉండాలని మెటికలు విరిచారు.

ఉత్సవం రాజమార్గానపడ్డది. ఆ రాజమార్గం ఇరు పార్శ్వము లందు మహోన్నత సౌధ పంక్తులతో, ఉత్తుంగ శృంగాలతో, పవన చాలితధ్వజ పతాకలతో, వివిధ వర్ణదీపమాలికలతో, బహువిధ రత్నసాల భంజికలతో, అపూర్వ సౌందర్యాన్ని వెలయిస్తున్నది. కొందరువిచిత్రవేషధారణలతో,వింత భాషణలతో ప్రజలకు హాస్యవినోదాలను కల్గిస్తున్నారు కొందరక్కడిక్కడ ఏకపాత్రాభినయాలు నిర్వహిస్తున్నారు. ముద్దుగుమ్మలు గుమ్మములు వెలువడి కర్పూర నీరాజనాలిస్తున్నారు. సౌధ చంద్రశాలలలోనికివచ్చి నాగరికస్త్రీ పురుషులు పువ్వులు, లాజలు చల్లుతున్నారు.

శివకుమారుని రాకవిని ఒకముగ్ధాంగన ఎడమస్తనంవైపు కన్నెగేదంగి రేకులతో జడ అల్లుకొంటూ వచ్చి చూచింది. ఒక తరుణీమణి

భూషణాలంకరణలు చేసికొంటూ కాలి అందేలు చేతికి తగిలించు
కొని వచ్చి చూచింది. ఒక ప్రౌఢాంగన చేతిఅద్దంలో చూచి పెదవికి
రంగు దిద్దుకొంటూ వచ్చి చూచింది. ఒక కన్యస్నానార్ద్ర శరీరయై
చిన్నవారవల్కలం పైన వేసికోంటూ వచ్చి చూచింది.

ఈ విధంగా దేవల కుమార దర్శన కుతుహలాగతలైన
యువతుల చూపులు తుమ్మెదలై, ముఖములు పద్మములై నగర
సౌధచంద్రశాలలు సరోవర భ్రాంతికల్గిస్తున్నవి. ఆ ఉత్సవం నాల్గు
దారులొక చోటకలిసే శృంగాటకాలను అధిగమించి, నగరోద్యాన
వనాల మీదుగా ముందుకుసాగి, క్రమక్రమంగా రథశాలలు, గజ
శాలలు, అశ్వశాలలు గడచి అంతఃపురం చేరుకొన్నది మనా
భమహీపతి ముందుకువచ్చి ఏనుగుమీద నుండి దిగుటకు దేవలునికి
సహాయపడ్డాడు. రాజపురోహితుడు దృష్టిదోష పరిహారక మంత్రాలు
చదివాడు. ముత్తయిదువులువచ్చి బల్యన్నాదులు దిగదుడిచి. వేశారుం
కొందరు హారతులిచ్చారు. అంతట అమాత్య పురోహిత సహితుడైన
భూపతి దేవలుణ్ణిపూల పఱపు బాటపై నడిపించుకొనివచ్చి శైవ
కథా ప్రపంచిత కుడ్యచిత్ర రంజిత దివ్యభవనంలోనికి తీసికొని
పోయి అచట విడియించాడు. ఆ గృహంలో అన్నివసతులు అన్ని
సౌకర్యాలు కలుగజేసి తగినపరివారాన్ని నియమించాడు. రేపే
పట్టాభిషేక మహోత్సవమని దేవలునికి విన్నవించాడు.

## దేవలునికి పట్టాభిషేకం

అప్పటికే ప్రత్యేకపరివార జనాన్ని నియమించి అభిషేకార్థం
అన్నియేర్పాట్లు పూర్తిచేయించారు. చతుస్సాగర జలాలు, గంగా
యమునా గోదావరీ కృష్ణా పినాకినీ కావేరీ తపతీ ప్రముఖ పుణ్య
నదీనదాల జలాలు స్వర్ణకలశాలతో తెప్పించారు. కావలసిన
పాత్రసామగ్రులు, వస్తుసంభారాలు సమకూర్చి ఉంచారు.

మరునాడు పొద్దుపొడుపువేళ మంత్రి పురోహిత సేనా నాయకులుపట్టాభిషేకోత్సవ సంభారాలతో రాజాస్థానం చేరుకొన్నారు. రాజ పురోహితున్ని పర్యవేక్షణలో వైదిక విప్రులు నవరత్నఖచిత సువర్ణసింహాసన శుద్ధి జరిపారు. కొలువుకూటం పౌర జానపద పల్లీ జనంతో క్రిక్కిరిసి పోతోన్నది. రక్షకభటులు దండధారులై ఎక్కడి వారిఅక్కడ సర్ది కూర్చొన బెడుతున్నారు.

సునాభ మహిజాని సామంతరాజులను వెంటబెట్టుకొని మంగళ వాద్యాలతో రాజప్రాసాదానికి పోయి. అప్పటికే తగిన విధంగా అలంకృతుడైయున్న దేవలుని సమీపించి స్వాగతం పలికాడు. రాజ్య పట్టాభిషేకార్థం రాజాస్థానానికి రావలసినదిగా అర్థించాడు. దేవలుడు సమ్మతించి వారివెంట వచ్చాడు. ఆయన ఆస్థానంలో అడుగు పెట్టడంతో ప్రజల జయజయధ్వానులు, కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి.

రాజపురోహితుడు విప్రులు వేద పఠనంతో పట్టాభిషేక కార్యక్రమాన్ని వరుసగా నిర్వహిస్తున్నారు. సునాభుడు దేవలుని చేయిపట్టుకొనినడిపించుకొనిపోయి సింహాసనంపై కూర్చుండబెట్టాడు. అన్నివిధముల మంత్రులు సహాయ పడుతున్నారు. రాజ పురోహితుడు మంత్రపూతమైన సువర్ణపట్టాన్ని దేవలుని నొసటకట్టి హరిద్ర సువర్ణాక్షతలు చల్లాడు. విప్రులు కనక కలశోదకాలు ప్రోక్షించారు. రాజగురువు వచ్చి మణిమయ కిరీటం చేత బట్టుకొని దేవలుని మస్తకంపై అలంకరించాడు. పెద్దలు సువర్ణాక్షతలు చల్లారు. అందరు తిరిగి జయ జయధ్వనులు చేశారు.

సునాభుడు దేవల మహారాజునకు అమూల్య రత్నాభరణాలు బహూకరించాడు. సామంతరాజులు పేరుపేరున తమను పరిచయము

కావించుకొంటూ వారి వారి అధికార సంపదలకు తగినట్లు కానుకలు సమర్పించుకొన్నారు. మంత్రులు, సేనాపతులు, ప్రభుత్వోద్యోగులు పరిచయం చేసికొన్నారు.

సునాభుని ప్రేరణతో రాజగురువు క్రొత్తరాజునకు రాజ ముద్రిక, రాజదండం, రాజఖడ్గం ఇచ్చాడు. రాజ్యమందు సంవత్సరా దాయం ఆరుకోట్ల బంగారు వరహాలని వివరించాడు ధనకోశంలోని నిల్వలు చూపించి చెప్పగల మన్నాడు. ఇంకను దేశాచార పద్ధతు లను, దేశమర్యాదలను వివరించి చెప్పాడు.

రాజు శైవుడు, ప్రజలు శైవులు కావడంచేత దేవల ప్రభువు నూరుగురు శైవమతాధి పతులకు, తన్మత ప్రబోధానికి నూర గ్రహారా లిచ్చాడు. విప్రోత్తములకు భూరిదక్షిణలిచ్చాడు. నాట్యకారులకు, చిత్రకారులకు శిల్పకారులకు, గాయకులకు, కవులకు శాశ్వతభృతి కల్పించాడు.అప్పటికి చెరసాలలో ఉన్న దోషుల విడుదలకు ముదల ఇచ్చాడు.వారి మనః పరివర్తనకవకాశమిచ్చాడు. ఇట్లు పట్టాభిషేక మహొత్సవం ఇష్టమృష్టాన్న భోజన భాజనాదులతో ఆనందదాయ కంగా ముగిసింది

ఆనాటి సాయంకాలం సునాభ దంపతులు సుబుద్ధి, కార్య దక్షుడు, నీతిమంతుడు, దీర్ఘదర్శనుడను మంత్రులతో దేవలుని చెంతకు వచ్చారు. ఆ రాజర్షి వారిని సముచితరీతి గౌరవించి ఆ సనాలపై ఆసీనులు కండి అన్నాడు. వారు కూర్చున్నారు. ఇష్టా గోష్ఠిలో మంత్రులు దేవలునికి అంతరంగికులయ్యారు. సునాభుడు తాను వచ్చిన పని సగమైనదని దేవలునితో మహారాజా! తమకు రాజ్యసమర్పణ చేయుటతో మా దంపతుల శాపకాలం ముగిసింది. మాలోకానికి మేము వెళ్లాలి. అనుమతించండి మీరనుమతిస్తే తతిమ్మా సగంపని పూర్తియైనట్లే అని అన్నాడు. దేవలుడాశ్చర్య

పశుతూ సునాభ ధరావల్లభా! మీ వంటి సుకృతాత్ములకు శాపమా? నమ్మలేకున్నాను. మీ రేదో లోకమనుటచేత మీరు దేవజాతికి చెందినవారై ఉండాలి. దేవలోకమైనా, దేవతలైనా "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి" పుణ్యం తరగిపోతే ఎవరైన మానవ లోకంలో పుట్టవలసిందే అంతేగాక, మానవునికి మాత్రమే మోక్షార్హత ఉంది. మీరిక్కడే ఉండాలి. ఇది నా కోరిక బహుకాలం ఈ ప్రాజ్య సామ్రాజ్యాన్ని పాలించారు. రాజ్యపాలనలో నాకు తగిన సూచనలిస్తూ ఇచ్చట విశ్రాంతి జీవనం గడపండి. మీరు రాజ్యమిచ్చారు. వారసునిగా నేను రాజ్యానికి వచ్చాను. నన్ను మీ బిడ్డలా చూచుకోండి, ఏదో మీలోకానికి పోవాలనే తలంపు విరమించండి. అమ్మా! మీరైన వీరికి చెప్పండి అన్నాడు.

రాణి కలావతి మాట అందుకొని ... ... ... ... ... సమంజసమైనవే కాని, మా ఆత్మీయులందరు గంధర్వలోకంలో ఉన్నారు. వారి యెడబాటు ఇంతకాలం అనుభవిస్తున్నాము అన్నది. అంతట, సునాభుడు, మహాత్మా! మీరు చూపించే ఈ గౌరవాదరణలకు ఆనందిస్తున్నాము, ఉండాలనే అనిపిస్తున్నది. కాని, ఆత్మీయుల సాహచర్యం కోసం, మా మనస్సులు ఉవ్విళ్లూరుతున్నాయి. పోక తప్పదు. ఈ ఆదరణచాలు. మీకునేనూరక రాజ్యమివ్వడంకాదు; తలపై రాజ్యభారం మోపాను. మీరైతే మాకు మానవత్వం వదలించి దైవత్వమిచ్చారు. మీరు మాకు దైవం వంటివారు. మీదయవల్ల మా దంపతులకు దీపకాంతికి వస్తువుతోచినట్లు మరల గంధర్వత్వం సిద్ధించింది అనుపదం మృతికల్గించే ఈ మర్త్యలోకం తప్పిపోయి మాకు దివ్యలోకప్రాప్తి కల్గింది. మా రాజ్యదానంవలన మీ నుండి మాకు కల్గిన ప్రయోజనం అపారమైనది మీరు కావించినమేలు మరువరానిది. ఎంతోకాలం నుండి ఈ రాజ్యం మీ కప్పగించాలని మీ రాకకై ఎదురు చూచి చూచి మా కన్నులు కాయలు కాచినాయి. మీ

దర్శన భాగ్యం కల్గింది మాకు శాప విమోచనమయింది. మా శాప సముద్ర సముత్తరణానికి నౌకలా ఉపకరించారు. సత్పురుషుల దర్శనం, స్పర్శనం, సర్వదోష పరిహారకమూ, అఖండ పుణ్యఫల సంపాదకమై ఉంటుందిగదా! వెళ్లివస్తాము. ఇక సెలవీయండి అన్నాడు.

## చతుర్థాధ్యాయం-సునాభుడు దేవలునికి తనతాత తండ్రుల చరిత్రలు చెప్పుట

దేవలుడు వింతపడి రాజేంద్రా! మీరేజాతికి అలంకార ప్రాయులయ్యారు? మీ తాత తండ్రుల పుణ్య నామాక్షరాలెట్టివి? లోకమేది? ఇంతమంచి వారికి శాప మెందుకు కల్గింది? ఈ విష యాలు నేను తెలిసికోగూడదా? అన్నాడు. సునాభుడు చిరునవ్వుతో రాజోత్తమా! అవశ్యం తెలిసికోవచ్చు అర్హుడైన శ్రోత ఉంటే వక్త ఉండనే ఉంటాడు. కుతూహలం ఉన్నట్లున్నది. చెప్తాను వినండి.

మాది గంధర్వలోకం. జాతి గంధర్వజాతి. అష్టవసువులలో ప్రసిద్ధుడైన సావిత్రుడు మా తాత. ఆయన మహేంద్రగిరి పట్టణ ప్రభువు భుజబలంలో అసమానుడు. అనేక విద్యలలోవలె శాంబరీ విద్యలోను నిష్ణాతుడని ప్రఖ్యాతి పొందాడు. నిత్యమూ పరమ శివుని సందర్శించి సేవా భాగ్యం పొందుతుంటాడు

ఒకనాడు మాతాత కైలాసం నుండి తిరిగి వస్తూ ఒకలోయలో గంగా నిర్ఝర జలపూర పూరిత చంద్ర పుష్కరిణి చెంత నిలిచాడు, అందులోని వేయిరేకుల తామరపువ్వులు పరిమళిస్తూ మద ఝుంకృత భృంగ పరిష్వంగాన్ని కోరుతున్నాయి. తరగలపై తూగాడుతున్న హంస మిధునాలు మైథున క్రీడకు తలపడుతున్నాయి చక్రవాక పక్షులు చేటంత చెంగలువపూలలో రతికూజితాలు నెరపుతున్నాయి.

కన్నెలేళ్ల ఒళ్లు అల్లుకొంటున్నాయి. బులుకోళ్లు బులపాట పడుతున్నాయి.

ఆ చంద్ర సరసి ఊర్మిశోభాకరయై, పద్మముఖిగా, శైవాల కచగా, ఉత్పలనేత్రిగా, అంబుజనాళహస్తగా, కంబుకంఠిగా, చక్రవాక కుచగా, సైకత శ్రోణిగా తోచింది. ఒడ్డున తియ్యమామిడి మొగ్గ తొడిగింది. పుంస్కోకిల కుహుకుహూకారం మన్మథహుంకార ప్రాయమయింది. అచటి చెట్లపువ్వులు మరుని చెరకుసింగాణికి పువ్వుటమ్ములైనాయి "అరవింద మశోకంచ, చూతంచ నవమల్లికా-నీలోత్పలంచ పంచైతే పంచ బాణస్యసాయకాః "అని చెప్పబడిన మన్మథుని పంచబాణాలు సావిత్రుని హృదయాన్నిలక్ష్యం చేసికొని గాయపరిచాయి. అతడు స్త్రీ పొందు కైవలవంతలతో కలవరింతలతో పరితపించాడు.

ఇంతలో దైవయోగంవలన విగర బూచిన కడిమి చెట్టుమీద నుండి ఒకఆడ నెమలి రెక్కలారుస్తూ నేలపైవాలి. తిన్నగా పింఛాన్ని విరియించి నడుస్తూ సావిత్రుని సమీపానికి వచ్చింది. అప్పుడాతడు మన్మథబాణోపహతుడై తాపంతో ఉండుటచేత, రతికై తహతహ లాడుచుండుటచేత యుక్తాయుక్త విచక్షణా జ్ఞానంలేక కామాంధుడై తన మాయా విద్యా ప్రభావంతో దాన్నిమగువగా మార్చి కలిశాడు. ఆ మయూరికి మా తండ్రి రుక్మరథుడు పుట్టాడు.

రుక్మరథుడు పెరిగి పెద్దవాడై బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి అవధ్యత్వాన్ని. దివ్యాయుధ ప్రయోగకౌశలాన్ని వరాలుగా పడశాడు. విశ్వకర్మను లొంగదీసికొని మహేంద్ర పర్వత పాదమూలంలో స్వర్గనగరానికి దీటైన దివ్యనగరాన్ని నిర్మింపజేసికొన్నాడు. దానికి లక్ష్మీవర్ధనమని పేరు పెట్టాడు. ఆరాజు నగర సౌధగోపురాలు వైర

వీరులనేత్రాలకు సూదుల్లా గుచ్చుకొనేవి. ఆయనపేరే శత్రువులకు సింహస్వప్నం. ఆ దొర పగతులకు ప్రక్కలో బల్లెం.

ఒకనాడు రుక్మరథుడు మృగయావినోదియై దూరారణ్య తీరాలకు వెళ్లాడు. వేటాడి అలసిసొలసి దాహజలార్థియై తిరుగుతూ ఒకవనంలోని సరోవరతీరం చేరుకొన్నాడు ఒడ్డున గుఱ్ఱాలున్నాయి. ధనుర్బాణ తూణీరాలున్నాయి. కొలనిలో ఒకరాచకన్నె తనచెలులతో జలక్రీడలాడుతున్నది. వారు ఒండొరులమీద తామర పువ్వులుకోసి విసరుకొంటున్నారు. చేరలతో దోసిళ్లతో నీళ్లు చల్లుకొంటున్నారు. అకస్మికంగా ప్రత్యక్షమైన రాజునుచూచి వారు కొలనినుండి బయటకువచ్చారు పొడి ఉడుపులు ధరించారు. వారిలోని రాజకన్య సౌందర్యానికి రుక్మరథుడు ఆకర్షితుడయ్యాడు. రుక్మరథుని సౌంద ర్యానికి ఆమెగూడ ఆకర్షిత అయింది. ఇద్దరు పరస్పర సౌందర్యా కర్షితులై శృంగార భావహావహేలా విలాసాలకు లక్ష్యమయ్యారు. ఆయన కొంత తడవునకు తేరుకొని కుసుమకోమలులారా! క్రూర జంతు సంతాన దంతురితమైన ఈకాంతారంలో మీవంటి కాంతలు స్వేచ్ఛా విహారం చేయడం అపాయకరంగాదా? అన్నాడు. రాజ కుమారి ఆర్యా! అక్రూర జంతువులను వేటాడటానికి ధనుర్బాణ కృపాణపాణులమై వచ్చాము. ఇక అపాయమెక్కడిది? అన్నది. ఆరాజ తరుణీ! కావచ్చు. ఏ ఆరణ్యకులైన ఈవైపువచ్చి మీఒంటి మీద చేయివేయజూస్తే? . అని సాభిప్రాయంగా ప్రశ్నించాడు. ఆమె ధనుర్బాణ కృపాణ పాణులమై వచ్చామని చెప్పాను గదా! మాకేమిభయం? అంతగా మాబలంచాలకపోతే ప్రస్తుతం మీసహా యముండనే ఉంటుంది. అన్నది. అతడు ఊం.... బాగున్నది. నేను రాబోతున్నానని కలగని మీరీగహనసీమకు వచ్చారా? అన్నాడు. ఆమె కాదనుకోండి. అయినా, మాకెవరివలనాభయంలేదు. మమ్మల్ని ఎవరేమి చేయలేరు అన్నది. అతడు నవ్వి నేనే ఎగరేసుకొని పోతే?

అని మళ్లీ అర్థప్రశ్నవేశాడు. ఆమె నవ్వుతూ మీరంత దుండగానికి ఒడిగట్టరు. మీరెంతో మంచివారనిమీముఖమేచెవుతువ్నది అన్నది. అతడు సరిసరి ఇది మరీబాగున్నది మీరడవికి కొత్తగావచ్చినట్లు న్నది. రాజపుత్రికలా ఉన్నారు. ఎవరి పుత్రికవో, నామమేదో, పట్టణ మేదో తెలిసికోవచ్చునా? అన్నాడు. ఆమె తన ముఖ్య సఖివైపు చూచింది.

ఆసఖి ఆర్యా! మాభర్తృదారిక పారిజాతాద్రియందలి విలాస నగర పాలకుడైన హేమమాలి అనే గంధర్వ మహారాజులుంగారి ఏకైకపుత్రిక మారాజదంపతులు మాచెలికి “ పద్మకోమల ” అని ముద్దుగా పేరుపెట్టుకొన్నారు. ఈమెకు మేము ప్రాణసఖులము. వేటకు వచ్చి ఇచట స్త్రీ సహజబుద్ధితో అలంకరణకు పుష్పావచయం చేసి ఈపద్మాకరంలో జలక్రీడలాడాము అంటూ పూజ్యుల విషయం గూడ మేము తెలిసికొన గోరుతున్నాము అన్నది

అతడు విలాసినీ! అష్టవసువులలో ప్రసిద్ధుడైన సావిత్రుని కుమారుడను, నాపేరు రుక్మరథుడు, బ్రహ్మదేవుని వర ప్రసాదంపొందాను, లక్ష్మీవర్ధన నగరాన్ని పాలిస్తున్నాను. ఇదీ నాసంగ్రహచరిత్ర. మీప్రియసఖి మరీ, ముద్దరాలు అన్నాడు, ఆసఖి అవును. తల్లిచాటుపిల్ల, బొత్తిగా లోకమెరుగదు. అన్నది. అతడు మరి, మీరాజకుమారి ఎవరికైనా మనసిచ్చిందా? అన్నాడు. లేదు. మీ చూపుల వ్యాపారం, నటనలూ చూస్తుంటే మీలో ఎవరెవరికి మనసిచ్చారో అర్థంకాకుండా ఉన్నది. అన్నది. అతడు మేమిచ్చాము. మీసఖి పుచ్చుకొన్నదో లేదో తెలిసికొన వచ్చునా? అన్నాడు. ఆసఖి పద్మకోమలవైపు చూచింది. ముఖంలో సిగ్గుదొంతరలు పొంగి పొరలిపోతున్నాయి. చూపులు బరువెక్కి వాలిపోతున్నాయి. ఆమెకాలి బొటనవ్రేలితో నేలరాస్తూ సఖీ! నాకు

సిగ్గుగా ఉన్నది. పోదమే! అన్నది. సఖి నవ్వుతూ వచ్చిన అతిథిని సత్కరించకుండ పోదామా? అన్నది ఏమో అదినాకు చేతగాదు. మీరు సత్కరించండి. నేను వెడతాను అన్నది. సఖి ఇది చాల బాగున్నది. ఆయన రాజకుమారుడు, నీవురాజకుమారివి. మీ మీ గౌరవ మర్యాదలు మీకు తెలియాలికాని, మాకేమి తెలుస్తాయి? నీవే సత్కరించాలమ్మా! అన్నది. నృపాత్మజ సఖీ! నన్నెందుకు బాధిస్తావు? అన్నది.

ఆరాజు మీప్రియసఖికి ఇష్టంకానట్లున్నది. ఇచ్చిన నామన స్సును పుచ్చుకోలేదేమో! చెప్పి పొమ్మనండి అన్నాడు. ఆ సఖి నవ్వుతూ అమ్మా! పుచ్చుకోలేదని చెప్పి పొమ్మంటున్నాడాయన. అన్నది. పద్మకోమల సిగ్గుబరువుతో చెప్పడమెందుకు? మా అమ్మగారు నాకోసం ఎదురుచూస్తుంటారు పోవాలి అన్నది. సఖి భర్తృదారికా! అది సంస్కారపద్ధతికాదు. అతిథిని అగౌరవపరచరాదు. నీవు వీరితో మాట్లాడుతూఉండు. ఒక్కక్షణంలో అప్పక్క చెట్ల పండ్లను కోసి కొని వస్తాము. వాటితో అతిధికి ఆతిధ్యమీయవచ్చు అన్నది. ఆమె నాకు భయంవణకుగా ఉన్నది. అదినావల్లకాదు. నేనువెడతాను. అని గుఱ్ఱాన్ని పిప్పి ఎక్కి కూర్చున్నది..... ఆసఖి రుక్మరథ మహా రాజా! అనంతర కర్తవ్యం ఆలోచించి గౌరవపద్ధతితో ఆచరణలో పెట్టండి. ఈ పిల్ల నవోఢకావడంతో బెదరింది. అలసిస్తే ఒంటరిగా వెడుతుంది. అది ప్రమాదం కనుక మేమూ అనుగమిస్తాము. సెలవీయండి పునర్దర్శనంకోసం నిరీక్షిస్తుంటాము అన్నది. అతడు సరే అన్నాడు. ఆయువతులందరూ గుఱ్ఱాలెక్కి వెళ్లిపోయారు.

రుక్మరథుడు ఒంటరివాడయ్యాడు. పిట్టచేతికి చిక్కి తుఱ్ఱు మన్నదే అని కళ్లప్పగించి అటుకొంచెంసేపు చూచాడు. దీర్ఘనిశ్వాసం విడిచాడు. వెంటాడక మర్యాదతోనే కార్యం సాధించాలని లక్ష్మీ

వర్ధన నగరానికి వెళ్ళాడు. మంత్రులను సమావేశపరచి ఈ సంగతి చెప్పి హేమమాలికడకువెళ్ళి పిల్లనడిగిరండని పంపాడు. వారుపోయి అడిగారు. హేమమాలి వికటంగా నవ్వి మంత్రులారా! మీరాజు మయూరి యోని సంభవుడు. ఒకపక్షికి పుట్టాడయ్యా! మావంటి ఉత్తమ జాతివారితో నీచజాతివారికి పొత్తా? మాతో వియ్యమెట్లు కుదురుతుందని వచ్చారయ్యా, మీరు? గోవుతో గోమాయువునకు సంబంధమా? కాకిముక్కుకు దొండపండా? మాణిక్యాన్ని మసిగుడ్డతో ముడివేస్తారటయ్యా? అనిపరిహసించాడు. మంత్రులు తెల్లబోయి విచార హృదయులై వచ్చి అక్షరం పొల్లుపోకుండా ఈవిషయాన్ని రుక్మరథునికి తెలియపరచారు.

అగంధర్వపతి గుండె గండరించింది.ఆగ్రహోదగ్రుడయ్యాడు వెంటనే సైన్యంతో వచ్చి విలాసపట్టణాన్ని ముట్టడించాడు. హేమమాలిగూడ సైన్యంతోవచ్చి ఎదిరించాడు. పోరు ఘోరమైంది. ఉభయసేనలు సంకుల సమరం కావించారు. ఆ గంధర్వరాజులిద్దరూ ఉల్లసములాడుకొంటూ అనేక శస్త్రాస్త్రాలుప్రయోగించారు. రుక్మరథుడు నవయువకుడు దివ్యాస్త్రప్రయోగోప సంహారాలు చక్కగా నెరిగినవాడు. పురుషకారం, దైవబలం రెండూ కలవాడు. ఇక హేమమాలి ఒక్క పురుషకారమేగాని అన్యమెరుగనివాడు. కొంచెం వయసుమళ్ళినవాడు బలంపెరిగేస్థితి ఒకరిది. బలంతరిగే స్థితి మఱొకరిది. రుక్మరథుని బాణాల తాకిడులకు తట్టుకోలేక, హేమమాలి సొమ్మసిల్లి రథంపై పడిపోయాడు.

రుక్మరథుడు తన రథమునుండి క్రిందికి దూకి చకచక నడచిపోయి శత్రురథమెక్కి హేమమాలి ముఖంపై నీళ్ళుచల్లి, ఆయన తలను తనతొడపై నిడుకొని వింజామరతో వీవసాగాడు. కొంతవడికి హేమమాలి సేదతేరి కళ్ళుతెరచిచూచాడు. రుక్మరథుడు తనకు సేవ చేస్తున్నాడు. ఇది స్వప్నమా? లేక, జాగ్రత్తా? అని విస్తుపోయాడు.

శస్త్రాస్త్రాలతో బాధించిన శత్రువు తనరథంపైకి రావడమా? వచ్చినవాఁడు చులకనగా చంపక సేవచేయడమా? ఇది ఏమి భాగ్యము!! అనుకొంటూ చివాలునలేచి రుక్మరథా! నీవు మహోన్నతుడవు. మహోదాత్తభావాలు కలవాడవు చంపదగిన శత్రువు చేతికి చిక్కినా, చంపక సేవ చేస్తున్నావు రత్నాన్నిగాజు పూసగా పరిగణించాను. పుత్తడిని ఇత్తడిగా భావించాను హంసను వక్కు కొంగగా నిరసించాను. ఇంత మంచివాణ్ణి నీచజాతివాడని నిందించిన నా పాపానికి పరిహారమేమిటి? నే నెంతపాపిని నా తప్పు క్షమించు నాయనా! అని కాళ్ళపైబడి కాళ్లు పట్టుకొన్నాడు.

రుక్మరథుడు వానిని లేవనెత్తి గంధర్వరాజా! మీ వంటి పెద్దవారు చిన్నవాడి కాళ్లపై పడుట న్యాయమా? మీరు అస్త్ర బాధోపశమనానికై విశ్రాంతి తీసికోండి అన్నాడు. హేమమాలి రుక్మరథుని చేతులు పట్టుకొని బిడ్డా! నీ నిజదర్శనం చేత నా కళ్ల పొరలు విడిపోయినాయి జ్ఞానోదయమయింది. నిన్ను నిందించిన వాగ్దోషం పోవాలంటే నీవు నా బిడ్డ పద్మకోమల పాణిగ్రహణం చేయాలి. నీ వంగీకరించేదాక నాకు మనశ్శాంతి ఉండదు. ఇవి చేతులు కావు; కాళ్లు. అని ప్రాధేయపడ్డాడు. రుక్మరథుడు సమ్మతించాడు. వారికి వివాహం అతివైభవంగా జరిగింది.

## సునాభుడు దేవలునికి తన పూర్వజన్మ వృత్తాం చెప్పుట

ఆ పద్మ కోమలా రుక్మరథ దంపతుల ప్రేమానురాగ ఫలంగా నేను జన్మించాను. గంధర్వజాతికి సంబంధించి అప్పటి నా పేరు స్వర్ణకేతువు. నేనుయుక్త వయస్సునకు వచ్చి చిత్రరేఖను పరిణయ మాడేను అప్పటి చిత్రరేఖయే ఇప్పటి ఈ కలావతి.

పెండ్లి వేడుకలలోనే ఒకనాడు మా నవదంపతులము కైలాస శిఖరానికి వినోద విహారం వెళ్లాము. గిరిదరీ ద్వార ముఖాచ్ఛాదిత

మేఘాలను కదలించి ముత్యాల జల్లులు కురిపించాము. జ్యోతిర్లతల వెలుగులలో గుహావిహారంచేశాము, చమరీ మృగాలతోసయ్యాటలా డాము. లేడిపిల్లలతో పరుగులుతీశాము. తెల్లనిఏనుగు పిల్లలను సింహ కిశోరాలతో ఆడించాము. చెవులు పట్టి పలికించి పాడించాము. ఒక వైపు పగిలిన పండు వెదురు బొంగులపొదలు గాలిని పూరిస్తూ సంగీత మందుకొన్నాయి. మాపదములు నాట్యక్రమమందుకొన్నాయి చేయి చేయి పట్టుకొని పాడుకొంటూ ముందుకు నడుస్తున్నాము. కొండ వాగుగండశిలల మీదుగాదూకుతూ ప్రవహిస్తోన్నది. దానివెంటకొంత దవ్వువెళ్లాము. అచటరంగు రంగుల శివమల్లీలతా నికుంజాలు, శివ పారిజాతాలు పూచి పరిమళించే అందాలలోయ కనపడింది ఆ లోయ లోనికి మెల్లగా దిగుతూపోతున్నాము.

ఎచటిదో మువ్వల సవ్వడి నవ్వులతో మా చెవులకు తేనె వవులూరించింది. అచటికి చేరుకోవాలనే తహతహతో సెలయేటి యిసుక దరులలో ఏపుగా పెరిగి పూచిన మల్లె మొక్కలనుండి జుమ్మనిలేచే ఎలదేటి దాటుల్ని తోలుతూ తీగల ఆసరాతో క్రిందికి వెళ్ళాము. నాట్యపద ఘట్టనలు స్పష్టంగా వినవస్తున్నాయి. ఏలా లవలీలవంగ వల్లీ వేల్లిత నాగార్జున వృక్షాలు పాముపడగ పట్టిన శివ లింగ పుష్పాలతో నేత్రోత్సవమూ, భక్తిపారవశ్యమూ కల్గించాయి. పిట్టల కలకల ధ్వనులు హృదయ వీణను శ్రుతిమీటుతున్నాయి. దారిపొడవునా అంతటా నెమళ్లు పింఛములు విప్పి ఏ ప్రేరణ చేతనో విచిత్ర పదగతులతో వినూత్న నాట్యం చేస్తున్నాయి ఆ చెట్ల మధ్య రత్న గుహా గృహంలో శివపార్వతులు ఏకాంతంగా ప్రణయానంద తాండవం చేస్తూ కనిపించారు. అచట ప్రక్కగా నిలిచి కొంచెంసేపు చూచాము. మేము ఆ నవీన నాట్యశైలి తెలిసికోవాలని ముందుకు వచ్చాము పార్వతీదేవి మా జంటను చూచి కనుబొమలు ముడిచి రుసరుసలాడుతూ ప్రక్కకు పోయింది ఈ హఠాత్ పరిణామానికి

మండిపడుతూ పరమేశ్వరుడు మా ముందుకు వచ్చి ఓరీ దుర్మదాంధులారా! ఇంత విశాల పర్వత భూభాగంలో మీ విహారానికి ప్రత్యేక ప్రదేశం లేక పోయిందా? మేమున్న చోటికి వచ్చి మా రహస్యకేళిని భంగ పరచడం దేనికి? ఇది క్షమింపరాని అపరాధం. ఉన్నతలోక సంచారార్హతగల మీ గంధర్వత్వం పోయి మీరు మర్త్యలోకంలో మానవులై జన్మింతురు గాక! అని శపించాడు.

అంతట మేము గడగడ వణకుతూ మృడుని అడుగులపైబడి తండ్రీ! పెండ్లి సంబరముతో ఈ సుందర శిఖరాన్ని సందర్శిస్తూ చిరుగజ్జల మ్రోతవిని అదేదో తెలిసికోవాలని మీరున్నది తెలియక ఇటువచ్చాము. మా బాల్య చాపల్యాన్ని మన్నించండి కైలాసగిరి శిఖర సౌందర్య సందర్శనం లేక మాకు సుఖశాంతులుండవు. శాపావధి అనుగ్రహించండి అని యిద్దరం కన్నీరు మున్నీరుగా ఏడ్చాము స్వామి కరగి కనికరంతో మాతల నిమిరి బిడ్డలారా! విచారించకుడు. విధి అలంఘ్యము. స్వర్ణకేతూ! భారతదేశంలో ఆమోదపట్టణాధీశుడైన భద్రబాహు మహారాజువలన పట్టమహిషి ఇందు మతికి నీవు సునాభుడవై జన్మిస్తావు. ఈమె కాశీరాజునకు కళావతి పేరుతో జన్మిస్తుంది. ఇప్పటివలె మీరు ఆలోకంలో ఆలుమగలై రాజ్యపాలన చేస్తారు. మీదటలోకోపకారార్థం వస్త్రోత్పాదనకై నా తేజస్సువలన దేవలుడను వాడు జన్మిస్తాడు వాడు నీ దగ్గరకు వచ్చినపుడు నీ రాజ్యమిచ్చి పట్టం గడితే సూర్యోదయంతో చీకటి నశించినట్లు మీ శాపం తీరుతుంది. మర్త్యత్వంపోయి పూర్వగంధర్వత్వం సమకూరుతుంది అని చెప్పి ఆది దంపతులు అదృశ్యులయ్యారు. శాపంవలన మేము మానవులమై జన్మించాము. నీ వలన శాప విమోచనం పొందాము. ఇది మా కథ.

శివశివాధి వాసమైన రత్నరంజిత కైలాస శిఖరాలు చూడాలని ఉత్కంఠ పడుతున్నాము. ఆ మహోన్నత శిఖరాగ్ర భూములలో

ఆకాశగంగా ఝరీప్రవాహ జలపాత ఘుంఘుమ ఘోషలలో, కడిమి గన్నేరు సంపెంగ గొజ్జంగి చెట్లపూల వలపుగాలి తరగలలో, పురి విప్పి ఆడే నెమళ్ల నాట్యాను కూలంగా, గాంధార గ్రామంలో శివ గీతాలాపన చేసేదెప్పుడెప్పుడని మనస్సు తొందర పడుతోంది. ఆగిరి రత్నసానువులలో బిల్వ రుద్రాక్ష తరువేల్లిత ప్రఫుల్ల మల్లీ వల్లీ నికుంజపుంజచ్ఛాయా వేదికలపైని ప్రమథులతోపాటు పంచ బ్రహ్మషడంగ మంత్రాలతో, ప్రాసాద పంచాక్షరిని పఠించే గోరు వంకలను,- నీలకంఠస్తోత్రావళివల్లించేరాచిలుకలను,- శతరుద్రీయ మాలపించే కొదమ కోయిళ్లను,- ప్రణవాక్షరగీతిని ప్రస్తరిస్తూ ఝుంకరించే గండు తుమ్మెదలనుచూడాలనిఉబలాటపడుతున్నాము. ఉదయసాంధ్య వేళలలో బ్రహ్మ మద్దెల వాయింప, సరస్వతి పాడుతూ వీణమీట, విష్ణువునన్నాయి ఊద, లక్ష్మీకాంస్యతాళం మ్రోగింప, సనక సనందనాది బ్రహ్మర్షులు, ప్రమథులు సదస్యులై సేవించుచుండగా బ్రహ్మకుండ ప్రభవమైన సహస్రదళ పద్మకర్ణి కాంతర ప్రణవవేదికపై మధురలాస్యం మధురతాండవం అభినయిం చే పార్వతీపరమేశ్వరుల లీలా వైభవం ఒళ్లంతాకళ్లుచేసికొని చూడా లని హృదయమారాట పడుతోన్నది, నటరాజస్వామి హస్త ప్రస్తా రితడమరుక శబ్దతరంగ రింగణాలు అఇ ఉణ్, ఋఌక్, ఏఓఙ్, ఐఔచ్ మొదలైన చతుర్దశ సూత్రాలు వినాలని ఉవ్విళ్లూరుతున్నాము. బ్రహ్మానంద స్వరూపమైన ఆ పరమశివుని దివ్యమంగళ విగ్రహ సందర్శనం కంటెఇంకేమికోరుకోవాలి? జన్మధన్యంకావాలంటే ఇంత కంటె ఏమికావాలి? ఆ భూమిలో పుట్టింది ఆ భూమికే చేరుకోవాలి. ఈ బంధ విచ్ఛేదం కావాలి. అనుమతించండి. అన్నాడు.

దేవలుడు ఆనంద బాష్పాలు విడుస్తూ మహాత్మా! నేనూ మీ వంటి వాడనే. నా దారిగూడ అదే. నేను పరమ శివుని అత్మ సంభవుడను. కొంతకాలానికి నేనూ నాజన్మ భూమికి చేరుకోవలసి

ఉన్నది. ఆ దివ్యానుభూతిని పొందవలసి ఉన్నది. సరే. మీ యిష్టం కానీయండి. అన్నాడు.

కలావతీ సునాభులు అచటి వారినందరిని పలుకరించి గంధర్వులయ్యారు ఇంతలో దివ్య విమానం వచ్చింది. వారు దాని నెక్కి గంధర్వలోకం వెళ్లిపోయారు, వారిపోక, ప్రజలకు చిరకాల సహవాస తంతు విచ్ఛేదమై చింతాభారమైతే, దేవలునిరాక, నవ స్నేహామృతధారయై మధురబంధమై కడలికి రాకా చంద్రోదయంలా ఉత్సాహానంద సంధాయకంగా పరిణమించింది. క్రొత్తరాజు హృదయం సుతిమెత్తనిదనీ, రేరాజు చలువ వెన్నెల వెలుగుల్ని కుప్ప పోస్తుందనీ, సన్నజాజుల సౌరభాలను ఎగబోస్తుందనీ మంత్రులు పసికట్టారు.

## పంచమాధ్యాయం-దేవలుడు నేత పరికరాలకై మయునికడకు పోదుననుట

మరునాడు దేవలుడు నలుగురు మంత్రులను రావించి రాజ్యం లోని అత్యవసర విషయాలను సమీక్షించి తెలిసికొన్నాడు. ఆయా పనులు నలుగురికి విభాగించి మీరు ప్రజోపయోగకరంగా వాటిని చేపట్టి తగిన పరివారంతో నెరవేర్చండి. కారాగారం నుండి దోషుల్ని విడిపించాము. దోషాలు పునరావృత్తం కాకుండా వారిని సన్మార్గంలో పెట్టడానికి శిక్షకుల్ని నియమించండి. అజ్ఞానం అన్నిపాపాలకు మూలం. విద్యా విజ్ఞాన వికాసాలకై ఊరూర పేట పేట పాఠశాలలు పెట్టి, బాలబాలికలను, వయోజనులను చదివించండి. ప్రజారోగ్య సంరక్షణకై మారుమూల పల్లెల్లోగూడ వైద్యశాలలు తెరవండి దేవాలయాలు కేంద్రాలుగా తగుపౌరాణికుల చేత శివాద్వైత మతకథా సాహిత్యాన్ని చెప్పించండి ప్రజల్లో ధార్మిక జీవితం మూడుపువ్వులారు కాయలుగా పెంపొందించండి

లోకుల మానరక్షణకై వస్త్రోత్పత్తి కావించుటకు నేను జన్మించాను. వస్త్రసృష్టికి అనేక పరికరాలు కావాలి. అవి చేయగలవాడు ఒక్కమయబ్రహ్మ మాత్రమే. ఆయన విశ్వకర్మ కుమారుడు. ప్రస్తుతం మేరు పర్వత సాను ప్రదేశంలో నివసిస్తున్నాడు. ఇప్పుడు నేనక్కడికి పోవాలి. తిరిగి వచ్చేదాక, నేను లేనిలోటు కనిపించకుండా, ప్రజా పాలన నిర్వహించండి అన్నాడు. నలుగురు మంత్రులు మహారాజా! ఎక్కడ ఆమోదపట్టణం? ఎక్కడ మేరు పర్వతం? మధ్య కొన్ని వందల యోజనాల దూరముంటుంది చతురంగ బలంతో మేము మీకు సహాయంగా వస్తాము. అన్నారు, దేవలుడు చిరునవ్వుతో మంత్రి వర్యులారా! నేను పరమశివుని సద్యోజాతముఖ ఫాలనేత్ర జ్యోతియందు ప్రభవించాను. నాకు దైవసహాయమేగాని, మానవ సహాయం అవసరంలేదు. కేవలం ధనుర్బాణ కృపాణ పాణినై ఒంటరిగా ప్రయాణించ దలచాను. పూర్వంవలె ప్రజా పాలనలో అప్రమత్తులై ఉండండి అనిచెప్పి బయలుదేరాడు.

## దారిలో గార్గ్యమున్యాశ్రమం

ఆయన కతిపయ ప్రయాణాలు సాగించి నదీ తీరమందలి గార్గ్యమహాముని ఆశ్రమ ప్రాంతానికి వచ్చాడు అచట జంతువులు సహజవైరం మాని స్నేహ సౌహార్ద్రాలతో వర్తిస్తున్నవి. ఎలుకపిల్లలు త్రాచుపడగలపై ప్రాకుతున్నాయి. కుందేళ్లు బెబ్బులిపైకెక్కి స్వారి చేస్తున్నవి సింహం మదగజంతో మంతన మాడుతోన్నది. బ్రాహ్మణ కుమారులు ఫల సమిత్కుశ కుసుమాదులు మోసికొనివస్తూ మార్గ మధ్యంలో శాస్త్రవిచారణ చేస్తున్నారు. దేవలుడు వారితో కలసి మాట్లాడుతూ ఆశ్రమంలో అడుగుపెటాడు. జింక పిల్లలు చెంగున దుముకుతూ పోతున్నాయి. లే బెయ్యలు పచ్చిక పరకలు కొరుకుతున్నాయి. హెూమధూమం అంతరాళమంతా వ్యాపించి నేతి వాసన

ఘుమాయిస్తున్నది. గున్నమామిడి తిన్నెమీద కూర్చుండి అపర శంకరునిలా శిష్యులకు ఉపనిషన్మంత్ర పాఠం ప్రబోధిస్తున్న గార్గ్యాచార్యులవారు కనిపించారు.

దేవలుడు వచ్చి మోకరిల్లి గార్గ్య మహాభాగా! ప్రణామములు· వస్త్రోత్పాదనకై జన్మించిన దేవలుడను. నేతపనిముట్లకై మయబ్రహ్మ కడకు వెడుతూ మధ్యలో తమ దర్శనార్థం వచ్చానని తెలిపాడు. ఆ మహర్షి సంకల్ప సిద్ధిరస్తు అని దీవించి దర్భాసనం చూపించి, కూర్చున్న తర్వాత దేవలబ్రహ్మ! నీవు శివపుత్రుడవని తెలుసు. ఆమోదపట్టణాధీశ్వరుడవనీ తెలుసు. ఈ దినం నీవు మాకు అతిథివి. అని చెప్పి శిష్యులకు అటవిడుపు ప్రకటించాడు

ఆ మహర్షి రాజర్షులిద్దరు ఇష్టాగోష్ఠి జరుపుకొని కుటీర ప్రాంగణం లోనికి వెళ్లారు. యథావిధి అర్ఘ్యాదులతో అతిథి మర్యాదలు జరిగాయి· కందమూల ఫలాదులు సహపంక్తి భుజించారు. దేవలుడారేయి అచట గడపి, మరునటి రోజు ప్రాతః కాలకృత్యాలు తీర్చుకొని మునిసమ్మతితో పయనమయ్యాడు.

## సింహం యక్షుడుగా మారి తన పూర్వవృత్తాంతం చెప్పుట

దేవాంగుడు క్రూరమృగ సంకులమైన ఒక ఘోరారణ్యంలో బడి వెళ్లుతున్నాడు. ఒక పండు ముదిసింగం కొండగుహలు ప్రతిధ్వనించేట్లు భీకరంగా గర్జిస్తూ మీదకు వచ్చింది. ఒక తీక్ష్ణబాణం వింట సంధించి దానినొసట· దిగిపోయేట్లు కొట్టాడు. అయినా, ఆ సింహం ముందుకు వస్తుంటే ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. దాని జ్వాలలకు పంచాస్యం తగులబడింది. ఆ మంటలోనుండి ఒకదివ్య వ్యక్తి రూపొందాడు. దేవలుడు రిచ్చవడి నీవెవ్వరవు? సింహమెట్లయినావు? అని అడిగాడు. ఆ దివ్యుడు చేతులు జోడించి

మ్రొక్కుతూ ఓ దేవలమనుబ్రహ్మ! నీదయవలన శాపవిముక్తి పొందాను. నేను కపింజల నామధేయుడను. యక్షజాతివాడను. కుబేరునికి అంతరంగిక సఖుడను.

ఒకనాడు నా అనుచరులతో వేటకు వెళ్లాను. అందరం ఎన్నో జంతువులను వేటాడాము. నేను అల్లంత దూరంలో ఒక జింకను చూచాను. దాన్నిపట్టాలి కొట్టాలి అనివెంట బడ్డాను అది అందకుండా, పొందకుండా బిత్తరి చూపులతో చెంగు చెంగున దుముకుతూ పారి పోతున్నది. కొంతదవ్వు వెంటాడి. విసిగి బాణమేశాను. ఆ బాణం దానివెన్నెముకకు క్రిందతొంటికి బలంగా గ్రుచ్చుకొన్నది. అయినప్ప టికి.అది నిలువక ఆబాణంతోనే తత్తరంగా గౌతమాశ్రమంలోనికి వెళ్లి ంది గౌతమ మహర్షి నెత్తురోడుతున్న జింకను దగ్గరకు తీసి కొన్నాడు. విల్లెక్కుపట్టి వస్తున్న నన్నుచూచాడు ఆయన కనులెఱ్ఱ జేసి ఓరీ యక్షాధమా! పసిబిడ్డలా పెంచుకొంటున్న ఆశ్రమ మృగాన్ని చంపదలచావటరా? నీవు మెక్కటానికి అడవిలో జంతువులే కరవై నాయటరా? ఈ క్రూరచర్యకు సింహం కమ్మని శపించాడు.

అంత నేను గడగడ వడకుతూ ఆయన అడుగులపై బడి గౌతమ మహర్షీ! నేను సింహమై బ్రతుకలేను నా అజ్ఞాన చర్యను మన్నించి శాపావసానం అనుగ్రహించండి అని బహు విధాలుగా వేడుకొన్నాను. ఆమౌని శాంతించి కపింజలా! కొంతకాలానికి దేవల మనువు లోకుల మానరక్షార్థం వచ్చి నీపై బాణ ప్రయోగం చేస్తాడు దానితో నీకు శాపవిముక్తి కలుగుతుంది. ఎప్పటి యక్షుడవౌతావు. అని కనికరించాడు. త్రుళ్లిన యెద్దు గంతమోయక తప్పదు గదా!

ఓ దేవల బ్రహ్మ! నేటికి నీ దర్శన భాగ్యంచే నా పాపం పోయింది. నా శాపమూ నివృత్తి అయింది. ఇప్పుడు నేను పరి

శుద్ధుణ్ణి అయ్యాను. నీమేలెన్నటికిని మరువలేను. ఇచటికి మూడా మడల దూరంలో వామనాశ్రమమున్నది. ఆ మహనీయుణ్ణి తప్పక కలసి కోవలసిందిగా ప్రార్థిస్తున్నాను. అని గంతవ్య మార్గ ముపదేశించి సెలవు తీసికొని అంతర్ధానమయ్యాడు.

## షష్ఠాధ్యాయం-వామనాశ్రమం

అచటినుండి దేవలుడు దుర్గమారణ్య పర్వత నదీనదాలను దాటుతూ ప్రయాణం సాగించి పావనగంగా నదీ ప్రవాహజలాలలో స్నాన పానాదులు నిర్వర్తించి వామనాశ్రమం చేరుకొన్నాడు. ఆ ఆశ్రమం శాంత పావనమూ, అచింత్య వైభవోపేతమై ఉన్నది. ఫల పుష్ప వృక్షలతా గుల్మాదులతో వివిధ పక్షుల కలకూజితాలతో నేత్ర శ్రోత్ర పర్వమైఉన్నది. కెలకుల తామర కొలకులలో హంసలు తిరుగాడు తున్నాయి. క్రూరసాధు జంతువులు జాతివైరం లేక సామరస్యంగా జీవిస్తున్నాయి. మునికన్యలు జల ఖాండాలతో వృక్ష సేచనం చేస్తున్నారు. ముని కుమారులు వేద పనసలు వల్లె వేస్తు న్నారు. ఆశ్రమ వట వృక్షచ్ఛాయలో సనకసనందనాదులకు దక్షిణా మూర్తివలె వామదేవ మహర్షి శిష్యులకు తత్త్వోపదేశం చేస్తున్నాడు.

దేవలుడు ఋషికి పాదాభివందనం చేసి మహాత్మా! లోకుల మానరక్షణకై అవతరించిన దేవలుణ్ణి. నేత పరికరాలకై మయబ్రహ్మ కడకువెడుతూ మార్గ మధ్యలో తమ దర్శనార్థం వచ్చాను. అన్నాడు. వామదేవుడు పరమానందంతో నీవేనా, పరమశివుని తేజోంశంవలన పుట్టినవాడవు? దేవలుడవు నీవేనా? నాయనా! ఈ దర్భాసనంపై కూర్చో కూర్చో. స్వాతి చినుకుకై ముత్తెపుచిప్పలా నీరాక కోసం చిర కాలం నుండి ఎదురు చూస్తున్నాను. ఈ పరిసర ప్రాంతాలకు, మా ఆశ్రమానికి ఒకపీడ వచ్చి పడింది. అది నీవలననే తీరవలసి ఉంది.

అన్నాడు. దేవలుడు కూర్చొని స్వామీ! మీ వంటి పుణ్య తపోధను లకు, అహింసా వ్రత జీవనులకు పీడ కల్గించేవాడు రాక్షసబుద్ధి కలవాడే అయి ఉంటాడు. వాడెవడో చెప్పండి. నాదివ్యాస్త్రాలతో వాణ్ణి రూపుమాపు తాను అన్నాడు. ఋషిపుంగవుడు తృప్తిపడి దేవల బ్రహ్మ! నీవు కారణ జన్ముడవు. నీ శక్తి సామర్థ్యాలు నాకు తెలుసు. ఇచటికి రెండు క్రోసుల దూరంలో దుర్గమ పర్వతగుహాలో కుండికుడను రాక్షసుడున్నాడు. వాడు తాటి చెట్టంత ఎత్తుంటాడు. కను గ్రుడ్లు తాటికాయ లంతలు, ఒక మాటలో చెప్పాలంటే నడిచే కాటుక కొండలా ఉంటాడు. వాడు చిచ్చరపిడుగులా మనుష్యులపై బడి, జంతువులపైబడి పట్టి తింటాడు. ఇచటివారికి గుండె గాల మయ్యాడు. ఏ క్షణంలో ఎవరేమౌతారో తెలియదు. అందరూ ప్రాణాలు అరచేత పట్టుకొని బ్రతుకుతున్నారు. తపోవ్యయానికి వెరచి వాణ్ణి ఏమి చేయలేక పోతున్నాను. ఆశ్రమ రక్షణమాత్రం సాధ్య మౌతున్నది. నీవు ఆదుష్ట రాక్షసుని సంహరించాలి. వేదవిదులైన బ్రాహ్మణులను హింసించే వారికి దుర్గతి కలుగుతుంది. బ్రాహ్మణు లను ఆదరించి కాపాడేవారికి సద్గతి కలుగుతుంది. ఆత్మజ్ఞానంచేత మనంఒక జాతివారం ఈ జాతి రక్షణ సర్వప్రాణి రక్షణ. రాజుగా నీ విది చేయవలసి ఉన్నది. కావున, ఆ రాక్షసుని శిక్షించి అభ్యుదయ నిశ్శ్రేణిని అధిరోహించు మన్నాడు.

## రాక్షసవధ-వాడుశాప విముక్తుడై పూర్వ చరిత్ర చెప్పుట

అతిథిపూజా మర్యాదలన్ని ముగిసిన తర్వాత దేవలుడు కొండగుహ చెంతకు వెళ్లాడు అక్కడక్కడ కుళ్లిన మాంసం ప్రోవులు దుర్గంధ వాయువులు వీస్తున్నాయి కాకులు గ్రద్దలు రాబందులు శల్యమాంసాన్ని చీల్చుకొని తింటూ ఎగురుతూ వాలుతూ అరుస్తు న్నాయి. ఎక్కడచూచినా కంకాళాలు, తలపుఱ్ఱెలు, ఎముకలగుట్టలు

మొండెములు రాసులుగా పడి ఉన్నాయి. అక్కడక్కడ రొమ్ములు చీల్చి వేయబడి ప్రాణాలు పోక, గిలగిల కొట్టుకొనే మూగజీవుల వేదనలు రోదనలూ హృదయ విదారకంగా ఉన్నాయి. ఈ దృశ్య దృశ్య దర్శనంతో దేవలుడు చలించిపోయి అగ్నిహోత్రమయ్యాడు. వింటికి అల్లెత్రాడు తగిలించి టంకృతి చేస్తూ కొండపాదు క్రక్కదిలేటట్లు పెడబొబ్బ పెట్టాడు. గుహలో బుంగకల్లు త్రాగి తిండికి పూనుకొన్న రక్కసుడు చెవులు దిబ్బడపడి ఎక్కడదీరొద? ఓడు సేసిండు? వాణ్ణికాలితో నల్లిని నలిపినట్టు నలిపేత్తా నంటూ నెత్తురు నిండిన తలపుఱ్ఱెను ఒకచేత్తో, గుండెకాయల గుత్తులు ఇంకొక చేత్తో పట్టుకొని బయటికి వచ్చాడు, ఆ కుండికుడు మిడిగ్రుడ్లు త్రిప్పుతూ ఓరోరి మనిసిపురుగా! నువ్వొచ్చి రొదసేత్తుండావురా? నీకు నూకలు సెల్లినై. ఆకలితో వకనకలాడే పులికి ఆ బెయ్యలా చిక్కావు. నీ గొంతుకాటేసి రకతం గటగటా తాగుతాను. నీ కారిజం కరకరా నములుతాను ముందు కొత్తున్నావే? రా. దెగ్గిరికి రా. ఎయ్యోపుల్లలు పట్టుకొని సోగ్గాడులా ఉండావే? ఉంటావు. కసింత సేపటికి నా కడుపులో ఉండవా మరి? అంటూ సేతుల్లోవి క్రిందబెట్టి వాడు శూలం పట్టుకొని కారు మబ్బులా గర్జిస్తూ కహ కహ నవ్వుతూ ముందుకు వచ్చాడు.

దేవలుడాలోచించి ఆయుధ హీనుణ్ణి చేయాలని మూడు బాణాలు ప్రయోగించి వాడిచేతి శూలాన్ని మూడు ముక్కలు చేశాడు కుండికుడు రెచ్చిపడి ఆఁ సూలాన్ని కొట్టేసూరుడొచ్చాడే? అరే, గుండెలు తీసిన బంటువిరా అయినా, బండరాయి కొండరాయి ఉందరా భడవా! అనిరాయెత్తి విసరాడు. దేవలుడు వజ్రసన్నిభ బాణాలతో దాన్ని ముక్కలు చెక్కలు చేశాడు. వాడు బిత్తరపోయి ఏందీ? బండను కొట్టే గండడివటరా? ఇదిగో, ఈ చెట్టును కాచుకో అని పెళ్లగించి విసరివేశాడు. దేవలుడు దాన్ని అక్కడికక్కడే బాణ

ప్రహారాలతో తూలగొట్టాడు. కుండికుడు కోపంతో అర్రోరి! మాట్టాడ కుండానే మాలావు పని సేత్తుండావే?, గట్టి పిండానివిరానువ్వు? ఒరే మనిసీ! ఇంత సేపూ ఆటి నేమో సేసినవు. ఇక అయ్యొద్దు నా నొత్తున్నాను. ఇదిగో ఒక్క గుద్దుకి సద్దుమణిగి అవులిత్తావు, లేక పోతే, కసింత ఊపిరుంటే దిమ్మ తిరిగి బొమ్మ లాటాడతావు. ఇక సూసో్క. కాసో్క అంటూ కుడిచేయి పిడికిలెత్తి పైకి వచ్చాడు. దేవలుడు నిశిత బాణంతో ఆ చేతిని నరికివేశాడు. వాడు ఉరిమే మబ్బులా బొబ్బరిస్తూ అదిపోతే పోనీ, రెండవచేత్తో నీ పీకె నొక్కే స్తానని మీదకు వచ్చాడు దేవలుడు దాన్నిగూడ నరికి వేశాడు. దానితో రెచ్చిపోయి దానవుడు నోటికోరలతో గొంతు కొరుకుతానని హుంకరించాడు. దేవలుడు అర్ధచంద్రాకార బాణంతో శిరస్సును నరికి వేశాడు. దానితో వజ్రాయుధ ప్రహారంచే రెక్కలు తెగిన కొండలా కుండికుడు ఉసురుడిగి నేలపై కుప్పగూలి పోయాడు

ఆ ప్రదేశం నుండి ఒకదివ్య పురుషుడు రూపొంది అంజలి బద్ధుడై ఓ రాజర్షి చంద్రమా! నేనెవ్వరని చూస్తున్నావా? విన్నవించుకొంటాను. ఇక్ష్వాకు మహారాజు మా పితామహుడు. విశాల రాజోత్తముడు నా జనకుడు. నాపేరు అగ్రధన్వుడు. నేను పితృదత్తమైన రాజ్యాన్ని పాలిస్తున్నాను. ఆ కాలంలో వికటాసురుడనే రాక్షసుడు అడవులలో దారులుకాచి ఋషులను, ప్రజలను పట్టి భక్షిస్తున్నాడు. నేను వానితో యుద్ధం చేసి వధించాను. వాని తమ్ముడు కర్కశాసురుడు నన్నెదుర్కొని యుద్ధం చేయలేక, కపటోపాయంతో నన్ను సాధించాలని వేధించాలని తలచాడు. అదినాకు తెలియదు వాడు మారువేషంతో వచ్చి వినయమూ, భక్తీ ప్రకటించి మా వంటసాలలో పనివాడుగా చేరాడు రోజులు జరిగిపోతున్నాయి. వాడు సమయం కోసం పొంచి ఉన్నట్లున్నది.

ఒకనాడు దుర్వాస మహర్షి నా కడకు అతిథిగా వచ్చాడు. నేను ఋషికి అతిథి మర్యాదలు జరిపి భోజనార్థం పాకశాలకు పంపించాను. రక్కసుడు తన గూఢచారులను నియమించాడేమో మరి. ఈ విషయమంతా ముందుగానే తెలిసికొని నన్నుచావు దెబ్బ కొట్టాలని మనుజ మాంసం వండి దుర్వాస మహర్షికి వడ్డించాడు. ఆ మౌని అచటి అవశేషాలను బట్టి ఆ మాంసాన్ని మనుజ మాంసంగా గుర్తించి కర్కశుని అడిగాడు.వాడు మాయజమాని చెప్పినట్లు ఇక్కడ వంటచేసి వడ్డిస్తుంటాము. అంతేగాని, మేము స్వతంత్రించి, మా సొంత డబ్బుపెట్టి ఏ వస్తువును కొనము. వండము. అయ్యగారి ఆజ్ఞప్రకారం వండి వడ్డించాము. ఇందులో మా తప్పేముందని తప్పుకొని చల్లగా జారుకొన్నాడు దుర్వాసుడు విస్తరి విడిచి లేచి వచ్చి రాజా! నాకు మనుజ మాంసం వడ్డింపజేస్తావా? ఈ దుర్వాస పార ఫలితంగా క్షణంలో ఏ మౌతావో తెలుసా? అని హుంకరించాడు.

నేను గడగడ వడకుతూ స్వామీ! అది నాకు తెలియదు. ఈ దుండగం ఎవరు చేశారో విచారించి తత్‌క్షణమే దోషుల్ని శిక్షిస్తాను. శాంతించండి. అని విన్నవించు కొంటున్నాను. కాని ఆయన నామాట చెవిని బెట్టక కోపోద్దీపితుడై తోక త్రొక్కినత్రాచులా బుసగొడుతూ దుర్మార్గుడా! నక్క వినయాలకు పోతున్నావా? మనుష్యవధ జరిగే చోట మనుష్య మాంసపాకం జరుగుతోంది. మనుష్య మాంసపాకం జరిగేచోట మనుష్య మాంస భక్షణం జరుగ కుంటుందా? నీ అంగీకారం, ఆజ్ఞలేక, పాకశాలలో ఏదైనా జరుగుతుందా? నీవు గోముఖ వ్యాఘ్రానివి. పయోముఖ విషకుంభానివి. మనుష్య మాంసఖాదన రసికుడవు. దుష్టుడవు. నికృష్టుడవు. నిన్ను మన్నించరాదు. ఓరీ రాజాధమా! ఇకనీవు రాక్షసుడవై మాంసాశనంతో అడవులలో పడి జీవించుమని శపించాడు.

మునిపాదాలపై బడి నేను విలపిస్తూ మహాత్మా! ఈ అన్యాయ మేమిటి? పెద్దలు నిజం గుర్తించడానికి ప్రయత్నించవద్దా? నా విన్నపమైనా వినక, నా పూర్వ చరిత్రమైనా తెలిసికొనక, తొందర పడి కోపంతో నన్ను శపిస్తారా? స్వామీ! ఏ పాపం నే నెరుగను. మీ భోజనానికి వంటసాలలో బ్రాహ్మణులనే నియమించాను. వారెందుకు తప్పుకొన్నారో ఏ దుష్టుడో దీని కెందుకు పాల్పడ్డాడో విచారించి శిక్షిస్తానని మొరపెట్టుకొంటున్నా మీరు శాంతింపరైరి. ఇదంతా ఏ దుర్విధిదుర్విపాకమో, కర్మఫలమోమరి. మహర్షి! రాక్షస రూపంలో నే నెలా జీవించేది? శాపావసానమైనా చెప్పండి అని వేడు కొన్నాను. ఆ ఋషి కొంత తడవునకు మెత్తబడి రాజా! తప్పో ఒప్పో శాప మిచ్చాను. అనుభవించవలసిందే. కొంత కాలానికి లోకుల మానరక్షణకై వస్త్ర నిర్మాణార్థం దేవలబ్రహ్మ మయుని కడకు ఈ దారినే వస్తాడు. ఆయనవలన నీకు శాపనివృత్తి కలుగు తుంది అని చెప్పి వెళ్లిపోయాడు.

నాటినుండి నేను కొండ కోనల వెంటబడి మాంస భోజనుడనై ఇట్లు బ్రతుకుతున్నాను. ఇపుడు నీవు వచ్చి నా పాప శరీరం వదిలించావు. పూర్వ శరీరం కదియించావు నీ మేలు జన్మ జన్మలా మరచిపోను. ఎల్లప్పుడు కృతజ్ఞుడనై ఉంటాను అని సెలవు తీసి కొని అగ్రధన్వుడు స్వస్థానానికి వెళ్లాడు.

నేను ముక్కు సూటిగా చూస్తూ ముందుకు నడుస్తున్నాను. నా కేమి లెమ్మని ఎంతటి వాడైనా ప్రమత్తుడై ఉండరాదు. ప్రక్క పొదలో పులి వంటివారు పొంచి ఉండవచ్చు. పంజావిప్పి పైనబడ వచ్చు. లోకం ఆ కొన్నపులి. ఏవిపరీతవైమనస్య శక్తియైనా ప్రత్య క్షంగా పరోక్షంగా అపకారం చేయ పాల్పడవచ్చు. అగ్రధన్వుడు పరోపకార పరాయణుడు. ఎంతో మంచివాడు. అయినా, చేయని

నేరానికి శిక్ష అనుభవించాడు అహా! విధివైపరీత్యము! జీవితమెంత కష్టతరమైనది?"

ఇట్లు తలపోస్తూ దేవలుడు నిట్టూర్చాడు ఇప్పటికైన అగ్రధన్వునికి విముక్తి కలిగినందుకు తృప్తిపడ్డాడు. తనరాకవలన అంపరకు మేలే జరుగుతున్నదని సంతోషపడుతూ తిరిగి వామదేవ ఋష్యాశ్రమానికి వచ్చి జరిగినదంతా చెప్పి అందరికి ఆనందం కల్గించాడు.

## సప్తమాధ్యాయం-నేత పరికరాల నిర్మాణం

తరువాత దేవలబ్రహ్మ మేరుగిరికి పోయి మయబ్రహ్మను కలసికొని తన్నుగూర్చి తెలుపుకొన్నాడు. మయుడు దేవలుని కౌగిలించుకొని సాక్షాత్ పరమశివుడే వచ్చినట్లు పరమానందాన్ని ప్రకటించాడు. అతడు దేవలునికి స్వాగతం పలుకుతూ తన చిత్రశిల్పదారుశాలకు తీసికొని పోయి అచట ఆసనోపవిష్టుని కావించి అర్ఘ్యపాద్య పూజాది విధులు నిర్వర్తించి యోగక్షేమాలు విచారించాడు. వారిద్దరికి స్నేహ పూర్వక సంభాషణ జరిగింది. దేవలుడు నేత పరికరాల కోసం వచ్చానన్నాడు మయుడు వారం రోజులలోనే చేసి ఇస్తాను. అందాక నీ విక్కడ మా కతిథివై ఉండాలి. నేతకు ఏయే పరికరాలు కావాలో వాటి బొమ్మలు వేసి వెడల్పూ పొడవూ మందం కొలతలూ నిరూపించి ఇస్తే, శుద్ధంగా చేసి ఇస్తాను అన్నాడు.

దేవలుడు రాతి పలకలమీద గైరికాదిధాతు ద్రవ్యాలతో వస్తువుల రూపరేఖలు చిత్రించి వాటి పొడవు వెడల్పు మందాలకు కొలతలు అంగుళాలలో అడుగులలో గజాలలో నిరూపించి ఇచ్చాడు మయుడు ఆ చిత్ర లేఖన ఫలకాలను బట్టి దేవలుని పర్యవేక్షణలో

నవరత్నాలు బంగారం వెండి రాగి ఇత్తడి ఇనుము కొయ్య మున్నగు ముడి సరుకులతో నగదోనె. పడుగుదోనె, మర మగ్గము, పలక, కమాను పలకలు, తిరుగుడు చట్రము, దండె, గుబ్బలు, నాడులు, చేడుకఱ్ఱలు, చేడుముండ్లు, అడుగఱ్ఱలు, పావుకోళ్లు, అచ్చుకఱ్ఱలు, ఇచ్చెలరాట్నము, పచ్చబండ్లు, కండెలరాట్నము, డబ్బాలు, మరాసు ఊడితలు, దాయికఱ్ఱలు, బద్ధలు, లేకలు, కుంచెలు, అలుకు కుంచెలు, బహువిధ యంత్ర పరికరాలు వగైరా వగైరా అనేక వయన పరికరాలు నిర్మించియిచ్చాడు. అయన ఇంకను దేవలుని చిత్రలేఖనానైపుణ్యాన్ని ప్రశంసించి మైత్రీ బంధం కోసం చివరికి బంగారు పట్టాతో ఎనిమిది గంటలతో వజ్రమయధారతో ప్రకాశించే మహాశక్త్యాయుధాన్ని చేసి ఆహవదోహలుడైన దేవలునికి బహూకరించాడు. అందుకై దేవలుడు గూడ అమూల్యరత్నాభరణాలు కానుక లిచ్చాడు.

## దేవలుడు శ్రీ చౌడేశ్వరీదేవి అనుమతితో నేత ప్రారంభించుట

దేవలుడు మయునివద్ద సెలవు తీసికొని ఆ సామగ్రితో నిజ నగరానికి వచ్చాడు. ఒక సువిశాల భవనంలో వాటిని అనుసంధానించి చూచాడు. అన్ని సరిపడినట్లు, చక్కగా కుదిరినట్లు తెలిసికొన్నాడు తగువారి సాయంతో నూలు పడుగుపేకలమర్చి అచ్చుల కెక్కించి హల్లులు పట్టి మరమగ్గాలకు జతపరచాడు. బంగారు పళ్లెరంలో బియ్యం వేదికగా అమర్చి జలపూర్ణ కలశంపై తమల పాకులతో టెంకాయ పెట్టాడు. తమలపాకుపై పసుపుముద్ద బింబం చేర్చాడు. కుంకుమ తిలకం దిద్దాడు. జ్యోతి వెలిగించాడు. ఆచమించి గాయత్రీ మంత్ర పూర్వకంగా సంకల్పం చెప్పుకొన్నాడు.

సద్యోజాత ప్రవరాన్వితః పరమశివసగోత్రః ఆశ్వలాయన సూత్రః ఋక్ శాఖాధ్యాయీ దేవలోఽహం భో అభివాదయే ఇత్యాదికం పఠించి పరదేవత. బ్రహ్మవిద్యా స్వరూపిణి. సుప్రసన్నాత్మకమైన శ్రీ చూడాంబను ఆహ్వానించి బింబం పైకి ఆవాహన చేశాడు. తాను మనోబుద్ధి చిత్తాహంకారాలను గూడ వదలి, ఆత్మ శిఖరాగ్రాన నిలిచి ఏకాగ్రతతో ధ్యాన ప్రార్ధనలు జరిపాడు. మునుపటివలె ఓంకార శబ్దం కలిగింది. జ్యోతి వెలిగింది. శ్రీ చౌడేశ్వరీదేవి దివ్య మంగళ విగ్రహం కందోయికి విందుగా తోచింది. అంబ మందస్మిత సుందర వదనార విందంతో దేవలుని తల నిమురుతూ బిడ్డా! ఇప్పటి నీ అవసరమెట్టిది? అన్నది.

దేవలుడు కేలుమోడ్చి అమ్మా! నీవు చెప్పిన చొప్పున ఇవన్నీ అమర్చు కొన్నాను. నాడె ముల్లుకు కండె తొడిగి పూసలోనుండి పోగుతీశాను. శివాద్వైత మతప్రాతిపదికగా ఇరువదియేడు తత్త్వాలకు ఇరువదియేడు పోగుల సూత్రరచన చేశాను. నీవు సూత్రాత్మవు. గాయత్రీ మంత్రాధిదేవతవు నీ ఆజ్ఞతో నీ ఆశీర్వాదంతో ఈ వయనో ద్యోగం ప్రారంభించాలని ఇపుడు నిన్నాహ్వానించాను. లోకాలోక జీవజడ సవితృమూర్తీ! ఇంకొక్క విషయము వలువలు నేసేవాణ్ణి నేనొక్కణ్ణి మాత్రమే వలువలందుకోవలసినవారు త్రైలోక్యసంవాసు లైన కోట్లాది మహాజనులున్నారు. ఒక్కొక్క పుట్టంనేసిఒక్కొక్కరికిస్తూ పోతే ఏండ్లు పూండ్లు పట్టవా? అదెప్పటికి పూర్తి అవుతుందో గదా! అమ్మా! అలాకాక, నేను నేసిన వస్త్రాలు తరుగకుంటే అంటే, అక్ష యంగా ఉంటే ఏక కాలంలోనే అన్ని లోకాలవారికి ఈయగలుగు తాను. కావున, నావస్త్రోత్పత్తికి అక్షయత్వం కల్గించుతల్లీ! అన్నాడు.

దేవి వాని ఆలోచనా సరళికి మెచ్చుకొని నాయనా! నీ సంకల్ప మెట్లో అట్లే జరుగుతుంది. ఒక్క విషయం. రకమునకు

ఒక్కొక్క వస్త్రం నీవు నేయాలి. ఇదిగో నాముంజేతి కంకణం తీసి కొని ధరించుమని ఇచ్చి ఈ కంకణమున్న చేతితో ఏ వస్త్రాన్ని పట్టు కొనినా అది అక్షయమౌతుంది. ఎన్నివలువలు తీసినా ఇంకా ఒక్కటి మిగిలే ఉంటుంది. నీ సంకల్ప ప్రకారం ఏక కాలంలోనే సర్వ లోకాల వారికి వస్త్రాలీయగల్గుతావు. ఇది శుభలగ్నం. ధ్రువలగ్నం. నూలు కండె నాడెను మగ్గంలో సంధానించి నేత ప్రారంభించు మన్నది.

అమ్మకు పూలదోసిలితో పాదాభివందనం చేసి దేవలుడు నారికేళ ఫలాదులు పచ్చకప్రపు వీడ్యమిచ్చి మగ్గం మరకదిపి నేయసాగాడు. వస్త్రం చక్కగా వచ్చింది. చౌడేశ్వరీదేవి దాన్ని చేతితో స్పృశించిచూచి మెచ్చుకొన్నది. ఇదే పద్ధతితో రకరకాల వస్త్రాలు నేయవలసినదని దీవిస్తూ అభయముద్రా హస్తంతో ఆమె అంతర్ధాన మైంది.

## అష్టమాధ్యాయం

దేవలుడు మగ్గాలకు అనేక యంత్ర పరికరాలు అను సంధించి అంచు పేటులు జరీ బుటాలు పెట్టి నేశాడు. పసిడిపోగులు పెట్టి పంచవర్ణాల పట్టు పుట్టాలు నేశాడు. చీనాంబరాలు రత్నాంబ రాలు కనకాంబరాలు నేశాడు. రకరకాల పూదీవలు సీతాకోకచిలుకలు ఆకులు పిందెలు కాయలు చిలుకలు హంసలు నెమళ్లు నక్షత్రాలు నందులు శివలింగాలు రూపకల్పన చేసి వస్త్రవైవిధ్యమెంతో సృష్టించాడు. అన్ని రంగుల్లో ఒకే రంగు వస్త్రాలు నేశాడు. చీరెలు దోవతులు ఉత్తరీయాలు తుండు గుడ్డలు చొక్కా గుడ్డలు రవికె గుడ్డలు దుప్పట్లు డేరా గుడ్డలు నేశాడు. ఒకసారి అందరికి పంచ డానికి అనువైన వస్త్ర సృష్టి జరిగింది, ఇక అఖిల లోకవాసుల వాసోదైన్యం తొలగించాలి.

వస్త్రాలు ముందెవరికీయాలి? అనే ప్రశ్న ఎదురైంది వస్త్రో త్పత్తికి ఆధారం తంతువులు. తంతువులిచ్చినవాడు నారాయణుడు. ఆత్మరక్షణకు చక్రమిచ్చినవాడు నారాయణుడు. అంబకు పుంస్త్వ రూపమైనవాడు నారాయణుడే. కావున, ఆయనకే ముందీయాలని నిశ్చయించుకొన్నాడు

## వస్త్ర ప్రదానం-ముందు వైకుంఠ వాసులకిచ్చుట

అతడు శ్వేతద్వీపంలోని వైకుంఠానికి ప్రయాణమయ్యాడు. దేవలుడు వస్త్రాలతో వస్తున్నాడని తెలిసికొని వైకుంఠ వాసులు రావబాటలలో చలువ పందిళ్లువేసి స్వాగత తోరణాలు కట్టారు. మేళతాళాలతో ఎదురుపోయి సముచిత స్వాగత సత్కారాలతో తోడ్కొని వచ్చారు. విష్ణువు వాత్సల్యంతో ఎంతో గౌరవించాడు. దేవలుడు శ్రీ చౌడేశ్వరీ దేవి కటాక్షించిన రతనాల పసిడి కడెము తొడుగుకొన్న చేతితో జరీపేటంచు జిలుగుపట్టు పీతాంబరాలు, అట్టివే ఆకుపచ్చ ఉత్తరీ యాలు మాధవునికిచ్చాడు. బంగరు పోగుల పేటంచు జరీబుటా తెలిపట్టు చీరెలు, రవికె ముక్కలు లక్ష్మీదేవికిచ్చాడు. అట్టివేతొవరు చీరెలు, రవికె ముక్కలు భూదేవికిచ్చాడు. గరుత్మంతునికి, మన్మథు నికి సేనాపతి విష్వక్సేనునికి, ద్వారపాలకులైన జయ విజయులకు తొవరు దోవతులు తెలికండువాలు ఇచ్చాడు. వారి భార్యలకు సంతా నానికిచ్చాడు. విష్ణుసేవకు వచ్చిన సప్తర్షులకు, భక్తులకు, వారి భార్యలకు తెలిపట్టు వస్త్రాలు ఉత్తరీయాలిచ్చాడు. అచటికి వచ్చిన ఎల్లరకు నచ్చిన చిత్రాంబరాలిచ్చాడు. ఆ ద్వీపవాసులందరికిచ్చాడు. వారిచే బహుమతులు పొందాడు.

అతడట నుండి సత్యలోకం వచ్చాడు. బ్రహ్మదేవుడు చతుర్వ దనాలతో స్వాగతం పలికాడు. దేవలుడు కంకణ హస్తంతో తీసి

ఆకుపచ్చ కమ్ములు కలిగిన బంగారు జరీ పేటంచు లేదొవరు పట్టు పుట్టాలు, కండువాలు బ్రహ్మకిచ్చాడు, బంగారు ముద్ద జరీ పేటంచు పువ్వుల బుటా తెలిపట్టు చీరెలు, రవికె గుడ్డలు సరస్వతికిచ్చాడు. పసుపు పట్టు చీరెలు, రవికెలు సావిత్రికిచ్చాడు. తొవరు చీరెలు రవికెలు గాయత్రికిచ్చాడు. ప్రజాపతులకు తెలిపట్టు దోవతులు, కండువాలిచ్చాడు. సనకసనందనాది బ్రహ్మర్షులకు, నారదాది దేవర్షులకు, పట్టాంశుకాలిచ్చాడు. అచటనున్న వారికెల్లరకు కోరిన చిత్రాంబరాలిచ్చాడు. ఆలోక వాసులకందరికిచ్చాడు దేవలుడు తిరిగి బ్రహ్మను సమీపించిమ్రొక్కి పరమేష్ఠీ! శ్రీహరి ఇచ్చిన తంతువులతో చాలవరకు నానావిధ వస్త్రాలు సృష్టించాను. నేను దైవబలంతో సర్వమూ నిర్వహించాను. నిర్వహిస్తున్నాను. నా తర్వాత నా వంశీయులకు నా కున్న శక్తులుండవు గనుక, నా వలె వారు వస్త్రోత్పత్తి చేయలేరు. వారికి నూలు కావాలి. నూలు కావాలంటే పత్తి, పట్టు వగైరా ముడి సరుకుండాలి. నీవు సృష్టికర్తవు గనుక, నూలునకు మూలమైన పత్తి, పట్టు మొదలైనవి నీవు సృష్టిస్తావా? నన్ను సృష్టించమంటావా? అని అడిగాడు.

బ్రహ్మదేవుడాలోచించి దేవల మను బ్రహ్మ! ఆ గౌరవం నాకే దక్కనిమ్ము తంతువులతో పాటు మాని, అభిమాని అనే బీజ మూర్తులు పూర్వమేర్పడ్డాయి. వాటిని భూలోకానికి పంపి పత్తిచెట్లుగా పట్టు పురుగులుగా రూపొందిస్తాను. అందువలన నీ వంశం భావి తరాల వారికి నూలు లోపముండదన్నాడు.

దేవలుడచటనుండి స్వర్గానికి వచ్చి దేవేంద్రునికి ఎరుపు పంచెలు, శచీదేవికి పసుపు వన్నె వలువలు, జయంతీ జయంతులకు తెల్లని వస్త్రాలిచ్చాడు. అచటనున్న దేవతా గణాలకు అప్సరసలకు కోరిన వస్త్రాలిచ్చాడు. ఇంకను మేరు పర్వత ప్రాంతాలకు పోయి

ద్యాధరులకు గరుడులకు గంధర్వులకు సిద్ధులకు సాధ్యులకు
న్నరులకు కింపురుషులకు చారణులకు తదితర సమస్త దేవతా
ాతుల వారికి వాంఛిత రత్నాంశుకాలిచ్చాడు. ఆగిరి సానువుల
ోని విశ్వకర్మకు, మయబ్రహ్మాదులకు స్వర్ణాంబరా లిచ్చాడు.
రువాత ఆగ్నేయ మూలాధిపతి అగ్నిదేవునికి నీలి వలువలు,
లోక వాసులకు కోరిన విచ్చాడు. దక్షిణ దిశాధినాథుడైన యము
కి నలుపు వస్త్రాలు, ఆలోక వాసులకు కోరినవిచ్చాడు. నిర్‌ృతి
వుని కడకేగి పసుపు వన్నె వస్త్రాలిచ్చాడు. వరుణ దేవునికి తెల్లని
స్త్రాలిచ్చాడు. కుబేరునికి చిత్రాంబరాలిచ్చాడు. ఈశానునకు
లిపట్టు వస్త్రాలిచ్చాడు. అయా దేవలోక వాసులకు కోరిన వస్త్రా
ిచ్చాడు. దేవలుడీవిధంగా దేవాంగాచ్ఛాదనతోమానరక్షణకల్పించుట
ేత నాటి నుండి దేవాంగ నామంతో ప్రసిద్ధుడయ్యాడు. ఆ పేరే
ఆయన జాతికి సంక్రమించింది అది దేవాంగ జాతి.

## నవమాధ్యాయం

దేవలుడు భూలోకానికి వచ్చాడు. జంబూ ద్వీపాధిపతియగు
పృథు మహారాజునకు ప్రజలకు పెక్కు వస్త్రాలిచ్చాడు. అటనుండి
ప్లక్షద్వీపానికి బోయి శూరసేన మహారాజునకు వస్త్రాలిచ్చాడు.
అందుండి కుశద్వీపానికి బోయి కుశిమహారాజునకు అభీష్టాంబరా
లిచ్చాడు. అచటనుండి క్రౌంచద్వీపానికి బోయి హేమాక్ష మహా
రాజునకు నానా వర్ణాంశుకాలిచ్చాడు. అక్కడనుండి శాకద్వీపానికి
బోయి అభిరామమహీపతికి రత్నాంశుకాలిచ్చాడు. తరువాత శాల్మలీ
ద్వీపానికిబోయి శాలిహోత్ర రాజేంద్రునకు దివ్యాంబరాలిచ్చాడుఆపై
పుష్కల ద్వీపానికిబోయి భానుమంత భూజానికి జిలుగు పొంబట్టు
పుట్టా లిచ్చాడు, అందందుగల సప్తకుల పర్వత వాసులకు వస్త్రము
లిచ్చాడు.

మీదట పాతాళలోకానికి బోయి నాగరాజైన వాసుకికి పలు రంగుల వలువలిచ్చాడు. ఆదిశేషునికిచిత్రసేనునికి తక్షకునికిఐరావతునికి సౌరభేయునికి తదితరులకు కోరినవస్త్రాలిచ్చాడు. ఆదిశేషుడు దేవలుని ధార్మిక బుద్ధికి, సత్ ప్రవర్తనకు మెచ్చి తన కూతురగు చంద్రరేఖను బహూకరించాడు. దేవలుడు స్వీకరించాడు ఆ నాగ జాతి వారినెల్ల సంతోషపరచి దేవలుడు మరల భూలోకానికి వచ్చాడు.

భరత ఖండంలోని త్రివిష్టప నేపాల కాశ్మీర సింధు పాంచాల యుగంధర బర్బర కురు కరూశ నిషాద విదర్భ దుండికేర జుల్లిక మత్స్యకేకయ మాళవ చైత్యత్రిగర్త ఘూర్జర లాట మరాట కొంకణ ద్రేంకణ సాల్వ అంగ వంగ కళింగ ఆంధ్ర కర్ణాటక మాద్రకద్రవిడ చోళ మళయాళాదిభప్పన్న దేశాలకు బోయి అచటి రాజులకు ప్రజలకు వస్త్రాలిచ్చాడు.

అతడు తన సగర రాజ్యానికి వచ్చి మంత్రుల సహాయంతో తన దేశ ప్రజా సమూహానికి వలసిన వస్త్రాలిచ్చాడు, అప్పుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర జాతులవారు దేవాంగ మహారాజును బహు విధాలుగా కీర్తించారు.

చూచారా? దేవలుడు తనచేతిలో వస్త్రాలేయని ముందుగా తన రాజ్యంలోని వారికీయలేదు. ఎంతో మంది కిచ్చిన తర్వాతనే ఇచ్చాడు. ముందు బయటివారికిచ్చి వెనుక ఇంటివారికిచ్చాడు. పరోపకారంలోని పరమార్థం ప్రాజ్ఞులకే తెలుస్తుంది. ముందు దేవ జాతికిచ్చాడు. మధ్యలో మానవ జాతికిచ్చాడు. చివరికి కైలాసం వెళ్లి పార్వతీ పరమేశ్వరుల కీయబోతున్నాడు. తన తల్లి దండ్రులకే అడుగు బొడుగు లీయబోతున్నాడు. ఆహా! దేవలు డెంత నిస్స్వార్థ

బుద్ధి గలవాడు! అయినా, దేవలోక వాసులకు, కైలాసవాసులకు మధ్యలో మానవ జాతిని బెట్టి తన సత్కార్యాచరణకు చక్కని ముడి వేయబోతున్నాడు. మానవుడు మహనీయుడు కావాలని, ఇటు దైవాంశ, అటు శివాంశ అందుకొని పరిపూర్ణ మానవుడవతరించాలని అతని ఆ కాంక్ష కాబోలు. ఏమైననూ, ఉత్తముల ఆలోచనలు, కార్యాచరణ పద్ధతులు ఉత్తమంగా ఉంటాయి గదా!

## దేవలుడు రజతగిరికి వచ్చి వస్త్రాలిచ్చుట

దేవలుడు చివరిగా రజతగిరికి వచ్చాడు. దాని అలౌకిక దివ్య సౌందర్యానికి స్నిగ్ధముగ్ధ హృదయుడయ్యాడు రెండు కన్నులే ఉన్నాయే. ఇంద్రునికి వలె వెయ్యి కన్నులుంటే ఎంత బాగుండేది! ఇంకా ఒళ్లంతా కళ్లుంటే పక్షిలా ఎగిరి పోయి కొండను కొంత వరకైనా చూచి ఆనందించే వాణ్ణిగదా! అని నిట్టూర్చాడు. అనాడు తంతు సంతాన సంపాదనా కార్యవ్యగ్రుడై గిరి సౌందర్యం చూడ లేక పోయాడు. ఈనాడు తొందరలేదు గనుక, కొంతకు కొంత చూచే అవకాశమున్నదని తృప్తి పొందాడు

అది వెండి కొండే కావచ్చు. స్వర్ణమయ శిఖరాలతో నవరత్న మయశిఖరాలతో అభ్రభేదియై ఉన్నది. నిజకాంతులతో అంత రాళంలో వింత ఇంద్రధనుస్సుల్ని సృష్టిస్తుంది. ఉన్నత శిఖరాగ్ర మందలి గంగా ప్రహదజలం జారుతూ శత సహస్రఝరీధారా వాహి నులై ఉరవళ్ల పరవళ్లతో నిమ్నోన్నత స్థలాలకు దూకుతూ గలగలా లోయల్లోనికి ప్రవహిస్తోన్నవి. అచ్ఛధవళ శిఖరాలు నిశ్చలధ్యాన శివమూర్తులుగా, మస్తకోపరి న్యస్త జలధారలు గంగా మాతలుగా ఈ కైలాస శైలం అంతా శివమయంగా తోస్తున్నది.

ఎటుచూచినా గంగా జటా జూటుడే. చంద్రరేఖావతంసుడే. విభూతి త్రిపుండ్ర ఫాలభాగుడే. దరహాస భాసుర బింబాధరుడే రుద్రాక్షమాలాలంకృతుడే నాగాభరణుడే. నాట్యాభినయ నీలకంఠుడే. అచ్ఛధవళాంగుడే. వ్యాఘ్ర చర్మాంబర ధారుడే, స్వర్ణమంగళా విభాసితుడే. వేద వేదాంత విజ్ఞాన ఫల స్వరూపుడే. ఆనంద నిలయుడే. అచల పరిపూర్ణ భావుడే. అహా! ఇది ప్రత్యక్ష శివసాక్షాత్కారంగా ఉన్నది. అందువల్లనే దేవలుడు కృత ప్రణా ముడై గిరిపాద భూమిని కళ్లకద్దుకొని శైలాధి రోహణం చేశాడు.

ఈ కైలాసగిరి భౌతిక సౌందర్య కళాక్షేత్రమేకాక, ఆధ్యాత్మిక దివ్య సౌందర్య కళాక్షేత్రం గూడ. ఇది ఒక పరమపద రూపసౌధరాజం. అనేక సోపానశ్రేణులతో అత్యంత రమణీయమై అడుగడుగున అధి రోహణకు ఆసక్తికల్గిస్తోన్నది. వివిధ ధ్యాన యోగ భూమికలలో నడ యాడే సాధకులు ఆయాసోపానాలలో విహరిస్తూంటారు. "చేసికొన్న వారికి చేసికొన్నంతమహదేవ" అంటారు. కర్మ భక్తి జ్ఞానకుండలినీ ధ్యానాదిప్రముఖయోగాలలో జ్ఞానయోగం అంతర్వాహినిగా ఉన్న ప్పుడే సత్ఫలితాలుకలుగుతాయి జ్ఞానయోగం సత్యాన్వేషణకు కరదీ పికవంటిది. అదిదానిని సుగమం చేస్తుంది. సూటిగా లక్ష్యమైన గమ్యానికి చేరుస్తుంది. "జ్ఞానాదేవతు కైవల్యమ్" జ్ఞానం వల్లనే మోక్షమని అన్నారు గదా!

కర్మ భక్తిజ్ఞాన యోగత్రయంలో పరిపుష్టి పొందిన దేవలుడు ఉన్నత సోపానాలను అధిరోహిస్తూ పైపైకిపోతున్నాడు. ఈపరిపూర్ణ సాధకునికి యోగభూమికలన్నీ కొట్టిన పిండియే. ఆలాపించిన మధురగాన రాగచ్ఛాయలే. పూర్వ జన్మలో నడచిన దారులే. ఒకప్పుడు సాయుజ్య మోక్షపదవీ బ్రహ్మానంద ప్రాపితుడు గదా!

కావుననే యిపుడు ప్రయాణం హాయిగా సాగుతోన్నది. రోదసీ కుహరంలోనికి చొచ్చుకొని పోయిన రజతగిరి ధవళ శిఖరాగ్ర భాగాలు నేత్రేంద్రియ విషయాలై ఆనందానుభూతి కల్గిస్తున్నాయి. సహస్ర దళకమల కైరవ శోభిత సరోవర జల తరంగ డోలలపై ఊగే జలపక్షుల కలకల ధ్వనులు, మధుప ఝుంకారాలు, నటన్మయూర క్రేంకారాలు, ఫల వృక్ష శాఖాలంకృత శుక పిక శారికా కలకూజితాలు శ్రోత్రేంద్రియ విషయాలై ఆనందానుభూతి కల్గిస్తున్నాయి. జ్యోతిష్మతీ సంజీవనీ సోమలతలు శివపారిజాతాలు శివ మందారాలు శివసంతానాలు. శివకల్పకాలు, శివహరిచందనాలు నందివర్ధన నాగార్జునాలు తమ పుష్ప సుగంధాలతో ఘ్రాణేంద్రియ విషయాలై ఆనందానుభూతి కల్గిస్తున్నాయి. ఎలమావులు ఏలకులు నిమ్మలు దానిమ్మలు ద్రాక్షలు పనసలు నారింజ నారికేడములు తమ మధుర ఫలరసాలతో రసనేంద్రియ విషయాలై ఆనందానుభూతి కల్గిస్తున్నాయి. గలగల పారే సెలయేటి నీటి తుంపరలను మోసికొంటూ పూల పుప్పొడులను పులుముకొంటూ నెమళ్ల కుంచెలను విప్పుతూ వీచే శీతల సుగంధ మంద పవనాలు త్వగింద్రియ విషయాలై ఆనందానుభూతి కల్గిస్తున్నాయి. ఈ విధంగా కల్గిన పంచజ్ఞానేంద్రియ విషయికమైన ఆనందానుభూతి ఆత్మాభిముఖమైంది. ఆత్మ సర్వవ్యాపకమైనది ఆ ఆత్మ బాహిర స్వరూపమే వెండి కొండ. సాధకుని సాధనా ఫలమైన తెలి వెలుగు ముద్ద. ఆ జ్యోతిశ్శిఖరాగ్ర భాగ విద్యమాన మోక్షఫల స్వరూపమే పరమ శివుడు.

దేవలుడు మూలాధారచక్రమార్గాన ప్రయాణించి చుట్టచుట్టుకొన్న కుండలిని మేల్కొల్పి ఊర్ధ్వాభిగమనం కల్గించి త్రికూట స్థానమందు జ్యోతిర్దర్శనం పొందాడు. జ్యోతి స్స్నానం చేశాడు. రత్నకాంతి పుంజపింజరిత ప్రాసాదాంతర సువర్ణ సహస్రార

కమల కర్ణికా రంగస్థల నటనాభిరాములైన పార్వతీ పరమేశ్వరులను సందర్శించాడు. భక్తి నిబద్ధాంజలి బంధురుడై ప్రదక్షిణ మొనరించి పాదాభివందనం చేశాడు. అజగజ్జననీ జనకులు, బ్రహ్మానంద ఫల స్వరూపులు వాత్సల్యంతో దేవలుని దృఢాలింగనం చేసికొని ప్రక్కనే కూర్చుండ బెట్టుకొన్నారు.

శివుడు చిరునగవుతో దేవలా! నీవు నేసిన వస్త్రాలు లోకులకే ఇచ్చావు గాని, తల్లిదండ్రులమైన మా కీయలేదేమయ్యా? అన్నాడు. దేవలుడు ఇప్పుడీయటానికే వచ్చాను నాన్నగారూ! అన్నాడు. పార్వతి నవ్వుతూ అనుగు బిడ్డడు అందరి కిచ్చి అట్టడుగు వస్త్రా లీయడానికి వచ్చాడు అన్నది. దేవలుడు అమ్మా! నాన్నగారికి వంత పాడతా వెందుకు? నీ విచ్చిన రతనాల రవ్వల బంగారు కడెము చేతికున్నదిగదమ్మా! అందుకొన్న వస్త్రం అక్షయమౌతున్నది గదమ్మా! ఇందులో అడుగు బొడుగు లేమున్నాయి? అన్నీపై వస్త్రాలే. కన్నాకులే. మేల్బంతులే. చూడండి. మౌలిక వస్త్రం నుండి వస్త్రం వస్తోంది. అని చిత్రవర్ణ పట్టాంశుకాలు తీసి శివపార్వతులకిచ్చాడు. గణపతికి వీరభద్రునికి, కుమారస్వామికి భైరవునికి దివ్యదుకూలా లిచ్చాడు. స్త్రీలకిచ్చాడు. నందీశ్వర భృంగీశ్వరాది ప్రమథ నాయకుల కిచ్చాడు. ఏకాదశరుద్రుల కిచ్చాడు. భక్తులకు మౌనధ్యాన రక్తులకు ముక్తులకు సాయుజ్యాసక్తులకిచ్చాడు. ద్వారపాలకులైన చండ ప్రచండుల కిచ్చాడు. మార్కండేయ మౌద్గల్యాది మహర్షుల కిచ్చాడు.

దేవలుడు పార్వతీదేవికి ప్రణమిల్లి తల్లీ! క్రూరరాక్షసుల బారినుండి నన్ను రక్షించిన దివ్యరూపంతో వచ్చి, ఈ బాలారుణ రత్నాంశుకాలనుస్వీకరించుమన్నాడు. పార్వతిపరమేశ్వరునివైపు సాభి ప్రాయంగా చూచింది. శివుడు స్మితవదనంతో కొడుకు పిలుస్తున్నాడు.

వెళ్లి తీసికొమ్మన్నాడు. తొలకరి మబ్బులోనుండి మెరపు తీవలా పార్వతీదేవినుండి శ్రీ చౌడేశ్వరీదేవి రూపం అభయ ముద్రతోవచ్చి అవి స్వీకరించి బిడ్డా! నీ వెన్నుకొన్న ఈ చౌడేశ్వరీదేవి రూపం ఐహికాముష్మిక ఫలప్రదాయకమైనది. ఇట్లే నన్ను మరువక ధ్యానిస్తున్నంతకాలం నీకును, నీవారికిని రక్షాకవచంగా ఉంటాను. నేను గాయత్రీ మూర్తినై నీకు ఉపాస్యదేవతనై ఉంటాను. స్వామి వారి అనుమతితో ఇప్పుడే గాయత్రీ సూత్రం రచించు. తరువాత మంగళ సూత్ర రచనకు నేననుమతిస్తాను. అనిచెప్పి దేవి పార్వతీ దేవి శరీరంలో కలసి పోయింది.

## గాయత్రీ సూత్రసృష్టికర్త దేవలుడు–శ్రావణ పూర్ణిమ

దేవలుడు శివాభిముఖుడై తండ్రీ! అమ్మ చెప్పింది విన్నావు గదా! మిగిలిన తంతువులను యజ్ఞోపవీత నిర్మాణానికి ఉపయోగిస్తాను. సద్గురుమూర్తివై ప్రబోధించి ఆజ్ఞాపించుమన్నాడు శివుడు నాయనా! వేదమాతయైన గాయత్రిని ప్రణవంతో సమంచెయ్యి. అకార ఉకార మకారాలు కలసి ఓంకారమౌతుంది. అదే సత్త్వ రజస్తమో గుణాల సంపుటి, హరిహర హిరణ్యగర్భులకు ఏకైక ప్రతీక. అది సర్వసృష్టికి జనన స్థానం. పోషకస్థానం. లయస్థానం. మోక్షస్థానంగూడ. అదిమూడుమూళ్లు తొమ్మిది ($3 \times 3 = 9$) తొమ్మిది మూళ్లు ఇరువది యేడు ($9 \times 3 = 27$) తత్త్వాలకు సూచకంగా ఉన్నది. అట్లే 27 పోగులతో త్రిపాదాత్మకమై పరదైవత పరిజ్ఞాన ప్రబోధకమై శివాద్వైత మతాన్ని ప్రతి పాదిస్తుంది ఈ పద్ధతిలో బ్రహ్మ సూత్రాన్ని నిర్మించు.

బ్రహ్మచారికి ఒక సూత్రం, వివాహవేళ రెండుసూత్రాలు, ఉత్తరీయంగా మూడవ సూత్రం నియతంగా ఉండాలి. యజ్ఞోపవీత

ధారణం మంత్ర సహితమైనపుడే ఫలవంతమౌతుంది ఈ బ్రహ్మ సూత్ర ధారణవలన సత్త్వగుణం కలుగుతుంది. ఆయుస్సు, బలం, తేజస్సు వృద్ధి అవుతుంది. ఆత్మ జ్ఞానానుభవం సిద్ధిస్తుంది. వేద విహిత కర్మ నిర్వహణాధికారం ప్రాప్తిస్తుంది గాయత్రి నీకుతెలిసినా నేను గురురూపంగా గుర్తు చేస్తున్నాను. దగ్గరకు వచ్చి విను.

"ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యమ్ ఓం తత్ సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి. ధియో యోనః ప్రచోదయాత్. ఓ మాపోజ్యోతీ రసోఽ మృతం బ్రహ్మ"— అని దక్షిణకర్ణంలో పలికి పలికించి తన్మంత్ర జప విధాన రహస్యంగూడ తెలియపరచాడు. ఈ గాయత్రీ మంత్ర మెంత మహిమాన్వితమో శివ పంచాక్షరీ మంత్రం గూడ అంత మహిమాన్వితమే. ఈ రెంటిలో ఒక్కటి ఎక్కువలేదు; ఇంకొక్కటి తక్కువలేదు. రెండును సమమైనవే. ఈ రెంటితో సరితూగగలది గౌరీ పంచాక్షరీ మంత్రం సుమా! అని నొక్కి వక్కాణించాడు అయినా గాయత్రీ మంత్రానికి ప్రత్యేకత లేక పోలేదు. గాయత్రికి పంచాక్షరి తోడైతే బంగారానికి పరిమళ మబ్బినట్లే. గాయత్రీ మంత్ర శబ్ద స్వరూపం మీ అమ్మ అయితే, భావార్థం నేనై ఉన్నాను. శబ్దార్థాలవలె పార్వతీ పరమేశ్వరులు కలసి ఉన్నారు· ఆ యిద్దరి ఏకరూపం అర్ధనారీశ్వరుడు. ఇది నీకు తెలిసిన విషయమే గదా! వత్సా, దేవలా! ఇక సూత్ర రచన కానిమ్మన్నాడు.

దేవలుడు శివోపదేశాన్ని శిరసావహించి పోగులు పోసి గాయత్రిని సృష్టించాడు. పార్వతీదేవి అనతితో మాంగళ్య సూత్రాన్ని (తాళిబొట్టు బొద్దును) సృష్టించాడు. ఇట్లు గాయత్రీ సూత్ర సృష్టికర్త దేవలుడయ్యాడు.

అతడు పార్వతీదేవివైపు తిరిగి అమ్మా! వస్త్రము లక్షయమైనట్లే ఈ సూత్రద్వయం గూడ అక్షయం కావాలి. అని అమ్మవారిచ్చిన అపరంజి కడెముతో వాటిని స్పృశించాడు. అమ్మవారి కటాక్షంతో అక్షయత్వం సిద్ధించింది.

దేవలుడు సమంత్రకంగా జంధెం తాళిబొట్టు బొందు మొట్ట మొదటగా ఉమా మహేశ్వరులకిచ్చాడు. గణపతికి వీరభద్రునికి కుమారస్వామికి నందీశ్వరాది ప్రమథులకిచ్చాడు. సంకల్పమాత్రాన సరస్వతీ బ్రహ్మలనుపిలిచి గాయత్రీ మంగళ సూత్రాలనిచ్చాడు. అట్లే లక్ష్మీ నారాయణులను పిలిచి ఇచ్చాడు. దేవేంద్రాది దిక్పాలకు లకు, సమస్త దేవతా గణాలకు సూర్యాది నవగ్రహమూర్తులకు బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి బృందాలకిచ్చాడు. ఆ దినం శ్రావణ పూర్ణిమ. యజ్ఞోపవీత సృష్టి, ధారణ జరిగిన పవిత్రదినం. కావుననే ఆ పూర్ణిమను జంద్యాల పున్నమి, నూలు పున్నమి అని అంటారు. ఆనాటి నుండి ప్రతి శ్రావణ పూర్ణిమనాడు క్రొత్త జందెం ధరిస్తారు. సోదరీ సోదర ప్రేమ సూచకంగా రక్షాబంధనం గూడ జరుపు కొంటారు. పారమార్థికంగా కంకణ బంధనాన్ని జరుపు కొంటారు. ఇది అందరకు ఆచారంగా పరిణమించింది అంతేగాక, దేవల బ్రహ్మ సంతతి వారైన దేవాంగులు ఇతర దినాలలో వస్త్రోత్పత్తి కావించి ప్రతి పూర్ణిమనాడు విశ్రాంతి (ఊరట) తీసుకోవడం గూడ ఆచారమైంది. వారు పూర్ణిమనాడు ప్రజలకు వస్త్రాలిస్తుంటారు శివ పార్వతులకు, దేవదత్తా దేవల బ్రహ్మలకు ప్రత్యేక పూజలు చేస్తుంటారు. ఆ సాయంకాలం శ్రీ చౌడేశ్వరీదేవి అమ్మవారి మందిరంలో గాని, శివాలయంలో గాని అందరు సమావేశమై మతపరమైన చర్చలు కొనసాగిస్తారు. ఇది సంప్రదాయం.

## రంభానాట్యం-దేవలునికి పెండ్లి ఆలోచన

ఈ శుభసమయంలో బ్రహ్మర్షుల ప్రేరణపై దేవేంద్రుడు ముందుకు వచ్చి అమణిమయ సువర్ణ ప్రాసాదావరణంలో రంభాద్య

ప్సరసలను పిలిచి రమణీయ నాట్యం కల్పించాడు. రంభ శృంగార రస భంగీ తరంగిత మూర్తియై కాలిగజ్జెలు ఘల్లుఘల్లు రవ సన్నగా చిన్నగా తీయతీయగా రాగాలాపన చేస్తూ వచ్చింది.

సాకి-దేవలా! దేవలా! నీకిదే . పుష్పాంజలి

శ్రీ దేవల రాజర్షి

పాట—ఇదె వందనం నీకు అభివందనం
సుర పారిజాతాల సుమ మందిరం
శివ పార్వతుల ప్రేమ చిగురులై పూయగా
ఫల రూపమై నీవు ప్రభవించినావు ॥ఇదెవంద॥
బ్రహ్మ సృష్టికి వివిధ వస్త్రాలు నేసి
ప్రజల మానము నీవు కాపాడినావు ॥ఇదెవం॥

ఊర్వశి మేనక తిలోత్తమ పుంజికస్థల మున్నగు దేవకాంతలు మధుర గానంతో సహకార మండల నాట్యం చేస్తూ అందరను మురిపించి మైమరపింపజేశారు చివరికి వారు నాట్యగమనంతో అభినయ హస్తాలతో వచ్చి పార్వతీ పరమేశ్వరులకు, దేవలునకు, లక్ష్మీనారాయణులకు, సరస్వతీ బ్రహ్మలకు పాదాభివందనం చేశారు. శివుడు వారికి పట్టాంశుకాలను బహూకరింపుమని దేవలునికి చెప్పాడు. అతడు పేటంచు పొంబట్టు పుట్టాలను తీస్తూ ఒక్కొక్కరిని పేరు పేరున పిలిచి ఇచ్చాడు. రంభమెరపుదీవెలా అందెల రవళితో ఒయ్యారంగా వచ్చి క్రేగంట చూస్తూ ఒక్క చిరునవ్వునవ్వి దువ్వలు వలు తిన్నగా తీసికొని గిరుక్కున తిరిగి వెళ్లి పోయింది.

శివుడది గమనించాడు. క్రమంగా సద్దు మణిగింది. చంద్ర శేఖరుడు సూర్యుని జూచి లోకబాంధవా! మా దేవలుడు నూనూగు మీసాల వాడయ్యాడు. పెండ్లి ఈడువచ్చింది. నీ చెల్లెలిని దేవదత్త

నిచ్చి వివాహం చేయుమన్నాడు. వాణీ హిరణ్య గర్భులు విని ఇది మంచి ఆలోచన మన్నారు. రమా మాధవులు చక్కని సంబంధ మన్నారు. స్త్రీ జనంలోని దేవదత్త చూపుల్లో వలపుసిగ్గులు మొగ్గలు దొడిగాయి సూర్యుడు ప్రక్కకువచ్చి తన ధర్మ పత్నులతో మాట్లాడి వియ్యాని కంగీకరిస్తూ ఇది మాకు మహాభాగ్యమని ప్రకటించాడు. శివ తనూజుడు మా యింటి అల్లుడు కావడం మా పూర్వజన్మ సుకృతమన్నాడు. ఆ సదస్యులలో కొందరు మేలిమి బంగారానికి జాతిరత్నం దొరికిందన్నారు. కొందరు సృష్టికర్తలు వేరైనా జత చక్కగా కుదిరిందన్నారు. మరికొందరు అందమైన పూవునకు తీయని తావి పొందికన్నారు. మొత్తం మీద, పిన్నలకు పెద్దలకు ఈ పెండ్లి సంబంధ విషయం వీనుల విందైనది.

## శివుడు దేవలునికి నందిధ్వజాయుధాదు లిచ్చుట

తరువాత పరమశివుడు శైవ ఖడ్గం, నందిధ్వజం అనే దివ్యాయుధాలు దేవలునికిచ్చాడు. వాటి ప్రభావ మహిమోన్నతులు వర్ణించి చెప్పాడు. ప్రయోగోప సంహారాలు బోధించాడు. ఈ దివ్యాయుధాలు నీ చేతిలో ఉంటే ముల్లోకాలవారెత్తివచ్చినా నీ సిగ పూవును కదలించలేరు. నీ వెక్కడుండినా ఇవినీకు విజయలక్ష్మిని సమకూర్చుతుంటాయి. శత్రువులను సేవకుల్ని చేస్తుంటాయి. ప్రాజ్య సామ్రాజ్యాన్ని నీకు సుస్థిరం చేస్తుంటాయి. అధికారానికి కేవలం మంచితనం. మాటచాలదు ఆయుధ బలంకూడ కావాలి కుక్కే అయినా, కేవలం మాటకు నిలబడదు. కఱ్ఱ చూపిస్తే ఆగుతుంది, వెనక్కు పోతుంది అట్లే పురుషకారంతోనే అన్ని పనులు సాధ్యమౌతాయని అనుకోరాదు. దానికి దైవం తోడ్పాటుగూడ కోరుకోవాలి. దైవం వెలుతురు వంటిది. జ్ఞానం వంటిది వెలుతురులో వస్తుజ్ఞానం కలుగుతుంది జ్ఞానంలో సత్య నిరూపణం, యథార్థస్థితి కల్గుతుంది.

కార్యాచరణకు సమ్యక్ జ్ఞానం కావాలి. అదే దైవబలమౌతుంది. దేవల! జ్ఞానం ఎవరి హృదయవేదికపై నిత్యాగ్నికుండంగా ప్రజ్వలిస్తుందో, వారి సర్వ!తితను దోషాలు సమిధల్లా రగిలి తగులబడి పోతుంటాయి కావున నీవు సమ్యక్ జ్ఞానంతో జీవించుమన్నాడు.

విశ్వనాథుని ప్రక్కనే ఉన్న అన్నపూర్ణాదేవి చిరునవ్వు చిందిస్తూ దేవలుని పేర అందరికి విందు భోజనముంది. గంగా నిర్ఝరవారి పూరంలో శుచులైరండన్నది. బ్రహ్మాది దేవతలు అమ్మ చేతి అన్నం అమృతమేయని అడుగులు త్రొక్కుకొంటూ స్నానాదులు నిర్వర్తించి వచ్చి బంతులుతీరికూర్చున్నారు, దేవలుడు లేత అరటాకులు పరచాడు. గణపతి జల ప్రోక్షణ చేశాడు. వీరభద్రుడు తీర్థ జలపాత్రలు పెట్టాడు. కుమారస్వామి కాలాగురుగుగ్గులు ధూప ధూమం కల్పించాడు. అందరాపోశనలు పట్టారు. అంబిక కాలి అందెల ఝుళం ఝుళధ్వనులతో వచ్చి పంచ భక్ష్య పరమాన్నాలు సిద్ధించుగాక అన్నది విస్తళ్లన్ని దివ్యామృత పంచభక్ష్యాలతో నిండి పోయాయి నేతి లడ్డులు కజ్జాలు జిలేబీలు అరిసెలు గారెలు బూరెలు బూంది వగైరాలతోను, ఏపిలు ద్రాక్ష, చక్కెరకేళి కొబ్బరి మామిడి నారింజ మున్నగు ఫలాహారములతోను పులిహోరలతోను వివిధాన్నశాకపాకములతోను భోజనోత్సవం మహావైభవంగా సాగిపోయింది

దేవలుడు శివ పార్వతులకు శిర్షాభివందనం చేసి అచటగల బ్రహ్మ విష్ణు దేవేంద్రాదులకడ సెలవు తీసికొని కైలాసగిరి శిఖరావరోహణం చేశాడు ఆ శ్రీశైల శిఖరాధి రోహణం ప్రకృతి సౌందర్య కళోపాసకునకు, సప్తవింశతి తత్త్వకళాపిపాసకు నకు

బ్రహ్మానంద సహోదరమైనట్లే తదవరోహణం గూడ బ్రహ్మానంద సహోదరమే. చక్కెర చిల్కను మూతి కొరికినా, ముడ్డి కొరికినా తియన తీయనే గదా!

## ఏకాదశాధ్యాయం

కైలాసం యోగి జన హృదయోల్లాసం. చిచ్ఛక్తి మిథునా వాసం. సుషుమ్నానాడీ వికసిత జ్ఞానామృత ధారా పరివర్ధిత నిరంతర జ్యోతిర్బింబ వికాసం. అఖండాకార చిద్వృత్తి ప్రాపిత నిర్వాత దీప కళికోపమ నిశ్చల ధ్యానయోగోపన్యాసం. సంకల్ప వికల్ప సర్వభావ సన్న్యాసం. మోక్ష లక్ష్మీ పదనాట్య విన్యాసం జ్ఞాన కుంచికా విఘటిత మనోద్వార కవాట విపాటనాంతరంగ హృదయ పద్మకోశ పేటికా విష్కార పరమశివ నిధివ్యాసం. అని ఇట్లు తలపోస్తూ క్రిందికి దిగి వస్తున్నాడు.

ఆ ప్రక్క కొండలోయ సృష్టి రామణీయకమంత పుణికి పుచ్చుకొన్నదా? అన్నట్లున్నది కొండవాగులు నాగకన్యల్లా నాట్యం చేస్తూ జలజలా లోయలోనికి వచ్చి పడుతున్నాయి. ఒక ప్రక్క కుంకుమ పూల తోటలతో, ఇంకొక ప్రక్క రంగు రంగుల గులాబీల తోటలతో నేల రత్నకంబళి పరచినట్లున్నది. ఆ కోనంతా దివ్య తరులతా గుల్మాల పూల పరిమళాలతో మధుర ఫల రస సౌరభాలతో పిట్టల తీయని కంఠస్వరాలతో అతిధికి స్వాగతం పలుకుతోంది.

ఒకచోట కొండ ఊట సెలయేటి సన్నని జలధార స్ఫటిక శివలింగ శీర్షంపైబడి ప్రక్కనే ఉన్న పద్మాకరంలో సంగమిస్తోన్నది. తుమ్మెదలు జుమ్మంటూ వచ్చి పుష్ప మకరందాస్వాదన చేస్తున్నాయి. రాయంచలు కొలకొల మంటూ ముక్కుతో తామర తూండ్లను పొడుస్తూ అలలమీద తేలాడుతున్నాయి శివలింగ సందర్శనం

దేవలుని కాళ్లకు బంధాలైనవి అతడు ఆస్వాదు జలావగాహనం చేసి కొలనిగట్టుపై చెట్లనుండి రంగు రంగుల గన్నేరు పూలు, కడిమి పూలు, మారేడు దళాలు మామిడి పండ్లు టెంకాయలు కోసికొని వచ్చి పూజావిధి నిర్వర్తించి స్తుతులతో ధ్యాన నిష్ఠుడై నిమీలిత నేత్రుడయ్యాడు.

## రంభ దేవలుని మోహించి వచ్చుట-శాపము

ఇంతలో ప్రక్కగా ఒక స్త్రీమూర్తి అవ్యక్త మధురకంఠం సజ్జిత వీణాతంత్రిలా ఆర్యా ఆర్యా!ఆర్యా! అనిధ్వనించింది కనులుతెరువు. అటుకాదు; ఇటు చూడుమన్నది, దేవలుడు కొంత సేపటికి ధ్యానం ముగించి కళ్లు తెరిచాడు. చూచి ఎవరవు నీవు? అన్నాడు. ఆ కంఠం...నేను.. నేను.. రంభను. గుర్తుపట్టలేక పోతున్నావా? అన్నది. దేవలుడు ఆఁ...అవును. గుర్తువస్తున్నది. ఇతః పూర్వం కైలాసంలో మా పితృపాదుల సమక్షంలో నాట్యకత్తెలలో నాయకివై మండలాకార నాట్యం చేసిన రంభవుకదా? మరి, ఇప్పుడెందుకు ఇక్కడికి వచ్చావు? అన్నాడు

రంభ చిరునవ్వుతో ఆర్యా! స్వర్గంలో వస్త్ర ప్రదానవేళ పరిచయం గుర్తులేక పోయినా, ఇంతకు ముందు నేను కావించిన మండల నాట్యం గుర్తున్నందుకు సంతోషం. ఈ లోయ అందాలకు కాణాచి. ఈ ప్రకృతి సౌందర్యం చూడటానికి నేను రాగూడదా? పోని, నీ అపూర్వ సౌందర్యానికి, నీ మనోజ్ఞ సృష్టికి దివసాభిసారికనై వచ్చాను. కళ్లున్నది దేనికి? సృష్టి అందాలు చూడటానికి గదా? అన్నది. అతడు సంశయిస్తూ అందం చూడవచ్చు అవధులు దాటరాదుగదా? అన్నాడు. ఆమె నవ్వుతూ అందానికి అవధి ఆనందమే. ఆనందం లేకపోతే మనుగడకు సార్థక్యమేలేదు. అది అటుండనీ. ఆపూట నాట్య సభలో ఈ చిలుకపచ్చ పట్టుచీర ఇచ్చావు, కట్టు

కొన్నాను. ఇది నాకు బాగుండలేదని మా ఊర్వశి అంటున్నది. అని అన్నది. దేవలుడు అదేమిటి? నీ ఒంటికిది చాల బాగున్నది. చిగురు వేసి మొగ్గదొడిగి అరవిరిసిన నవమాలికా లతికలా ఈ పేటంచు చీరతో నీవెంతో అందంగా ఉన్నావు. ఊర్వశి అసూయతో బాగుండ లేదనిఅని ఉంటుంది. అన్నాడు ఆమె ఈపైటచెరగు పేటంచుచూపు. బంగరు జరీపోగులు అక్కడక్కడ తెగి ఉన్నాయి అన్నది. అతడు ఈ సరిగంచు వలువను బహు జాగ్రత్తగా నేశాను. పోగులు తెగి ఉన్నవంటేనమ్మలేను అతెగిపోయిన వెక్కడ? అన్నాడు ఆమె ఇదిగో ఇక్కడ చూడుమనిపైటకొంగు వదలించి పద్మ ముకుళములవంటి వక్షుపగుబ్బలుకనపడేలా చెరగుచేతికందించింది రంభ మెరపుతీవెలా మెరసి పోతూ కాటుకరెప్పల నీలికన్నులల్లి అల్లలాడిస్తూ, కనపడుట లేదా? ఇవిగో చూడు. ఇక్కడ అన్నది. అతడు స్వర్ణ కలశముల వంటి ఆస్తనద్వయ శోభకు చకితుడయ్యాడు. అది కామదృష్టికాదు; సౌందర్యాను శీలనా దృష్టి మాత్రమే. పైటలో ఒకటి రెండు పోగులు తెగి ఉన్నాయి. దేవలుడు తనవద్ద నున్న దాని మౌలిక వస్త్రంచూచి, చూపిస్తూ దీనిలో తెగిలేవు. చూడు రంభా! ఈవస్త్రంలో జరీపోగులు తెగిలేవు నీ కిచ్చిన దానిలో తెగి ఉండటానికి కారణ మేమిటి? ఈ పని ఊర్వశి చేసిందా? నీవే చేశావా? అన్నాడు.

ఆమె ఒకరి చీరెలు మరొకరు చూచేటప్పుడు ఈ పని ఎవరు చేశారో చెప్పడం ఎలా సాధ్యం? దీని కంటె పాలరోజా పట్టుచీరె నాకీయ గూడదా? అన్నది. అతడు అప్పుడు నీ వడిగితే ఇచ్చేవాడినే? అన్నాడు. ఆమె ఇప్పుడీయగూడదా? అడుగుతున్నాను. అన్నది అతడు నేను నేసింది ఇవ్వడానికే. దాచుకొంటానికి కాదుగా. ఇస్తాను. అనితీసి ఇవ్వబోయాడు ఆమె చీరను గాక చేతులనే పట్టుకొన్నది. అతడు ఏమిటిది? చేతులు పట్టుకొంటున్నావు? అన్నాడు. ఆమె

ఇంత అందంగా చీరెను నేసిన చేతులు ఎంత అందంగా మృదువుగా ఉంటాయో చూడాలని పట్టుకొన్నాను. ముద్దొస్తున్నది ముద్దుపెట్టుకోనా? "ప్చ్" అన్నది. అతడు చేతులు లాక్కొని రంభా! నీ వేదో మనస్సులో పెట్టుకొని వచ్చినట్లున్నావు. అన్నాడు. ఆమె వాలుగన్నులతో చూస్తూ దేవల రాజేంద్రా! నేను సౌందర్యోపాసకురాలను అందమున్న చోటికి చేరుకొంటాను. నా మనస్సు అద్దం వంటిది. అందులో నీవు ప్రతి ఫలించావు తుమ్మెద సౌరభాన్నిబట్టి పువ్వును చేరుకొంటుంది. అలాగే నీ అంద చందాలు చూడాలని వచ్చాను. నిన్ను చూడటానికి రాగూడదా? అన్నది. అతడు ఇంద్రసభలో నన్ను చూచానన్నావు కైలాసంలో చూచావు ఇపుడు మళ్లీ ఈ ప్రత్యేకపు చూపునకు అర్థం? అన్నాడు ఆమె తనివి తీర కుండుటయే నా కన్నులు నీ అందాన్నిపుక్కిట పడుతున్నాయి. మరి, నీకింత అందం ఎందుకున్నది? నన్నెందుకు ఆకర్షిస్తున్నావు? అన్నది అతడు నేనొక అందగాడినా? నా అందం నిన్నాకర్షిస్తున్నదా? ఊం. బాగుంది అన్నాడు. ఆమె నీ ముఖం నీకు కనపడదు అందుకు అద్దం కావాలి. నా మనస్సనే అద్దమున్నది చూచి తెలిసికోవచ్చుగదా? అదిసరే. ఈ పాలరోజా పట్టుచీర ఇచ్చావు. కట్టుకొంటే ఎలా ఉంటానో నీవు చూచి చెప్పాలి. ఆడదాని అందం మగవాడికోసమేగదా! కట్టుకోనా? ఒక్కక్షణంలో కట్టుకొంటాను. అని అక్కడనే పూచిన సన్నజాజి పొద ప్రక్కకుబోయి సగం కనపడుతూ చీరె కట్టుకొంటున్నది.

దేవలుడు శివశివా అంటూ ప్రక్కకు తిరిగి కళ్లుమూసుకొన్నాడు. రంభ వచ్చి పైట చెరగు జారవేస్తూ ఈ చీరెకు ఈ సరిగంచు పేటు చాల బాగున్నది ఈ చీరెతో నేనెలా ఉన్నానో ఇప్పుడు చెప్పు చూద్దాం? అన్నది. దేవలుడు కళ్లుతెరచి చూచి మా అమ్మ శ్రీ చౌడేశ్వరీదేవిలా ఉన్నావు. రంభా! రాతి బొమ్మకు చక్కిలి గింత పెడుతున్నావు అన్నాడు. రంభ హృదయం గతుక్కు

మన్నది విద్యుద్ఘాతం తిన్నట్లయింది. ఈ వాచికాభినయం, ఈ భావ ప్రకటనం సూర్యుని ముందు దివిటీలా నిస్తేజమై పనిచేయలేదే? అని విచారపడ్డది. తెగించింది. మోహాదు పెంచింది. లజ్జాభిమానాలు గాలికి వదిలేసింది. కాలిబొటన వ్రేలితో నేలను రాస్తూ మనోహరా! నీవు రసికుడవని వచ్చాను. చల్లకు వచ్చి ముంతదాచడమెందుకు? నీపై మనసుపడి వచ్చాను. మరులుగొని వచ్చాను పరమేశ్వరుని సన్నిధానంలో నుండి నిన్ను వెన్నాడుతూ నీడలా వచ్చాను నేను నీ బాహుబంధం కోరుతున్నాను. కాదనకు మన్నది.

అతడు నవ్వి తన్వీ! నీవో అమర్త్యవు.నేనోమర్త్యుడను చావని వారికి చచ్చే వారితో సంబంధం ఎలా కుదురుతుందని వచ్చావు? అన్నాడు. ఆమె దేవలా! నీవు కేవలమర్త్యుడవు కావు. పరమశివుని సద్యోజాత ముఖ పద్మంనుండి జన్మించావు. దేవతల అంగాలంకరణకు వస్త్ర సృష్టిచేసి దేవాంగుడవయ్యావు. ఇవి దేవతా లక్షణాలే. ఇక అమర్త్యత్వ మంటావా? నీకు కావాలంటే అమృతం త్రాగించి నిన్ను మాలోక నివాసిగా చేసికొంటాను. కాదనకుమన్నది. అతడు రంభా! నీవు జ్ఞానంతో చాల జాగ్రత్తగా మాట్లాడావు. ఒకప్పుడు నేను శివసాయుజ్యం పొందిన వాణ్ణి దానికంటె అత్యల్పమైన దేవజాతిత్వాన్ని కాంక్షించి అమృతం త్రాగుతానా? అన్నాడు.

ఆమె రాజేంద్రా! నీ వింత గొప్పవాడివని నాకు తెలుసు ఎవరైనా గొప్పతనాన్ని కోరుకొంటారు. గొప్పవారి సాహచర్యాన్ని ఎన్నుకొంటారు. నీ వంటి మహోన్నతునితో పొందుకోరుకొనడం నాకు హక్కుగా భావిస్తున్నాను అన్నది. అతడు తరుణీ! నేనిప్పుడు ఆసాయుజ్య మోక్షస్థితిలో లేను. కేవల మర్త్యుణ్ణి. అన్నాడు. ఆమె మహోదయా! మర్త్యుడవైతే ఏమి? ఈ ముల్లోకాలలో నీ కంటె అందమైన మగవాడు లేడు అట్లే నా కంటె అందమైన మగువలేదు.

ఇద్దరి అందం ఏకీకృతం కాగూడదా? అన్నది. అతడు నవ్వి అందమా? నా అందమా? ఈ దేహం నవరంధ్రాలద్వారా మలినాలను విసర్జిస్తూ నిత్యమూ రోతగా ఉంటుంది. కడిగి తుడిచి శుద్ధి చేస్తుంటే ఒక రూపంగాకనపడుతుంది. ఇంకా ఎప్పుడేదో రోగాలకు గురిఅవుతుంది. మధ్యకాలంలో అందమనే వస్తువు పుడుతున్నది. ముసలితనంరాకతో ఆ అందం గాలిలో కర్పూరంలా హరించుకొని పోతోన్నది. ఈ దేహం ఎముకల ప్రోగు. మాంసం ముద్ద. నీ కందంగా కనపడు తున్నది, ఈ పై చర్మమా? ఇదీ చెమటకంపే. ఈ శరీర భ్రాంతి, ఈ బాహ్య సౌందర్య దృష్టి విడిచి, ఆత్మ సౌందర్యంపై నీ దృష్టిని కేంద్రీకరించు. దానివలన నీకూ క్షేమం, నాకూ క్షేమమే నీవు తరిస్తావు; నేనూ తరిస్తాను అన్నాడు.

రంభ విసుగు కొంటూ దేవలా! చూడబోతే నీవు పడుచు కుఱ్ఱవాడివి. కాని ముడిగి ఉడిగి ముల్లైన ముదివగ్గులా మాటాడు తున్నావు. లోకంలో స్త్రీ పురుష ద్వంద్వ జీవులు ఎందుకు సృష్టింప బడ్డాయి? స్త్రీ పురుష సాంగత్యంతో విశ్వసృష్టి తీగ సాగడానికి కాదా? ఇద్దరిలో సహజమైన ఆకర్షణమూ, అనురాగమూ, ఆలింగన చుంబనాదులు చెడ్డవని త్రోసివేసి, నీవు చెప్పినట్లే అసహజ అనాగరిక అసంబద్ధ వికృత వైరాగ్యం అలవరచుకొంటే అది కర్మే అవుతుంది; దుష్కర్మే అవుతుంది ఆర్యా! నీవుచెప్పేవైరాగ్యమేయధా ర్థమైతేసంతానతంతు విచ్ఛేదమై సృష్టి ఆగిపోతుంది. స్త్రీపురుషసృష్టి వ్యర్థమౌతుంది అన్నది అతడు రంభా! నా మాటలనువ్యక్కకులాగి వక్రభాష్యాలు చెవుతున్నావు. స్త్రీ పురుష సంబంధం దోషమని నేన నుటలేదు. సంతాన తంతు విచ్ఛేదం జరిపి సృష్టిని స్తంభింపజేయుట గూడ నా అభిమతంకాదు. నా అందం శాశ్వతంగా నిలిచేది కాదంటు న్నాను. నా అందంలో పొందే ఆనందంకంటె అనింద్యమైన ఆత్మా నందం పొందగూడదా? అంటున్నాను. ఇంతకూ నిన్ను నేను

కామించడం లేదుగదా! అన్నాడు. ఆమె కనుబొమలు విరుస్తూ ఆర్యా! సౌందర్యానికి మచ్చుముక్క రంభ అనిలోకం వాకొంటున్నది. అంతటి దేవకాంత స్వయంగా చెంతకు వస్తే గౌరవించలేక పోతున్నావు. నిన్ను వలచి వచ్చానని నోరారచెప్పినా చులకన చేసి మాటాడు తున్నావు. ఇది నీకు తగదు అన్నది. అతడు నేను కామిని కాను అన్నాడు.

ఆమె నీవు కామివికావా? ఓహో!! అలాగా? సూర్యుని చెల్లెలిని పెండ్లి చేసికొనబోయే నీవు కామివెట్లవుతావు? నిష్కామివే అవుతావు ఇనుప కచ్చడాలు కట్టుకొని ఘోర తపస్సులు చేసే మహర్షులూ, నియమవ్రతులై యజ్ఞయాగాలు చేసే రాజర్షులూ కాముకులు కాకుండానే వచ్చి నాకౌగిట బందీలయ్యారు. నాకౌగిలి సామాన్యులకైన, అసామాన్యులకైనా, మాన్యులకైన, సౌజన్యులకైనా, దుర్లభమైనది. మరుగాలి తగిలి నిలుపోపలేక దీనురాలనై వచ్చాను. నన్నవమానింపకు మన్నది. అతడు కాంతా! కట్టులేని కామినికాను. నేను ధర్మకామిని ధర్మార్థ కామమోక్ష కామిని. శివ భక్తుడను. శివుడు మన్మథుని జయించిన వాడు. శివుని పంథాయే నా పంథ అన్నాడు. ఆమె ఛీత్కరించి రాయిరైన కరగుతుంది గాని, నీ మనసు కరగకున్నది. కాళ్లా వ్రేళ్లాబడి బ్రతిమిలాడినా, భంగపడినా మరిమరీ బిఱ్ఱబిగిసి పోతున్నావు. నేను నీ కంటికి దయ్యంలా కనపడు తున్నానేమో!! నా మాటలు గ్రుడ్లగూబకూతల్లా ఉన్నాయేమో! అన్నది.

అతడు రంభా! లేదు లేదు. నీవు దేవవేశ్యగా కనబడు తున్నావు కాని, నీ మాటలు నా చెవికి చేదై వెగటు కల్గిస్తున్నాయి అన్నాడు ఆమె అంటే? అని ప్రశ్నించి, చేదన్న మాటకు వివరణ కావాలన్నది. అతడు రంభా! నీవు అతిలోక సౌందర్య వతివే. లోకాలలోని స్త్రీల అంద చందాలు నీ కాలి కొనగోటికైనా సరిపోల

వని నాకు తెలుసు. అని అంటుంటే ఆమె మరి, ఈ తిరస్కారమేమిటి? అన్నది. అతడు నేను చెప్పే విషయం పూర్తిగా విను రంభా! నీ వెంత అందగత్తెవైనా, ఎప్పుడూ లేబ్రాయం గల దానివైనా, వలపుల ఒయ్యారివైనా, చెరకు విలుకాని కటారివైనా, మిటారివైనా, నీ వొక వేశ్యవే; కలవారికి అంగ మందించే దానివే. నీతళుకు బెళుకులూ, నీ వలపు కులుకులూ సాధర్మ్యం కలవారి యందు పని చేస్తాయి గాని, వైధర్మ్యం గల నా వంటి వారియెడ పని చేయవు. అభిముఖ మైన అద్దం గాజు మీద ప్రతిబింబం పడుతుంది గాని వెనుక చెక్క మీద పడదు గదా! అని అంటుంటే అడ్డం వచ్చి రంభ పురుష పుంగవా! ఆడదానినై అడుగు తున్నానని ఇన్ని చదువులు చదువు తున్నావు ఎగబడు తుంటే దిగదీస్తున్నావు. ఇంతకూ నీకు మగతన ముందో లేదో అని అనుమానిస్తున్నాను. వట్టిమాటలతో నన్నను క్షణం అవమానిస్తున్నావు; హింసిస్తున్నావు మహాత్ములు తమ పుణ్యంతో నన్ను కొనుక్కుంటారు రసజ్ఞులు నాగాలికి పరవశిస్తారు. అటువంటి నా స్పర్శ నీకేదో పాపంగా ఉన్నట్లున్నది ఇంతకు వచ్చిన దారిని నన్ను పొమ్మనేనా, నీ ఉద్దేశ్యం? అన్నది అతడు ఆహా! అవశ్యం వెళ్లి పొమ్మనే నా ఉద్దేశ్యం. మగతనం లేని వాణ్ణని నన్ను నిందించి నంత మాత్రాన నాకులోపమేమిరాము; కోపమేమిరాదు రంబా! నీవు వెళ్లితే నా నెత్తిన పాలు పోసినట్లుగా భావిస్తాను అన్నాడు ఆమె ఏమయ్యా! నీవు వెళ్లమంటే వెళ్లుతానా? నే నింతదూరం శ్రమపడి రావడం కోరిక తీర్చు కొంటానికిగాని, చేతులు ముడుచుకొని ఊరకే వెళ్లడానికేనా? పేదకు పెన్నిధిలా నీవు చేతికందితే. కౌగిట పొదుపు కోకుండా అవకాశం వదలుకొని వెళ్లి పోవడానికి నేనేమి వెట్టిదాన్ని కాను చక్కెరలప్ప వంటి నీ కెమ్మోవిని ముద్దాడక పోతే నా విరహ తాపం తీరేదికాదు. నాజిగి బిగి రొమ్ములు నీ రొమ్ముతో కదియించి అదిమి కుదిలించకుంటే నా మదన జ్వరం చల్లారేది కాదు. నా ఒడ

శింత కాగివేగి పోతున్నదో చూడు. ఇక నిన్ను కౌగిలించుకోకుంటే చస్తాను. అంటున్నది

దేవలుడు శివశివా! అని చెవులు మూసికొంటూ రంభా! నీ వాగుడాపు ఎన్నివలలు పన్ని, ఎన్ని ఉచ్చులువేసి నన్ను పట్టలేవు. అతి సంభాషణ చేసి నా అంతరాత్మ వీణా తంత్రిని మీటావు. ఆ ధ్వని భావమై రెక్కలు విప్పుకొని పైకి వస్తున్నది. ఇంతవరకు నీకు చెప్పగూడదనుకొన్నాను. ఇప్పుడు చెప్పక తప్పటలేదు. ఇది ఆత్మీయమైనది. విను. మా అమ్మ శ్రీ చౌడేశ్వరీదేవి అనుగ్రహం వలన నాకు పూర్వ జన్మ జ్ఞానమున్నది ఆ జన్మలో నేను శివార్పణ బుద్ధితో నా సర్వస్వం త్యాగంచేసి శివ సాయుజ్యం పొందాను. బ్రహ్మ ప్రేరణ చేత వస్త్ర సృష్టికై మరల ఇలా జన్మించాను. నా వలన కలిగే సంతానానికి నేను బీజం వంటి వాణ్ణి. నేను పవిత్రంగా ఉంటే నా సంతతి గూడ పవిత్రంగా ఉంటుంది, మంచి బీజం మంచి వృక్షోదయానికి కారణమౌతుంది.

అట్లే నేను చెడ్డగా ఉంటే నా సంతతి చెడ్డదవుతుంది. చెడు బీజం చెడు వృక్షోదయానికి కారణమౌతుందిగదా! ఇక నీవో వేశ్యవు. అనేకులు తమ పుణ్యంతో నిన్ను కొనుక్కుంటారని నీవే చెప్పావు పడుపు వృత్తితో జీవించే నీతో క్షణిక సుఖానికి పాల్పడితే నా జన్మమే వ్యర్థమౌతుంది. నా పవిత్రాశయమే నేలలో వందగజాల లోతున సమాధి అవుతుంది. నేను అపవిత్రుడనౌతాను. నా సంతతి వారు అపవిత్రులై రాక్షసులౌతారు. ఇంత పాపానికి నేనొడిగట్టలేను. ఒక వంశానికి మూల పురుషుణ్ణి కానున్ననేను ఆ వంశక్షేమం కోసం కఠోర నియమ పాలనం చేయవలసిందే. మిన్ను విరిగి మీద పడినా, సూర్య చంద్రాది గ్రహాలు గతులు తప్పినా, ఏడు వారాశులేకమై ప్రళయోత్పాతం కల్గించినా, ఏ అదృశ్య శక్తియైనా వచ్చి నన్ను

బంధించి నీ వశం చేసినా నీకు విముఖుడనేకాని సుముఖుడనుకాను. నీ పొందు నాకు విషతుల్యం. నీవు వాగి నన్ను వాగిస్తా వెందుకు? రంభా! నీవు కోరే కామం ఏ జాగ్రత్ స్వప్న సుషుప్తులలోనైన నాకు కలుగ కుండునుగాక! శాస్త్ర సంబంధమైన ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ ఫల పురుషార్థాలకే నా మనస్సు పూదవ పందిరిపైకివలె ఎగబ్రాకు గాక! రంభా! నీవు మా అమ్మ శ్రీ చౌడేశ్వరీదేవి వంటి దానివని నీకు నేను ముందే చెప్పాను. పుత్రభావంతో ఇకనైనా నన్ను విడిచి పొమ్మన్నాడు.

రంభ హృదయం గుగ్గిలంచల్లిన అగ్గిలా భగ్గుమన్నది. కన్నులు చింత నిప్పుల్లా ఎరుపెక్కాయి. రూక్షణ తీక్షణేక్షణాలతో కాలి పోయేటట్లు దేవలుణ్ణి చూడసాగింది బింబాధరం కంపించింది. పడగ విప్పిన త్రాచులా ముకుపుటాలెగసేట్లు బుసగొడుతూ ఏమయ్యా! ఏమన్నావు? నా పొందువలన నీవు అపవిత్రుడవౌతావా? ఎవడు చెప్పాడు? ఏ శాస్త్రం గొంతు చించు కొంటోంది? పవిత్రతా పవిత్రతలు మీ భూలోక వేశ్యలకేకాని స్వర్గంలోని మా దేవకాంతల కెక్కడివి? మీ లోక భోగకాంతలకువలె మాలోక దేవకాంతలకు పడుపువృత్తి కలదనీ, అంగం అందివ్వటం కలదని వాగిన నీ నాలుక చీలికలై ఏల తెగిపడదు?

ఇంతవరకు వచ్చిన నిన్నూరక పోనీయరాదు. ఓ దేవలా! ఇతరులు అపవిత్రులనీ, నీవేవో పవిత్రుడవనీ మాట్లాడావు నీ బీజ పవిత్రత నీ వంశ వృక్షానికి ఆపాదించాలని నీచ స్వార్థబుద్ధిని ప్రకటించావు. ఈ జాగ్రద వస్థలో నీవు బలవంతంగా నియమవ్రతం పాటించినా స్వప్నావస్థలో పాటించగలవా? నీ వెట్లో పాటించినా నిన్ను కట్టుకొన్న నీ యిల్లాలి మనస్సు అలాగే ఉంటుందని నీవు పూచీ ఈయగలవా? ఇటువైపు నీవు మూతబిగించినా, అటువైపు

దోషరంధ్రముంటే అపవిత్రత దారి చేసికొని వచ్చి నీ వంశవృక్షానికి చీడపురుగై అంటుకోదా? ఇంతకూ ఏది ఎప్పుడు, ఎలా జరుగుతుందో ఎవరు చెప్పగలరు? ఆ ముడి ఎవరు విప్పగలరు? ఆడదాన్ని ఆదరించక ఆరాటపెట్టావు. అనరాని మాటలని ఆవేదనకు గురిచేశావు. హృదయాన్ని గాయపరచావు. దీని ఫలితం ఇదే నా శాపం. నీ స్వాతిశయ అహంకారానికి చెంపపెట్టయి పాపంగా పరిణమిస్తుంది విషనాగమై కాటేస్తుంది. విను. నీవేదో నడుమంత్రపు సిరితో రాజేంద్రుడనని విఱ్ఱవీగుతున్నావు. ఓయీ! నీవు ఆయుధహీనుడవై పరాక్రమహీనుడవై యుద్ధంలో శత్రువులచే బంధితుడవౌతావు నీ వంశీయులు అనాచారులై శూద్రులతో సమంగా జీవిస్తారు గాక! అని శపించి గిరుక్కున మరలింది.

దేవలుడు త్రుళ్లిపడి రంభా! అగు సౌందర్య మదంలో విఱ్ఱవీగే నిన్ను ప్రతిశాపంతో హీనాతి హీనంగా జీవించేటట్లు చేయగలను అంతకంటె మొండి బండను చేయగలను. ఆడదాని వై బ్రతికిపోయావ్.కానీ, నీకు వివేకం లేక పోయినా నాకున్నది. నన్ను తిట్టినందుకు నాకు బాధలేదు. ఇప్పటికి పుట్టని, నీకే అపకారం చేయని నా వంశీయులను తిట్టావు. ఇది క్షమింపరాని నేరం. శాపం ఉపసంహరింపుమన్నాడు ఆమె అది నా వల్ల కాదన్నది. అతడు శాపావధియైన చెప్పుమన్నాడు. ఆమె ఆలోచించి కలియుగం అయిదు వేలేండ్ల వరకు పనిచేసి శాపం వీగిపోతుంది. అని చెప్పి ఆకాశం లోనికి ఉద్గమించింది.

దేవలుడు విచార సాగర నిమగ్నుడయ్యాడు. కొలనిలోని బంగారు తామరపూలు కోసి శివలింగం మీద పెడుతూ తంత్రీ, పరమేశ్వరా! నాకీ అగ్ని పరీక్ష ఏమిటి? నియమదీక్షా వ్రతుడనై ఉండుట గూడ దోషమేనా? నేరమేనా? అక్షయమైన నీ కృపా

వీక్షణం అనుక్షణం బహిరంతరంగరక్షణగా ఉంటుందని భావించాను. నియమవ్రతానికి శిక్షపడుతుంటే చూస్తూ మిన్నకుంటావా? ఈ నిర్హేతుక శాపం పాపమై ప్రచండాగ్నియై నన్నూ, నా సంతతిని కాలుస్తుందిగదా! జడ్డిగంలో మిడత పోటులా నా బ్రహ్మచర్య వ్రతానికి ఫలమిదేనా?

అమ్మా, పార్వతీ! నీ బిడ్డ నిష్కారణ శాపాగ్ని తప్తుడౌతుంటే చూస్తూ ఊరకుంటావా? బిడ్డయోగక్షేమాలు పరి రక్షించడం తల్లి దండ్రుల బాధ్యత కాదా? నా పసి హృదయం, నా అమాయికత్వం లోకులకు చెలగాట మయింది పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణ సంకట మిదే కాబోలు. అని అనుకొంటూ అంతలోనే పశ్చాత్తాపపడి ఏదో బాధకు గురి అయ్యానని జననీ జనకుల దయార్ద్ర హృదయాన్ని శంకించాను. నా అహంకార మమకారాలను వ్యక్తీ కరించాను. శాపోపహతుడనని నేనెందుకు విచారపడాలి? నా జన్మ దాతలే విచారించు కొంటారు. ఆ మంచి చెడ్డలు వారివే. నేను నిమిత్త మాత్రుణ్ణి అని మౌన ధ్యాన ముద్రాభి ముద్రిత నేత్ర పద్ము డయ్యాడు.

పార్వతీ పరమేశ్వరులు శివలింగంలో నుండి లీలా మాత్రంగా ప్రత్యక్షమై దేవలునిస్పృశిస్తూవత్సా! విచారించకుశుభోబాధవిబాధయే నయ్యా! నీవు రాజేంద్రుడవయ్యావు. వస్త్ర సృష్టిచేశావు సూత్రసృష్టి చేశావు. బ్రహ్మవనిపించుకొన్నావు. ఖడ్గనందిధ్వజాది మహాయుధాలు చేపట్టావు. జగచ్చక్షువైన సూర్యునితో వియ్యమంద బోతున్నావు ఈ నీ అభివృద్ధి పరంపరలు కొందరికి కన్ను గుట్టింది. వారు నిన్ను భ్రష్టుని చేయడానికి కుట్రపన్నారు. రంభా ప్రయోగం జరిగింది. రంభకు లోబడితే సర్వనాశనమౌతావనీ, లోబడక పోతే శాపంద్వారా కొంత మట్టుకైనా దెబ్బ తింటావని వారి ఊహ. ఇది చెంపదెబ్బ గోడదెబ్బ లాంటిది. ఏమైనారంభా మాయా వాగురలో పడకసర్వాత్మనా

విజయుడవయ్యావు. ఇది నీ కీర్తికి అక్షయోజ్జ్వల కర్పూర పతాక. ఈ అగ్ని పరీక్షలో నీవు పుటము పెట్టిన మేలిమి అపరంజి పూదె వయ్యావు. నీ వయసునకు నీ వాదన పసిడికి పరిమళ మబ్బి నట్లయింది.

ఈ విషయంలో సజ్జనులకు నీ వాదర్శమూర్తివిగా నిలబడ తావు. లోకులు కామ వాంఛాప్రేరితులై పరస్త్రీలకు సుళువుగా లొంగి పోతారు. శారీరకముగా, మానసికముగాదార్ఢ్యం కోల్పోతారు. ఆత్మ వైకల్యంతో బీజ దౌర్బల్యం పొందుతారు. నిర్వీర్యులౌతారు నిస్తేజు లౌతారు. ఆస్థితి స్వభార్యా సంతానమందు సంక్రమింప జేస్తారు. బీజ దౌష్ట్యం, బీజ దౌర్బల్యం, బీజ కాపట్యం పుట్టిన సంతానం మీద పనిచేస్తుంది.

ఆత్మగౌరవం, సత్సంతానం, ఉన్నత వంశాభివృద్ధీ కోరేవారు ఏకపత్నీవ్రతస్థులై స్థిరసంకల్పంతో సత్యాన్వేషకులై జీవించాలి. గట్టినేలలో పాతిన గుంజ నిటారుగా నిలిచి ఉంటుంది. బురదనేలలో పాతినకొయ్య వాలి పడిపోతుంది బీజ శుద్ధి క్షేత్రశుద్ధి ఉండాలి. అప్పుడే మంచి పంట చేతికి వస్తుంది. మంచి బీజం చవిటి నేలలో మొలకెత్తినా వృద్ధి పొందలేదు. మంచి నేలలో నాసిరకం బీజం సరియైన రూపరేఖలు దిద్దుకోలేదు. జీవితంలో ఆ రెంటిని పరిగణన లోనికి తీసికొని ఉత్తమోన్నత ప్రమాణం కల్పించుకొన్నవారే ధన్యు లౌతారు. అతని వంశం గౌరవస్థానానికి ఎదుగుతుంది. దేవలా! నీ స్థిర సంకల్పానికి నిన్ను నేనభినందిస్తున్నాను. అయితే, చివర రంబా శాపం కలవర పెట్టే విషయమయింది. విధి బలీయంగదా! బిడ్డా! నీవూ, నీ వారూ నీ జన్మదాతలమైన మా యిద్దరిని ఉపా సించువారైతే ఆ శాపప్రభావం వమ్మవుతూ ఉంటుంది. కుల దేవత యైన శ్రీచౌడేశ్వరీదేవి జ్యోతిర్మూర్తి ఆరాధన చేస్తుండినా సూర్యో

దయంతో అంధకారం విచ్చిపోయినట్లు శాపం పనిచేయక నిల్చి పోతుంది. అన్నాడు. పార్వతి దేవలా! ఇక విచారపడకు. మీ నాయనగారు అన్ని విషయాలు విడమరచి చెప్పారుగదా! వాటిని పాటించు నీకు విజయం కలుగుతుంది. నీ కోసం నీ మంత్రులు నీ ప్రజలు ఎదురు చూస్తుంటారు. ఆలసింపక ఆమోద పట్టణానికి వెళ్లు. పరిపాలన వ్యవహారాలు స్వయంగా చూచుకో. ఒంటి వాడవు గాక ఇక ఒక యింటి వాడవు కావలసి ఉన్నావు నీకు పెండ్లి చేస్తాము. మేము వెళ్లి వస్తామని అభయహస్తముద్రతో ఇద్దరు అదృశ్యు లయ్యారు.

దేవలుడెంతో సంతోషపడ్డాడు తానొక్కమాటైన మాట్లాడక పోయినా, అన్ని విషయాలు వివరించి చెప్పారు. జగజ్జననీ జనకుల కెంతదయ! రసహీనమైన నా యెడారి బ్రతుకులో ఒయాసిస్సులా ప్రత్యక్షమై సేద తీర్చారు. ఈ కాలవాహినీ తాలోత్తాల తరంగాలపై నా జీవిత నౌకను చుక్కాని పట్టి నడిపించే కర్ణధారులు వారే, ఆది దంపతుల ఆశ్రయం లేకుంటే నా చీకటింటికి వెలుగేలేదు.

జన్మకు రావడం దుఃఖానుభవం కోసమే. ఒకప్పుడు క్షణిక సుఖం కల్గినా తళుక్కున మెరపు మెరసి కారు చీకటి క్రమ్ముకొని పోయేట్లు అది దుఃఖంగా పరిణమిస్తుంది. ఏ క్షణంలోనైనా నేను రంభకు ఆశకల్పించలేదు. తనకు తానే వచ్చి నన్ను కదిలించి నా హృదయాన్ని గాయపరచి పోయింది ఎవరి బ్రతుకూ వడ్డించిన విస్తరికాదు. పూలపరపేమికాదు అది ముళ్లపరపువంటిది అను పదం ముళ్లుగుచ్చు కొంటుంటాయి. బాధ పెడుతుంటాయి. కష్టాల గీటురాయిమీద వన్నెదేలినవాడే నిక్కచ్చి బంగారం. కష్టాలలోనే కంటి పొరలు తొలగి యథార్థ జ్ఞానం కలుగుతుంది. జ్ఞానవంతుడు

కష్టసుఖాలను సోపానాలుగా మలచుకొని అభ్యుదయ మోక్ష సౌధ శిఖరాధి రోహణం చేయగలుగుతాడు.

దైవం తోడ్పాటులేక కేవల పురుషకారం వలన సంకల్పిత కార్యాలు ఫలించనేరవు. నా కులదేవతయైన శ్రీరామలింగ చౌడేశ్వరీ దేవి కరుణా కటాక్ష వీక్షణతో నా జీవిత సమస్యలను పరిష్కరించుకొని నా దారి సుగమం చేసికొంటాను. ఇక రాజధానికి పోవాలి. అనుకొని శివలింగానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి ఆమోద పట్టణానికి వెళ్లి పోయాడు.

## ద్వాదశాధ్యాయం-దేవలునకు దేవదత్తతో వివాహం

ఋతుచక్రం తిరుగుతోంది. ఒకనాడు గణపతి ఆమోద పట్టణానికి వచ్చి దేవలునితో మంత్రులతో మాట్లాడి పెండ్లి నిశ్చయం చేసికొంటానికి సూర్యుని కడకు పోదామన్నాడు. దేవలుడన్నీ మీరే జరపండి అన్నాడు. ఆయన మంత్రులతో సూర్యుని పట్టణానికిబోయి ప్రధానార్థం వచ్చామని తెలియపరచాడు. సూర్యుడు బంధువులను సమావేశ పరచాడు. పిల్లవైపువారు దేవలునికి పిల్లనిస్తామన్నారు. పిల్లవానివైపువారు పుచ్చుకొంటామన్నారు. లగ్నంకోసం బ్రహ్మదేవుని కడకు పోదామనుకొన్నారు. ఇరువైపుల వారు చందన తాంబూలాలు పుచ్చుకొన్నారు. తథాస్తు అని లేచారు.

గణపతి సూర్యుడు సత్యలోకం చేరుకొని బ్రహ్మకు నమస్కరించి దేవదత్తా దేవాంగులకు వివాహ ముహూర్తం పెట్టండి అని అర్థించారు. ఆయన వధూ వరుల తారాబల చంద్రబలాలను చూచి నేటికి ఎనిమిది రోజులకు అనగా వైశాఖ శుద్ధ పంచమీ సోమవారం నాడు రాత్రి 7 ఘడియలకుపైన దివ్యమైన ముహూర్తమున్నది. ఈ ధనుర్లగ్న పుష్కరకాలంలో వివాహం జరుపుకోండి అన్నాడు.

గణపతి సూర్యుడు సమ్మతి ప్రకటించి లగ్నపత్రికలు వ్రాయించారు. వారానందంతో తాంబూల సహితంగా లగ్న పత్రికయిచ్చి సరస్వతీ చతుర్ముఖులారా! ఆ దినం మీరు మీ సకుటుంబ బంధుమిత్ర పరివారంగా సూర్యలోకానికి విచ్చేసి కల్యాణ మహోత్సవంలో పాల్గొని వధూవరులను ఆశీర్వదించి మా సత్కారాలతో పాటు చందన తాంబూలాదులు స్వీకరించి మమ్మానందింపజేయ ప్రార్థిస్తున్నామన్నారు. అట్లే పులస్త్యాది నవబ్రహ్మలను, సనక సనందనాది బ్రహ్మర్షులను, నార దాది దేవర్షులను పెండ్లి కాహ్వానించారు.

వారు కైలాసం వెళ్లారు. శివ పార్వతులకు నమస్కరించి తాంబూల సహితంగా లగ్న పత్రికయిచ్చి దేవదత్తా దేవాంగుల పెండ్లి విషయం చెప్పి వివాహానికి రావలసినదిగా విన్నవించారు. ఏకాదశ రుద్రులను, నందీశ్వరాది ప్రమథ గణాలను ఆహ్వానించారు.

అట్లే వైకుంఠం వెళ్లారు. లక్ష్మీనారాయణులకు మ్రొక్కి లగ్న పత్రికయిచ్చి పెండ్లికి రావలసినదిగా చెప్పారు. గరుడ విష్వక్సేనాది ప్రముఖులకు, అంగిరసాది సప్తర్షులకు చెప్పారు. స్వర్గానికి పోయి ఇంద్రాదులకు చెప్పారు. దిక్పాలురకు చెప్పారు. అష్టవసువులకు చెప్పారు. గరుడ గంధర్వ యక్షకిన్నర కింపురుష సిద్ధ సాధ్య చారణ విద్యాధరాది వివిధ దేవ జాతుల వారికి సపరివారంగా పెండ్లికి రండని చెప్పారు.

సూర్యుడు పెండ్లి పనులకై యింటికి వచ్చి తన మంత్రులైన నందుడు ఉపనందుడను వారిని పంపి తక్కుంగల వారలకు చెప్పించాడు అట్లే గణపతి ప్రేరణతో దేవలుడు తనమంత్రులైన సుబుద్ధి కార్యదక్షులను వారిని పంపి చెప్పవలసిన వారందరికిని పెండ్లికి రండని చెప్పించాడు.

సూర్యుడు తనమామయైన విశ్వకర్మను రావించాడు ఆయన ఒక యోజనం విస్తీర్ణముండేటట్లు కల్యాణ మంటపావరణం కల్పించాడు. దానికి స్వర్ణ ప్రాకారం అమర్చాడు. పగడాల కంబాలు కూర్చాడు. వజ్రాల పలకలతో పైకప్పు చేర్చాడు. నవరత్నాలతో ముంజూరులు, పూదీవలు. బొమ్మలు సమకూర్చాడు. మరకత పుష్యరాగాది మణులతో ద్వారకవాటాదులు సిద్ధపరచాడు. ఎటు చూచినా కూర్చొని చూడటానికి యోగ్యమైన ఎత్తైన మంచెలు ఏర్పాటు చేశాడు. ఆ మంటపం మధ్యలో ముత్యాల జాలరులతో రత్న మయమైన కల్యాణ వేదిక వధూ వరులకోసం రమణీయంగా సిద్ధంచేశాడు. పెండ్లి వారికి కావలసిన విడిది గృహాలన్నో సర్వాంగ సుందరంగా నిర్మించాడు.

సూర్యుడుతన ప్రధానామాత్యుడైన వీరమార్తాండునికి కర్త వ్యాంశాలు చెప్పి చతురంగ బలాలతో మంగళవాద్యాలతో ఆమోద పట్టణానికి పంపించాడు. దేవలుని మంత్రులు సపరివారంగా మంగళ వాద్యాలతో ఎదురుగా బోయి సకల మర్యాదలతో ఆ వీర మార్తాండుని తోడ్కొని వచ్చారు. వీరమార్తాండుడు దేవలుని కలసి కొని నమస్కరించి రాజేంద్రా! ఇకలగ్న దినం మూడు రోజులే ఉన్నది. మా సూర్య దేవ మహారాజులుంగారు మిమ్ములను మీ బంధుమిత్ర పరివారం వారిని తోడ్కొని రమ్మని నన్ను పంపించారు. ప్రయాణానికి సిద్ధంకండి అన్నాడు. దేవలుడు మంత్రులతో ఆలోచించి కైలాసం వెళ్లాలిగదా! అన్నాడు. ఆయన వీరమార్తాండు నితో ఆర్యా! ఈ రోజు ప్రయాణం కుదురదు. రేపు ప్రాతఃకాలం మన ప్రయాణం అందాక ఉండండి అనిచెప్పి తాను కైలాసం వెళ్లి పార్వతీ పరమేశ్వరులకు ప్రణామం చేసి మీ చేతులతో ఈ బిడ్డకు పెండ్లి జరిపించండి. మనం రేపు ప్రభాతవేళ బయలుదేరి సూర్య పట్టణానికి వెళ్లాలి. మీ పనులు ముగించుకొని వెంటనే ఆమోద

పట్టణానికి రండని పిలిచాడు. అట్లే వాణీ హిరణ్య గర్భులకు, లక్ష్మీనారాయణులకు చెప్పాడు.

మరునాడు రేపకడ దేవలుడు పెండ్లి కొడుకై వీరమార్తాండుని పిలుపు మీద పెండ్లి పెద్దలతో పరివార జనంతో కలసి ముందు మంగళతూర్య వాద్యాలు మ్రోగుచుండగా ప్రయాణమై సూర్య లోకానికి వెళ్లాడు సూర్యదేవుడు మంత్రులతో పరివారంతో ఎదు రోక్కలు జరిపి తోడ్కొని వచ్చి, వచ్చిన పెండ్లి వారికి సకల మర్యా దలు జరిపి వారి వారికి యోగ్యమైన గృహాలలో విడియించి అన్ని వసతులు కల్పించాడు. సర్వలోకాలలోని ప్రముఖులు అచ్చటికి వచ్చారు. వారందరితో సూర్యలోకం విశ్వానికి సూక్ష్మ రూపమేమో అన్నట్లుంది.

మరుసటిదినం పార్వతి సరస్వతి లక్ష్మి మున్నగు ముత్తయిదు వులు దెవలునికి-సూర్యుని భార్యలైన పద్మిని ఛాయ మొదలగు ముత్తయిదువులు దేవదత్తకును అయిరేని కుండల్లోని కమ్మగొజ్జగి నీటితో మంగళస్నానాలు చేయించారు నవ్య శుభ్ర పట్టాంశుకాలు, రత్నాంబరాలు ధరింపజేశారు. తలలు దువ్వారు. పువ్వులుముడిచారు. నగలు తొడిగారు కళ్లకు కాటుక పెట్టారు. కల్యాణ తిలకం దిద్దారు. బుగ్గలకు చుక్కలు పెట్టారు. కాళ్లకు పారాణి పూశారు.

ఇంతలో సూర్యాస్తమానమయింది. నలువలకుల దివ్య మణి దీపమాలికా తోరణాలు వెలుగుతోన్నవి. లగ్నం సమీపిస్తోందని పెండ్లి పెద్దలు ఎవరి కార్యక్రమాలలో వారు నిమగ్నులై ఉన్నారు మంగళ తూర్యనాదాలు బోరుకొంటున్నవి. సూర్యకుటుంబంవారు పప్పు బియ్యం కట్నం వగైరాలతో దేవలుని కడకు వచ్చారు. దేవలుడు వాటిని పరిగ్రహించి యజ్ఞోపవీతాన్ని. తాళిబొట్టు

బొందును తయారు చేసి యిచ్చాడు ఆనాటినుండి ఇది దేవాంగులకు ఆచారమై ఉన్నది

దేవగురువు బృహస్పతి వేదవిప్రులు కల్యాణ వేదికపై పెండ్లి సంబారాలన్ని చేర్చి వరుని పిలిచారు. పార్వతీదేవి దేవలుని తీసికొని పోయి వేదిక మీద కూర్చుండ జేసింది. వేద మంత్రగానం ప్రారంభమయింది. విప్రులు దేవలుని ముంజేతికి దీక్షాకంకణం కట్టారు. తరువాత వధువుని పిలిచారు. పద్మినీదేవి ఛాయాదేవి దేవ దత్తను వేదిక చెంతకు తెచ్చారు. తెరపట్టారు. కన్యాదాన ప్రక్రియ జరిపారు. అటునిటు పెండ్లివారు వధూవరులకు నూత్న రత్నాం శుకాలను చదివించి కట్టబెట్టారు. వరునికి నూత్నయజ్ఞోపవీతం వేయిం చారు.కాళ్లుత్రొక్కించారు. అగ్నిప్రదక్షిణ చేయించారు. ముహూర్త వేళబెల్లం జీలకఱ్ఱ కలిపిన ముద్దలు వధూవరుల తలలపై పెట్టించి ఒండొరుల హస్తాంచలాలు నిలిపి ప్రమాణవాక్యాలు పలికించారు. పార్వతీ పరమేశ్వరులు, లక్ష్మీనారాయణులు, సరస్వతీ బ్రహ్మలు, పద్మినీ సూర్యులు స్పృశించిన మంగళ సూత్రాన్ని దేవలుడందుకొని దేవదత్తా కమనీయ కంఠసీమజేర్చి ముచ్చటగా మూడు ముడులు వేశాడు. నన్నని ముత్యాలు తలంబ్రాలు పోసికొని ఒకరి నొకరు మించి పోయారు. పురోహితులు నల్లపూసలదండ, మెట్టెలు వధువున కందించారు. సూర్యుడు బావమరదికి విలువగల భూషణాలు, ధన కనక వస్తు వాహనాదులు అరణంగా ఇచ్చాడు. అట్లే సముచిత వస్త్రాదికం, దాసదాసీ జనాన్ని చెల్లెలికి అరణంగా ఇచ్చాడు. పురో హితులు నవ వధూవరుల చేలాంచలాలకు బ్రహ్మముడులు వేయించి వారిచే నిత్య నవయౌవ నాంగులై ఆదర్శ దంపతులుగా ఉన్న ఉమా మహేశ్వరులకు మ్రొక్కించారు. ఆ పురాణ దంపతులు హర్షోత్క ర్షులై అన్యోన్య ప్రేమానురాగంతో పూవు తావిలా కలసి మెలసి జీవించండని దీవించారు. అయిదు రోజులు పెండ్లి వేడుకలు అతి

వైభవంగా జరిగాయి. కామధేనువు దివ్యమైన పంచభక్ష్య పరమాన్నాలు సమకూర్చి అన్నిరోజులందరికి భోజనాదులు నిర్వహించింది.

దేవలుడు పెండ్లికి వచ్చిన వారికందరికి పేరు పేరున పిలిచి దివ్యాంశుకాలను బహూకరించాడు. చివరిలో భైరవుడు అడుగు వస్త్రమని పేచీ పెట్టాడు. దాన్ని చింపి జమ్మిచెట్టు మీద వేశాడు. శివుడీవిషయం తెలిసికొని ఈ దురాగతానికి ఫలంగా జమ్మిచెట్టు క్రింద వసతి కల్పించుకొని నివసించుమని భైరవుని శపించాడు. తరువాత పెండ్లికి వచ్చినవారు సూర్యునికి దేవలునికి చెప్పి ఎవరి యింండ్లకు వారు వెళ్లారు. తదనంతరం దేవలుడు గూడ పద్మినీ ఛాయా సూర్యులకు, వారి బంధువులకు చెప్పి సెలవు తీసికొని తనభార్యయైన దేవదత్తతో ఆమోద పట్టణానికి తరలి వచ్చాడు. మంత్రులకు సామంతులకు దండనాథులకు రాజకీయోద్యోగులకు ప్రజానాయకులకు ప్రజలందరికి విందు భోజనాలేర్పాటు చేశాడు. ప్రజలు పంచభక్ష్య పరమాన్నము లారగించి పచ్చకప్రపు వీడ్యములు నములుతూ దేవలుడుశివజ్యోతిస్సముద్భవుడనీ, దేవదత్త సూర్యసోదరి అగుటచే తేజోవతియని ఈ నవరాజదంపతులకు తేజోమయులైన పుత్రులు కలగాలని దీవించారు. తరువాత దేవలుడు దేవదత్త అనుమతితో ఆదిశేషుని పుత్రిక చంద్రరేఖను గూడ భార్యగా స్వీకరించాడు.

## త్రయోదశాధ్యాయం-దేవలుని ప్రజాపాలన-సంతానం

ఆ రాజర్షి ధర్మానుసారియై మంత్రుల సలహాలతో రాజ్యపాలన చేస్తున్నాడు. ఆయనపాలన దేవేంద్రుని పాలనవలె ఉన్నది ఆయన రాజ్యం స్వర్గరాజ్యాన్ని తలపిస్తోంది. ఆ భూమీశుడు ప్రజలను కన్న బిడ్డల్లా చూచు కొంటున్నాడు. ఆ ప్రజలు దేవల దంపతులను

తల్లి దండ్రులుగా భావిస్తున్నారు. రాజశాసనాలను శ్రద్ధా భక్తులతో ఔదల దాల్చుతున్నారు. అందగాడు బుద్ధిమంతుడైన రాజోద్యోగిని భర్తగా పొందిన స్త్రీ వలె భూమి దేవలుని అధిపతిగా బడసి ఆనందిస్తోన్నది. ధర్మదేవత నాల్గుపాదాలతో నడుస్తోన్నది. స్త్రీలు పతివ్రతలుగా పురుషులు పత్నీవ్రతులుగా ఉంటున్నారు. నెలకు మూడు వానలు కురుస్తున్నాయి మెట్ట మాగాణి భూములు సస్యశ్యామలములై ముక్కారు పంటలు పండుతున్నాయి. అరణ్యాలు ఓషధీ సమృద్ధాలై పశుపక్ష్యాదులకుఆశ్రయాలై నేత్రోత్సవంగా పచ్చనై నిత్యమూపుష్పిస్తూ ఫలిస్తూ కలకల లాడుతున్నాయి. మానవులలో వృత్తులను బట్టి కుల వర్గాలున్నా అందరూ ఒకజాతిగా మానవ జాతిగా, దైవ సంతానంగా భావించి ఐకమత్యంతో జీవిస్తున్నారు. అందరూ విద్యా వినయ సంపన్నులై చతుష్షష్టికళలను సాధించువారై ఉన్నారు. పెద్దా చిన్నా, జ్ఞానులు అజ్ఞానులు అనే తారతమ్య భావనలే గాని వారికి వ్యక్తిగత భేద దృష్టి, దోషదృష్టి లేనే లేదు.

బ్రాహ్మణులు తపస్సు, యజ్ఞయాగాలు చేస్తూ మానవజాతికి తోడ్పడుతుండేవారు. క్షత్రియులు బలపరాక్రమాలతో రాజ్య రక్షణకు సహాయ పడుతుండేవారు. వైశ్యులు వర్తకవాణిజ్యాలతో వస్తుసేకరణచేసి న్యాయపద్ధతితో వాటిని ప్రజలకు సరఫరా చేస్తుండే వారు. శూద్రులు కృషిచేసి పంటలు పండిస్తూ పశుపోషణ చేస్తుండే వారు. వారిలో వృత్తిభేదమేగాని వ్యక్తిభేదంలేదు. ఆ రాజ్యంలో ధన ధాన్యాలు, విద్యా వినయ వివేకాలు సంపూర్ణంగా ఉన్నాయి. ఏ యింటనైన వస్తు దారిద్ర్యంలేదు. ఏ ఊరనైన బిచ్చగాడులేడు. కుంటి గ్రుడ్డి చెవిటి మూగ రోగిలేనేలేరు. కల్లాకపటంలేదు. జార చోరులులేరు నగర గ్రామాలలో వైద్యాలయాలు, న్యాయస్థానాలు ఊరక అలంకారప్రాయాలై ఉన్నాయి.

దేవలుడు తన రాజ్యంలో శైవమత పీఠాలు స్థాపించి సాధనా సిద్ధులైన మహనీయులను పీఠాధి పతులుగా నియమించాడు. తాను రాజధానిని కేంద్రంగా చేసికొని సర్వాధ్యక్షుడై శివాద్వైత మత ప్రచారం సాగించాడు. శివశివ అనువాడు తిరుగబడి వశి అవుతాడు అనగా మనో విజయం పొందుతాడు. అంటే మనసు పొరవిడి ఆత్మ స్వరూపుడౌతాడు. వశియైనవాడు మళ్లీతిరుగబడి జీవభ్రాంతి పోయి సాక్షాత్ శివుడే అవుతాడు. అందుకు సాధన కావాలి.

శివ పరబ్రహ్మమే అంతట నున్నది; నిష్క్రియావస్థతో అద్వితీయమై పరిపూర్ణమై ఉన్నది. ఆ శివ పరబ్రహ్మం తేజోమయ శక్తితో జ్యోతిర్బిందువై ఉన్నది. ఆ శివ పరబ్రహ్మం తాత్త్వికంగా ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తిసమన్వితమై సత్క్రియావస్థతో మహాలింగమై ఉన్నది. ఆ శివ పరబ్రహ్మం గంగా జటా జూట చంద్రశేఖర రూపంతో ప్రపంచాభిముఖమై ఉమా మహేశ్వర అర్ధనారీశ్వర భావమై ఉన్నది.

శివుడు చంద్రశేఖరుడై ఉండుట రూపస్థితి. ఆ శివుడు మహాలింగముగా ఉండుట అరూపస్థితి ఆ శివుడు ఆత్మావలోకన ధ్యాన యోగ సమాధిలో ఉండుట రూపారూపస్థితి. ఆ శివుడు నిరుపాధికమై అంతా తానై యుండుట పరిపూర్ణస్థితి.

సాధకుడైనభక్తుడు కర్మ భక్తి జ్ఞాన ధ్యానయోగాలతో క్రమాభివృద్ధి గాంచుతూ ఉన్నత యోగ భూమికలను అధిరోహించి పరిపూర్ణతాస్థితికి చేరుకోవాలి. అప్పుడే అతడు "శివోఽహమ్" అనుకొంటానికియోగ్యుడు. అట్టివాడే లోకంలో జీవన్ముక్తుడనిపించుకొంటాడు.

పంచభూతలింగాలున్నవి. ఆకాశమొకలింగం. అది శివ స్వరూపంగూడ. కావుననే ప్రతిమాసం కృష్ణపక్ష చతుర్దశి తెల్లవారు

జామున చంద్రరేఖ ఆకాశరూప శివునికి శిరోభూషణమౌతుంది. పృధి వ్యప్తేజో వాయ్వాకాశాలు సూర్యచంద్రులు ఆత్మ అష్టతనువులై శివుడు అష్టమూర్తి అగుచున్నాడు. ఈ విధంగా విశ్వమంతా శివ స్వరూపం, శివమయమౌతుంది.

శివుడు శక్తి వేరుగాదు. తత్త్వమొక్కటే. శివుడానంద మయుడు. శక్తి స్పందనాచేతనాత్మకమైనది. సత్యమైన చిత్ ఆనంద ములతో శివుడు సచ్చిదానందుడై ఉన్నాడు సౌందర్యమంతా శక్తి యైన అమ్మవారిదే కావుననే "సత్యం శివం సుందరమ్" అనుమాట వచ్చింది. జీవన్ముక్తునికి ఈ లోకంలోని ప్రత్యక్షరూపం, ప్రతి మహద్రూపం సత్యం శివం సుందరమ్మయి కనిపిస్తుంది.

కొందరు సాధకులు శివప్రాధాన్యంగా శివాద్వైతాన్ని భావి స్తారు. మరి కొందరు శక్తిప్రాధాన్యంగా శివాద్వైతాన్ని భావిస్తారు. శివాభిధానం పార్వతీ పరమేశ్వరులకు సమానమే రుచిభేదంతో ఎవరెట్లు భావించినా వస్తువొక్కటే.

జ్యోతినంటి తేజస్సుంటుంది. పూవునంటి తావి ఉంటుంది. ముత్తెంలో నైగనిగ్యముంటుంది. అట్లే శివశక్తులు కలిసే ఉంటారు. తాత్త్వికులు పార్వతీ పరమేశ్వరులకు ఒకే దేహం అర్ధనారీశ్వర రూపమంటారు. శివభగవానుడు శాంతి సాగరుడు. ఆనంద సాగ రుడు. జ్ఞానసాగరుడు. ప్రేమసాగరుడు. ఆ శివపరమాత్మ స్పందించి నపుడు ఆయన నుండి శక్తి ప్రవాహం బయలుదేరి పంచభూతాత్మక ప్రపంచంగా పరిణమిస్తుంది. శివుని అంశయే జీవుడు. శివుడు సర్వ జ్ఞుడు; జీవుడల్పజ్ఞుడు. శివుడు సేవ్యుడు; జీవుడు సేవకుడు. జీవుడు భక్తస్థలమహేశస్థల, ప్రసాదిస్థల, ప్రాణలింగిస్థల, శరణస్థల, ఐక్య స్థలములనెడి ఆరుసోపానా లెక్కి సమ్యక్ జ్ఞానంతో ఆత్మసాధ శిఖ రాగ్రమునన్నిల్చి శివసాక్షాత్కారం పొందాలి.

శివజీవైక్య సమాధియోగం పొందిన వానికి పునర్జన్మ ఉండదు. వాడు అమృతత్వం పొందుతాడు. అఖండ పరమ శివ సాగరంలో లీనమౌతాడు. సాగరంనుండి పాత్రతో తీసిన జలం కాలక్రమాన చెడిపోతుంది. అజలమే సాగరంలో కలసి ఉంటే అఖండ సాగర జలమై నిత్యం పరిశుద్ధంగా ఉంటుంది.

కాముడు జన్మకారకుడు. కాలుడు మృత్యుకారకుడు. కాముని కాలుని జయించిన వాడు శివభగవానుడు ఆ స్వామికి భక్తుడు తనను అంటుగట్టు కొంటే ఆ స్థితియే తనకు కల్గుతుంది ఆ దేవుని వలె జీవుడు ఊర్ధ్వరేతస్కుడైతే జ్ఞానపాలనేత్రం వికసిస్తుంది. భక్తులు విభూతి పెట్టుకోవాలి. రుద్రాక్షమాలలు వేసికోవాలి. యజ్ఞోప వీతం, శివలింగం ధరించాలి శివ పంచాక్షరి జపించాలి. గాయత్రిని జపించాలి. కుండలినీయోగంతో సహస్రారకమలమందలి శివ లింగాన్ని పూజించాలి. లేదా, యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణాధ్యాన సమాధులనే అష్టాంగ యోగ సరణినైన శివపూజచేసి శివానుగ్రహంతో మోక్షం పొందాలి. ప్రతి వారికిది లక్ష్యమై ఉండాలని దేవలుడు బోధించేవాడు.

నవదంపతులైన దేవదత్తా దేవల ధర్మకామ చూత వృక్షం పుష్పించి మూడుకాయలు కాచింది. మొదటివాడు దివ్యాంగుడు. రెండవవాడు విమలాంగుడు. మూడవవాడు ధవళాంగుడు. వారు ముప్పురు త్రేతాగ్నులవలె తేజోమూర్తులు. త్రిమూర్తుల వలె మహి మాన్వితులు దేవలునకు ఆదిశేషుని పుత్రికయైన చంద్రరేఖ యందును సుధర్ముడను వాడు జన్మించాడు. ఈతడు మహా బలాఢ్యుడు సర్వలక్షణ సంపన్నుడు. ఈ నలుగురు ధర్మార్థకామ మోక్షాలవలె ఉన్నారు. తండ్రి వారికి జాత కర్మాది సంస్కారాలు కావించాడు. వారు శుక్ల పక్ష చంద్రునిలా దినదిన ప్రవర్ధమాన

శరీరులై విద్యాబుద్ధులు నేర్వసాగారు. ఎనిమిదవ యేట ఉప నయనం జరిపి వేదాధ్యయనం చేయించాడు. వారు సర్వశాస్త్రాలు చదివారు. క్షత్రియ విద్యలు నేర్చారు. ధర్మ పక్షావలంబులయ్యారు. క్రమంగా యౌవన వంతులయ్యారు. సూర్యుని ప్రేరణచేత తండ్రి సూర్య పుత్రికలైన స్వర్ణ ప్రభను దివ్యాంగునకు, పద్మాక్షిని విమలాంగునకు, చపలాక్షిని ధవళాంగునకు తీసికొని పెండ్లి కావించాడు. పెద్దవాడైన దివ్యాంగునకు యౌవరాజ్య పట్టాభిషేకం జరిపాడు. దేవల దంపతులు క్రొత్తజంటలైన కొడుకులలోను కోడండ్రలోను తమప్రతిబింబ రూప చేష్టలు గుర్తిస్తూ ముద్దు మురిపాలతో హాయిగా సుఖజీవనం చేస్తున్నారు.

దేవలుడు శైవ మత వ్యాప్తికోసం ప్రజల్లోకి బాగా చొరబడి ఊరూర తిరుగుతున్నాడు. శివాలయాలు నెలకొల్పుతున్నాడు. దేవలుని శాంత స్వభావం, భక్తిభావం. స్వచ్ఛంద ప్రజాసేవానిరతి కరూశదేశాధిపతియైన శూరసేనునికి చులకన అయింది. అతడేదో విధంగా నగర రాజ్యాన్ని కైవసం చేసికోవాలని దుష్టుల్ని ప్రేరేపించి ధనాశచూపి రాజ్యంలో కల్లోలాలు సృష్టించాడు. దేవలుడీ విషయం తెలుసుకొని చంద్రరేఖ కొడుకైన సుధర్ముని వెంట బెట్టుకొని పోయి కరూశ దేశంపై దండెత్తి శూరసేన మహారాజును హతమార్చి కరూశదేశాన్ని స్వాధీనం చేసికొన్నాడు. ఆ దేశ రాజధానియైన పుండరీక పురంలో చిన్నకొడుకైన సుధర్మునికి పట్టాభిషేకం జరిపాడు సుధర్ముడు సుధర్ముడై తండ్రి వలె రాజ్యపాలన చేయసాగాడు. అవంతి మహారాజు సుధర్ముని సుగుణ గణాలకు మెచ్చుకొని తన పుత్రికయైన పుష్కలను ఇచ్చి పెండ్లి జరిపాడు. ఈ విధంగా దేవలుడు అభ్యుదయ పరంపరాభివృద్ధులతో ఐశ్వర్యంతో తులతూగుతూ రాజ్యపాలన సాగిస్తున్నాడు. కొడుకులు సద్గుణాలతో తండ్రిని మరపిస్తున్నారు లోకులను మురిపిస్తున్నారు.

# చతుర్దశాధ్యాయం-వీర మాహేంద్రపుర రాక్షసుల విజృంభణం

అందరికి వస్త్రాలందినవి. రాక్షసులకందలేదు. దేవతలలో కొందరు సువర్ణ వస్త్రాలంకృతదేహులై రాక్షసులను పరిహసిస్తున్నారు. ఇది వారికి దుస్సహమైనది అసలు వస్త్రాలీయనీకుండ దేవతలు దేవలువి వారించారనీ, అలా వారించినంత మాత్రాన అతడన్ని లోకాలవారికి వస్త్రాలిచ్చి తమకీయక పొగరు బోతుతనం ప్రదర్శించాడనీ వీర మాహేంద్ర పురరాక్షసులు తుకతుక ఉడికి పోతున్నారు. వారి ప్రభువు వజ్ర దంష్ట్రుడు, వాని తమ్ములు వ్యాఘ్రవక్త్రుడు, సర్పజిహ్వుడు రహస్య మందిరంలో సమాలోచనలు జరిపి అకస్మికంగా స్వర్గరాజ్యంపై దండెత్తారు.

## పంచదశాధ్యాయం

ఇంద్రుడు ఐరావతగజాన్ని ఎక్కి అపారసేనా వాహినులతో వచ్చి రాక్షసులను ఢీకొన్నాడు. ఇరువాగులవారు సమరసంరంభంతో పిరుతివియక వీరా వేశంతో పోరాడారు. రాక్షసులు ద్విగుణీకృతోత్సాహంతో దొమ్మియుద్ధానికి తలపడ్డారు. వారి మారణాయుధ ప్రహారాలకు దేవతా సేనలు అర్ధభాగం హతమై పోయారు. చతుర్థాంశంమంది క్షతగాత్రులయ్యారు. ఈ విపరీత విపత్కర పరిస్థితులకు ఇంద్రుడు పరితపించాడు. ఇంతలో ప్రొద్దుక్రుంకింది. వజ్రదంష్ట్రుడు భద్రేభంపై వచ్చి సేనాముఖ భాగంలో నిలిచి ఓరీ, ఇంద్రా! నీ సేనల్లో సగం మంది చచ్చారు. ఒక పాతిక భాగం అవయవాలు తెగి కొట్టు మిట్టాడుతున్నారు. వారు నీకు పనికిరారు. మిగిలిన పాతిక భాగం మరణభయంతో రేపు యుద్ధానికిరారు. కాబట్టి నీవేకాకివి గనుక, మేము రేపు నిన్ను పెడరెక్కలు విరిచి కట్టి వేయడం ఖాయం. ఒక వేళ నీవు వెరచి రాత్రి పారిపోతే, రేపు నీ స్వర్గాన్ని

స్వాధీనం చేసి కోవడంఖాయం. ఇప్పుడే నిన్ను బంధించవచ్చు గాని ప్రొద్దు క్రుంకింది. సమర ధర్మం ఉజ్జగించే చవటలంకాము. ఇంతకూ దేవలుడిచ్చిన వస్త్రాలు కట్టుకొని క్రొవ్వెక్కి మమ్మల్ని పరిహసించిన ఫలితమిది. అని నీకిప్పటికి తెలిసే ఉంటుంది.

అందరికి దేవలుని చేత వస్త్రాలిప్పించి మాకీయవద్దని చెప్తావా? చెప్తే మాత్రం అతడు మాకీయ కుండా ఉంటాడా? ఎంత పొగరు? అందుకనే ముందు మీ సంగతి తేల్చుకొని ఆపై వాని పని పట్టాలను కొంటున్నాము సరే. ఒరే అబ్బాయీ! చాల అలసి సొలసి ఉన్నావు. ఇక బుఱ్ఱ వంచుకొని ఇంటికి పో. బువ్వతిని బబ్బో·ఊ(...ఏనుగును వెనక్కు త్రిప్పుకొమ్మన్నాడు. ఏమంటే ఏమికీడు మూడుతుందో అని కిమ్మనకుండా ఇంద్రుడు తిరిగి చల్లగా అమరావతికి జారుకున్నాడు.

రాత్రి ఇంద్రుడు బృహస్పతిని తోడు చేసికొని ఆమోద పట్టణానికి వెళ్లి దేవలుని వద్ద వజ్రదంష్ట్రుని మాటలు ఏకరువు పెట్టాడు. బృహస్పతి నాయనా! నీ సహాయం అభ్యర్థిస్తున్నామన్నాడు. దేవలుడు విని ఆచార్య వర్య! ఇందులో సహాయమేమున్నది? రాక్షసులు నా పైకి గూడ రాబూనుకొని ఉన్నారు గదా! ఈ యుద్ధంలో నేనూ భాగస్వామినౌతాను దేవేంద్రా! నీవు చెపితే విని వారికి వస్త్రాలీయకుండుటకాదు. శత్రుత్వం పురస్కరించుకొని అది వారికి కల్గిన ఊహ. అనాడు నేను నూలు తెస్తున్నప్పుడు రాక్షసులు నన్ను చంపాలని యత్నించారు. అందుచేత వారి యిండ్లకు పోయి వస్త్రాలీయడానికి నా మనస్సొప్పలేదు. అంతేగాని, ఒక రీయవద్దని చెప్పలేదు; నేను మానలేదు; వారు వచ్చి అడిగితే వస్త్రాలీయడానికి ఎప్పుడైనా నాకభ్యంతరంలేదు అయినా, వారిపుడు నాపై కత్తి కట్టారు గదా! రాక్షసులు నా మీదికి వచ్చేదాక నేనూర కుండుట దేనికి?

నేనే ముందు వారిని చెలగుతాను. రేపటి యుద్ధానికి నేను తప్పక వస్తాను. మీకు సాయపడతాను. అనిసాంత్వన వచనాలు చెప్పి పంపించాడు.

## దేవలుడు దేవేంద్రునికి బాసటగా వచ్చి రాక్షసులతో పోరాడుట

ఆ రాత్రి దేవలుడు బయలుదేరి స్వర్గ రాజధాని అమరావతికి చేరుకొన్నాడు. తెల్లవారింది. ఇంద్రుడు అపరంజికొండ అందుకొన్నంత సంబరంతో ఆయనకు స్వాగత సత్కారాలు జరిపాడు. దేవలుని రాకతో దేవతలందరు సమరోత్సాహంతో కత్తులు పైకెత్తి ఉన్మత్తుల్లా హుంకారాలు చేస్తూ ఊగిపోతున్నారు. యుద్ధభేరీ భాంకారాలు మిన్ను ముట్టాయి. మదపుటేనుగుల ఘీంకారాలు దిక్కుడ్యాలను ముక్క చెక్కలు చేస్తున్నాయి. జవనాశ్వదళ హేషలు, రథ చక్రనేమి ఘట్టన ఘోషలు చెవులకు చిల్లులు పడజేస్తున్నాయి. ఈ విధంగా దేవతలు చతురంగ బలాలతో రణ భూమికి వస్తున్నారు.

వజ్ర దంష్ట్రాసురుడు అమరుల సమర సంరంభం చూచి ఇంద్రునికి కాళ్లు తెచ్చింది దేవలుడని గూఢచారులవలన తెలిసికొన్నాడు. తాను చతురంగ బలాలతో రణ భూమికి వచ్చాడు. అడబోయిన తీర్థమెదురయింది. వెదుక బోయిన తీగ కాలికి తగిలింది. దేవల దేవేంద్రులను ఒకేవేళ ఒకేచోట పట్టి కట్టివేసే అవకాశం కలిగిందని సంతసిస్తూ వజ్ర దంష్ట్రరాక్షసేంద్రుడు, వాని తమ్ములు ధూమ్రవక్త్రుడు సర్పజిహ్వుడు, కుమారులు సూర్యకోపుడు అగ్నికోపుడు, మేనల్లురు ధూమ్రనేత్ర ఖడ్గజిహ్వులు మహోత్సాహంతో సేనలను చక్రవ్యూహంగా తీర్చారు.

దేవలుడు దేవతా సైన్యంలోని మెరికలవంటి వారిని ఎన్ను కొని ముందుకు తెచ్చి రధికులను రధికులతో, హాస్తికులను హాస్తికులతో, అశ్వికులను అశ్వికులతో, పదాతులను పదాతులతో మోహరింప జేసి తాను సేనాగ్రభాగాన నిల్చి దివ్య శంఖాన్ని పూరించాడు. ఇంద్రాదులును తమతమ శంఖాలను పూరించారు అట్లే రాక్షససేనా వాహినిలో ప్రతిగా శంఖధ్వానాలు భూంకరించాయి

## షోడశ, సప్తదశాధ్యాయాలు

వజ్రదంష్ట్రాసురుడు రథాధిరూఢుడై దేవలుని కెదురుగా వచ్చి మహాశయా! వస్త్రకారునికీ వస్త్రాలకూ ఇంతవరకు క్షేమమను కొంటాను. సురాసురులు ఒక తండ్రి బిడ్డలని, అన్నదమ్ములని నీకు తెలుసుగదా! మా కుటుంబ కలహంలో భూలోక వాసివి వచ్చి ఊరక తల దూర్చడం ఏమి మర్యాద? అన్నాడు.

దేవలుడు నవ్వుతూ రాక్షసేశ్వరా! నీకూ నీ సైన్యానికి ఇంత వరకు క్షేమమనుకొంటాను. సురాసురులు ఒక తండ్రి బిడ్డలే కావచ్చు. కాని, ఏనాడైనా మీరొక కుటుంబంగా ఒక చోట ఉండి మనగలిగారా? పోనీ, మీది ఒక కుటుంబమే అయితే నిన్న జరిగిన ఘోరమారణ సంగ్రామ హోమానికి అర్ధమేమిటి? మీరేమి కొట్టు కోలేదు; చంపుకోనూలేదు. తిట్టుకొన్నారనుకొంటాము. నిన్న మీ అన్నదమ్ముల ప్రసంగంలో ఈ దేవలుని పని పడతామనే ప్రసక్తి ఎందుకు వచ్చింది? అన్నాడు. వజ్రదంష్ట్రుడు అదా? అవసరమైంది అసలీయుద్ధానికి నీవే మూల కారణం. నీవు వస్త్రస్రష్టవై దేవతలకు వస్త్రాలిచ్చావు. మా రాక్షసుల కెందుకీయలేదు? అన్నాడు. దేవలుడు ఇది అడుగవలసిన ప్రశ్నయే మీ రాక్షసులే అయిన నైరుతి మూలాధిపతికిచ్చాను ప్రజలకిచ్చాను. మీరడిగితే వస్త్రా

లీయడానికి ఇప్పుడైనా నాకభ్యంతరం లేదన్నాడు. వజ్రదంష్ట్రుడు చురచుర చూస్తూ ఊఁ...అడిగితేనే దేవతల కిచ్చావా? అన్నాడు.

దేవలుడు నవ్వి వారడగక పోయినా ఇంటికిపోయి ఇచ్చాను. వారు మొదటి నుండి నా యోగక్షేమాలు కోరేవారై ఉన్నారు. ఇక మీ రాక్షస జాతివారు నేను నూలు తెచ్చేటప్పుడే అడ్డగించి నన్ను చంపవచ్చారు. నేనేమొగంతో మీ యిండ్లకు వచ్చి వస్త్రాలీయగలుగుతాను? అన్నాడు వజ్రదంష్ట్రుడు అదా సందేహం? అడ్డగించిన వారు హతమై పోయారు. మేము వచ్చి నిన్నడ్డగించలేదుగదా? మాకెందుకీయలేదంటున్నాను శివాజ్ఞ అందరికి వస్త్రాలీయమని గాని ఒక పక్షం వారికిచ్చి మరొక పక్షంవారికి మానమని కాదుగదా! నీవు పక్షపాతివి. దేవతా పక్షపాతివి అన్నాడు. దేవలుడు : కాదు కాదు. అందరి కోసమే వస్త్రసృష్టి చేశాను. అన్నాడు. వజ్రదంష్ట్రుడు : చేశావు. కాని, ఇంద్రుని ఒత్తిడిచేత రాక్షసులకీయడం మాని వేశానంటావు. దేవలుడు : శుద్ధాబద్ధం. శత్రుత్వం చేత నీ వలా ఊహిస్తున్నావు అది నిజంకాదు. మీ రడిగితే వస్త్రాలీయడానికి నాకభ్యంతరం లేదని ముందే చెప్పానుగదా! మీ యిండ్లకు రావడానికి నా మనస్సంకోచమొక్కటే కారణం. అడిగితే ఎప్పుడైనా ఇస్తాను. అన్నాడు.

వజ్రదంష్ట్రుడు : మేము యాచకుల్లాగా అడగాలా? అడుక్కుంటానికి మేము యాచకులం కాము. వస్త్రప్రదానంలో ఇతరులకొక సూత్రం; మాకొక సూత్రమా? ఈ పాఠం నేర్చి వల్లిస్తున్నావు అన్నాడు. దేవలుడు : ఎవరు నేర్పారని నీ యుద్దేశ్యం అన్నాడు. వజ్రదంష్ట్రుడు : దేవతలు అన్నాడు. దేవలుడు : ఒకరు చెప్పినట్లు చేయడానికి నేను కీలుబొమ్మనను కొంటున్నావా? అన్నాడు వజ్రదంష్ట్రుడు : అనుకోవడమేకాదు; కనులార చూస్తున్నాను అందుకు దృష్టాంతం దేవతల కొమ్ముకాయడానికి నీ విపుడు మా

పైకి కత్తిగట్టి రావడమే అన్నారు. దేవలుడు : సజ్జన పక్షపాతం మాదృశులకు సమ్మతమే అన్నాడు. వజ్రదంష్ట్రుడు : అహ్హాహ్హా!!... ఎవరా సజ్జనులు? ఈ దేవతలా సజ్జనులు? రంభా ప్రయోగం చేసి నిన్ను శాపగ్రస్తుని కావించిన ఈ దేవతలు నీ కంటికి సజ్జనులుగా కనిపిస్తున్నారా? నల్లనివన్నీ నీళ్లూ, తెల్లనివన్నీపాలని భావించే అమాయికుడవు బాలుడవు అన్నాడు. దేవలుడు : ఒకవేళ వారు రంభా ప్రయోగం చేసినా, నా స్వచ్ఛంద శీలం లోకానికి ప్రకటిత మయింది. ఇపుడు నా బలమేపాటిదో మీవలన ప్రకటితం కావలసి ఉన్నది. ఈ పరిస్థితిలో దేవతలే నాకు సహాయంగా నిలిచారను కొంటున్నాను. నీవూ నీ వారూ నన్ను బంధించాలను కొంటున్నారు గదా! నేను బలహీనుడనైతే మీకు చిక్కుతాను బలవంతుడనైతే, పెనుగాలి ఎండుటాకుల్ని వలె మిమ్మల్ని తరిమి కొడతాను అన్నాడు.

వజ్రదంష్ట్రుడు : నీవు దేవతలకు కొరముట్టుగా ఉపయోగ పడుతూ నీకు వారేసాయంగా నిలిచారంటున్నావు. నీవు బాలుడవని ముందేచెప్పాను. వారు నిన్న చిత్తుగ నేలకరిచారు. ఇకపోతే, నీకు తరిమికొట్టే సత్తాలేదు. గనుక, నీవు మాకు చిక్కడంఖాయం. తరు వాత బంధితుడవై భాధపడేకంటే, ఇపుడే మా పక్షంలో చేరిపో. సర్వవేళలా సర్వస్థలములలో నీ సంరక్షణబాధ్యత మేము వహి స్తాము. ఈగనైన వాలనీయమన్నాడు.

దేవలుడు నీకు భేదోపాయ పాండిత్యం అపారంగా ఉన్నది. నీవు పట్టికోతలరాయుడుగా ఉన్నావు. ఇక నీవాగుడు కట్టిపెట్టు. నేను బాలుడనో, మీ పాలిటి కాలుడనో క్షణంలో తెలుసుకొంటావు. కదనరంగంలో నోటివాడిగాక, ఈటెవాడి చూపడం వీరుని లక్షణం. ఇదిగో నా తొలిబాణం. కాచుకో అని ప్రయోగించి వజ్రదంష్ట్రుని

రథధ్వజ పతాకాన్ని పడగొట్టాడు. శర పరంపరలు గుప్పి గుఱ్ఱాలను సారథిని తెగటార్చాడు. రాక్షసరాజ ధనుర్విముక్త బాణాలు మధ్య లోనే తుత్తుమురై పోతున్నాయి. దేవలుని శస్త్రాస్త్రప్రయోగచాతుర్యం దానవసేనలకు విభ్రాంతి కల్గించింది. అన్నివైపుల పోరు ముమ్మర మైంది.

వజ్రదంష్ట్రుడు కుపితుడయ్యాడు. సహజ యుద్ధంలో వీణ్ణి సాధించడం కష్టం. మాయా యుద్ధంలోనే వీణ్ణి మట్టుబెట్టాలి. కాలుబెట్టి నేలరాయాలి. అని ఆలోచించి అంతలోనే అదృశ్యు డయ్యాడు. మాయా బలంతో నీలమేఘమై గర్జిస్తూ పిడుగుల వర్షం, బండరాళ్ల వర్షం, బాణ వర్షం కురిపించసాగాడు. ఆ ఉత్పాతానికి దేవతలలో హాహాకారాలు పుట్టాయి. ఎందరో చచ్చిపోతున్నారు. మరెందరో కాందిశీకులై పారిపోతున్నారు. అప్పుడు దేవలుడు శివుని ధ్యానించి సమంత్రకంగా నందిధ్వజాయుధాన్ని ప్రయోగించాడు.

అది బ్రహ్మాండం దద్దరిల్లేటట్లు మహా భయంకరంగా గర్జిస్తూ బయలుదేరి వజ్రదంష్ట్రుని మాయా యవనికను విధ్వంసంచేసి, తన నుండి అనేక శస్త్రాస్త్రాలను యంత్రవృషభాలను సృష్టించుకొంటూ దానవసేనలపైబడి ఎక్కడ చూచినా తానై మారిమసగినట్లు మారణ హింసాకాండను కొనసాగించింది. ఆ నంది ధ్వజాయుధ ప్రహారాలకు అసురులెందరో ఉసురులుడిగారు. చావుతప్పి కన్నులొట్టపోయి వజ్ర దంష్ట్రుడు, వాని తమ్ములు, కుమారులు, మేనల్లుళ్లు ఎట్లో తప్పించు కొని ప్రాణాలరచేత పెట్టుకొని, ఇది సమయం కాదని చావగా మిగి లిన వారిని చాపచుట్టి చంక బెట్టుకొన్నట్లు వెంట బెట్టుకొని నిజ నగరానికి పారి పోయారు.

అది చూచి ఇంద్రాది దేవతలు విజయోత్సాహంతో విజయ దుందుభులు మ్రోయింప జేస్తూ అమరావతికి తరలి వచ్చారు. అచట దేవలుని ఊరేగించి సముచిత సత్కారాలు జరిపారు. అంతట దేవలుడు ఇంద్రుని వద్ద సెలవు తీసికొని ఆమోద పట్టణానికి వెళ్లాడు.

## అష్టాదశాధ్యాయం

ఇంతవరకు రాక్షసులు ఒక్క శ్రీ మహావిష్ణునికే భయపడుతుండేవారు. ఇపుడు దేవలుని నామం వింటేనే వారి గుండెల్లో గుబ్బాలు పరుగెడుతున్నాయి. నేత నేసికొనే దేవలునికి ఇంత గొప్పతనం ఎలా వచ్చింది? నందిధ్వజం వలన కాదా? ఆనందిధ్వజ మహా మారణాయుధం దేవలహస్త వినిర్ముక్తమై రాక్షసజాతి నాశనం చేస్తుంటే నాయకులందరూ గ్రుడ్లప్పగించి చూచారేగాని, ఒక్కరైనా ప్రతిక్రియకు సన్నద్ధులు కాలేకపోయారు. ఈ అవమానం అగ్నిజ్వాలలా వారిని దహించి వేస్తున్నది. అందుచేతనే వజ్రదంష్ట్రుని ప్రేరణవలన వాని బావమఱది విద్యుత్కేశుడు నందిధ్వజాయుధాపహరణకు ఉద్యమించాడు.

వాడు మారు వేషంతో ఆమోద పట్టణానికి వచ్చి దేవదూతనని దేవలుని సందర్శించి మహారాజా! రాక్షసులు మరల అమరావతిని ముట్టడించారు. ఈ విషయం మీకు మనవి చేయుమన్నాడు మా దేవేంద్రుడు. మీ కిక్కడ అవసరమైన పనులుంటే అడిగి మీ నంది ధ్వజాన్నైనా పుచ్చుకొని రమ్మని నన్ను పంపించాడు అని విన్నవించాడు. అప్పటికి రాజకార్యాలలో నిమగ్నుడై ఉన్న దేవలుడు అట్లే అని నందిధ్వజ ప్రయోగ రహస్యం చెప్పి దాన్ని వానికిచ్చాడు. విద్యుత్కేశుడు లొట్టలేసుకొంటూ దాన్నికొని పోయి వజ్రదంష్ట్రుని కిచ్చాడు. ఆదానవనాథుడు తత్క్షణమే రణభేరి వేయించి స్వర్గాన్ని ముట్టడించాడు.

ఇంద్రుడీవిషయం తెలిపి ఉన్నవాడున్నట్లు దేవలుని నంది ధ్వజంతో వెంట బెట్టుకొని రమ్మని దూతను పంపాడు. దేవలుడిది విని అదరి పడ్డాడు. ఇందాక నందిధ్వజాన్ని కొని పోయిన వాడెవ్వడు? ఎవ్వడో అసురుడై ఉండాలి. ఎంత మోసం జరిగింది? అని కవచం తొడుగుకొని వెంటనే యుద్ధభూమికి వచ్చాడు.

అప్పటికే వజ్రదంష్ట్రుడు నందిధ్వజాన్ని దేవసేనపై ప్రయోగించాడు దానిశస్త్రాస్త్రాలకు, యంత్రవృషభాలకు దేవత లెందరో దారుణంగా మృత్యువుపాలయ్యారు. మరెందరో భీతావహులై చెట్టు కొకడు పుట్టకొకడుగా పారిపోతున్నారు. దేవలుడు దేవతలారా! నేను వచ్చాను. నిలువండి అంటూ అధిజ్య శర శరాసనుడై నంది ధ్వజంవైపు వచ్చాడు. అది జడ యంత్రం కనుక, తన యజమాని అనుకొనక శస్త్రాస్త్రాళతో చుట్టుకొన్నది. దేవలుడేమి చేయలేక శివ ధ్యానంతో చేతులు కట్టుకొని నిలబడ్డాడు. రాక్షసులు బిలబిలమంటూ వచ్చి దేవలుని బంధించి వీర మాహేంద్ర పట్టణానికి కొనిపోయారు. ఇది ఆనాటి రంభా శాపప్రభావం. విధి అనుల్లంఘనీయం గదా!

వారు దేవలుని మంచి చేసికొంటే తమకు ఉజ్జ్వల భవిష్యత్తుంటుందని భావించారు. అందుకనే కారాగారంలో చేర్చలేదు రాచనగరులోనే ఉంచారు. వారింకను స్నేహహస్తంచాపి దేవలునికి రాజలాంఛనాలతో సమస్త గౌరవ మర్యాదలు జరిపారు. అసురేశ్వరుడు కులవృద్ధుల సమక్షంలో ఉభయులం వియ్యపువారం కావాలని సకల సద్గుణ సంపన్నురాలు, విదుషీమణి, అతిలోక సౌందర్యవతియైన తన పుత్రికను పద్మినిని భార్యగా స్వీకరింపుమని ప్రార్థించాడు. దేవలుడు తట పటాయిస్తుంటే అగ్నిదేవుడు ప్రత్యక్షమై రాజేంద్రా! ఈ బిడ్డను నీకు నేనిస్తున్నాను. అని పద్మిని చేతిని దేవలుని చేతులలో పెట్టాడు. నాటినుండి వజ్రదంష్ట్రుని కూతురు పద్మిని

అగ్నిదత్తగా పేరొందినది అగ్నిదేవునిచే దత్తం చేయబడింది గనుక అగ్నిదత్త అనేపేరు అన్వర్థముయింది.

దేవలుడు వీర మాహేంద్ర పట్టణంలో మామగారి ఇంట ఉంటూ అగ్నిదత్తతో ప్రణయ జీవితం ప్రారంభించాడు. రాక్షసులకు వస్త్రాలిచ్చాడు. విధిలీలలు అనూహ్యములు. ఏక్షణానికి ఏమి జరుగుతుందో ఎవ్వరూహించలేరు. అందరూ దైవం చేతిలో కీలుబొమ్మలే. అయినా ఆటలో స్వాతంత్ర్యం లేక పోలేదు. నదీ ప్రవాహజలం పల్లానికి పోతున్నా మనకిష్టమైనచోట గట్టుకు గండి గొట్టి కాల్వను తెచ్చుకొని జలం పంట భూములకు పెట్టుకొంటాము గదా! దేవలుడు రాక్షసుల చేతికి చిక్కినా అతని మంచితనం అతనికి మంచిగానే పరిణమించింది. నవ్వేముఖం అద్దంలో నవ్వుతున్నట్లే కనిపిస్తుంది, ఏడ్చేముఖం ఏడుస్తున్నట్లే కనిపిస్తుంది. దేవలుని సాహచర్యంచేత రాక్షసులలో పూర్వపాప జీవనం పోయి పుణ్య జీవనం నవజీవనం ప్రారంభమైంది చందన వృక్ష సమీప మందలి ఇతర వృక్షాలు చందన గంధ వాయువులు సోకి పరిమళిస్తాయి గదా! పూలకు కట్టిననార సౌరభం పొందుతుంది గదా!

దేవలుడు అగ్నిదత్తవలన శ్యాలుడు, హలుడు, బలుడు అను పేరులుగల ముగ్గురు కుమారులను కన్నాడు. బిడ్డలు పెద్దవారైన తర్వాత వారిచే బహువిధ వర్ణాంబరాలను నేయించి అసురలోకానికిప్పించాడు. తన కన్నివిషయాలలో ప్రతి బింబాలుగా ఉన్న ఆ కుమారులను తాతగారింట ఇల్లడముంచి మామగారి అనుమతితో నందిధ్వజం తీసికొని ఆమోద పట్టణానికి వచ్చాడు. ఇన్నేళ్లకు తిరిగి వచ్చిన ప్రభువును జూచి నగరలక్ష్మి పురి విప్పిన నెమలిలా ఆనంద తాండవం చేసింది. విశీర్ణ జీర్ణపర్ణయైన శిశిరలత మలయమంద మారుత స్పర్శకు చిగురించినట్లు కృశాంగియైన దేవదత్త క్రొత్త

ఊపిరిపోసికొన్నది. ఆమె కనులలో ఆనంద జ్యోతులు వెలిగాయి. పేదకు పెన్నిధి దొరికినట్లు పుత్రులు పరమానంద భరితులయ్యారు. ఇట్లు దేవలుడందరి మన్ననలతో రాజ్యపరిపాలనా నిమగ్నుడయ్యాడు.

## దేవలుని అవతార సమాప్తి

అతడొకనాడు కైలాసగిరికి వెళ్లాడు. అచట శివుడు దేవలుని జూచి కోపంతో ఓరీ తెలివిమాలినవాడా! నేను నీకు నందిధ్వజమీయడం ఇతరులవశం చేయడానికేనా? నందిధ్వజాన్ని దుర్విని యోగ పరచావు దేవతల మరణానికి కారకుడవయ్యావు. నీ విక బ్రతుకరాదు. త్వరలో విద్యాధరుడవై జన్మిస్తావని శపించాడు.

దేవలుడు ఇదీ తన అవతార పరిసమాప్తికి నాంది అనుకొన్నాడు, శాపంగూడ వరంగా భావించాడు. అతడు తిరిగి ఆమోద పట్టణానికి వచ్చి కుటుంబ సభ్యులను మంత్రులను పిలిపించి నిజ సాయుజ్యమోక్షస్థితి, వస్త్రసృష్టికై తనజననమూ, ఇకతానెత్తే సప్తావతారముల వివరమూ వారికిచెప్పాడు ఆయన తన కవసానసమయం సమీపించినదని శివధ్యానం చేస్తూ చేస్తూ మృత్యువునాహ్వానించాడు. అప్పటి కప్పుడే దేవలుడు లింగీభూతుడయ్యాడు. పెద్దకొడుకు దివ్యాంగుడు రాచనగరులోనే దేవాలయం కట్టించి తండ్రి శివలింగమూర్తిని ప్రతిష్ఠించి రామలింగేశ్వరుడనే పేరుపెట్టి పూజాకార్యక్రమాలు జరుపుతూ రాజ్యపాలన నిర్వహిస్తూవచ్చాడు ఆ కుమారుల వలననే దేవాంగ సంతతి తామర తంపరై దేశదేశాలకు ప్రాకి వ్యాప్తి చెందింది.

## అష్టాదశాధ్యాయం సమాప్తి

అనాటినుండి అఖిల దేవాంగులకు శ్రీరామలింగేశ్వరస్వామి కులదైవంగా, శ్రీరామలింగ చౌడేశ్వరీదేవి కులదేవతగా ఆరాధ్యులయ్యారు. దేవలుడు హస్తకళయైన నేతపనియందేగాక సకలవేదోపనిషచ్ఛాస్త్ర శస్త్రాస్త్రవిద్యలలోగూడ అనమానుడవి పించుకొన్నాడు శివపారమ్యాన్ని నిరూపిస్తూ అనేక గ్రంథాలు రచించాడు. అంతేగాక కాశీక్షేత్రంలో, శ్రీశైలంలో, హంపీ హేమకూటంలో, అరుణాచలంలో, శంభుశైలంలో గాయత్రీ పీఠాలు నెలకొల్పి శివాద్వైత మతప్రచారం కోసం వరుసగా రేవణాచార్యులను, మరుళాచార్యులను, పండితాచార్యులను, గగనాచార్యులను, ఏకోరామాచార్యులను నియమించాడు. వీరు జగద్గురువులై శైవమతాన్ని విశ్వవ్యాప్తం చేయడానికి కృషిచేశారు. ఇంకా దేవలుడు ఆమోదపట్నం, వెలుగొండ, నగరి, ముదునూరు, పడవేడు మున్నగుప్రాంతాలలోగూడ గాయత్రీ పీఠాలను ప్రతిష్ఠించి శ్రీ చౌడేశ్వరీదేవి అమ్మవారి సేవార్థం కుల గురువులను నియమించి దేవాంగ వంశోన్నతికి అవకాశంకల్గించాడు

## దేవలుని సప్తావతారాలు

దేవలుడు శివుని ఆజ్ఞా ప్రకారం సప్తావతారాలు ఎత్తినట్లు దేవాంగ పురాణం విశదీకరిస్తున్నది.

" విద్యాధర శ్చిత్రయోగి- సాధుకః పుష్పదంతకః
బేతాళో వరరుచిర్దాసో- దేవాంగః సప్తనామకః "

దేవలుడు లింగీభూతుడైన తర్వాత విద్యాధరుడు, పుష్పదంతుడు, బేతాళుడు, వరరుచి, చిత్రయోగి, దేవశాలి దేవదాసుడు అనే నామాలతో వరుసగా జన్మించాడు.

1) దేవలుని ప్రథమావతారం విద్యాధరుడు. ఈతడు బ్రహ్మ వంశ సంజాతుడైన హేమవర్ణునివలన ఇందుముఖికి కమలాక్షుడనే

పేరుతో జన్మించాడు. ఈకమలాక్షుడు చతుష్షష్టి కళలందేగాక, లౌకికాలౌకిక విద్యలందును ప్రవీణుడై "విద్యాధర" అన్వర్థనామం పొందాడు ఈతడు విద్యాగర్వంతో దురహంకారియై ఒకనాడు సాధుపురుషుడైన విపిత్సుని ఘోరంగా పరాభవించి శివపార్వతుల క్రోధానికి గురిఅయ్యాడు. అల్పవయస్కుడుగానే అవతారం చాలించాడు. పూజ్యులను అవమానించినవారికి, పెద్దల మనస్తాపానికి కారణమైనవారికి పతనం తప్పదని దీనివలన తెలుస్తోన్నది. దేవలుడు విద్యాధర రూపంలో ఉండి రచించిన గ్రంథాలు 1. ఋగ్వేద భాష్యం, 2. మానవధర్మ సూత్రం, 3. సంధ్యాసూత్రం, 4. మనుస్మృతి, 5. దేవలోపనిధి. 6. మనుజ్ఞాన శిఖామణి, 7. దేవల జైమిని సంవాదం, 8. దేవరాజచ్ఛందం, 9. వర్ణాశ్రమ మహోదధి, 10. బ్రహ్మసూత్ర నిఘంటువు.

2) దేవలుని ద్వితీయావతారం పుష్పదంతుడు. ఈతడు యుగంధర దేశాధీశుడైన శ్రుతకీర్తి మహారాజువలన సోమవతికి జన్మించాడు. సింధురాజ పుత్రికగా ఉద్భవించిన దేవదత్తను పరిణయమాడాడు. పుష్పదంతుడు రాజ్యభోగాలు అనుభవిస్తుండినా పూర్వజన్మ వాసనా విశేషంచేత మహాశివభక్తుడై పదునొకండువేల శివలింగాలను ప్రతిష్ఠించాడు. ప్రతి దినారంభవేళ ఆశివలింగాలను పూజించి రాజకార్యాలు నిర్వహించేవాడు. శివపూజకు విశ్వంలోని పూలచెట్ల రకాలన్నిటిని ఒకచోట చేర్చి దివ్యోద్యానవనం పెంచాడు.

ఈతని శివ మహిమ్నస్తోత్ర రచనకు మెచ్చి శివుడు అనుదిన దర్శనభాగ్యం కల్పించాడు. అందువలన దేవదత్తా పుష్పదంత దంపతులు ప్రతిదినం కైలాసంవెళ్లి గౌరీశంకరులకు పుష్పమాలా కైంకర్యం చేస్తుండేవారు. ఒక అపూర్వ కథాకథన విషయంలో పరమశివుడు కినిసి బేతాళుడవుకమ్మని పుష్పదంతుని శపించాడు.

పగలు హరిణి (లేడి) రేయి యక్షిణి కమ్మని దేవదత్తనుశపించాడు పుష్పదంతుని రచనలు. 1 దేవీభాగవతం, 2, దేవరత్నాకరం 3 మేరుచరిత్రం, 4 వేదాంతాంకుశం, 5 బ్రహ్మోపదేశ సిద్ధాంతం 6 దేవరాజ సుశేఖరం. 7 సుజ్ఞాన దీపిక, 8 శివమహిమ్నస్తోత్రం, 9 ఉత్తరమీమాంస, 10 అగ్నిసూక్తం మొదలైనవి.

3) దేవలుని తృతీయావతారం బేతాళుడు. ఈతడు ఉజ్జయినీ నగర ప్రాంతారణ్య మూలప్రదేశంలో ఒక పెద్దమఱ్ఱిచెట్టును ఆశ్రయించి ఉండేవాడు. బేతాళుడు అధర్వణ వేదమంత్ర పండితుడుగా, బల విద్యాప్రదర్శనలకు ప్రామాణిక అధిదేవతగా ఉండేవాడు. ఆమధ్యారణ్యంలో దేవదత్త పగలు లేడిగా ఉంటూ. రాత్రి యక్షిణియై వీణమీటుతూ శివగీతాలాపనతో ప్రొద్దులు పుచ్చుతుండేది. కొంతకాలానికి బేతాళుడు, యక్షిణి విక్రమాదిత్యునివలనశాపవిముక్తులయ్యారు. బేతాళుని రచనలు 1 చతుష్షష్టి కళాసూత్రం, 2 ధనుశ్శాస్త్రం, 3 బేతాళ పంచతంత్రం, 4 బేతాళాఖ్యానం, 5 భూసూక్తం, 6 స్మరశాస్త్రం, 7 మల్లసాధన నిర్ణయం, 8 మహాభైరవ సూక్తం, 9 మంత్రశాస్త్రం, 10 మంత్రనిఘంటువు మొ॥నవి.

4) దేవలుని చతుర్ధావతారం వరరుచి. నారదుని ప్రేరణచే శివాజ్ఞ స్వీకరించి దేవలుడు వరరుచి నామంతో భూలోకానికి అవతరించాడు. అప్పటికి లోకం దుస్సంప్రదాయాలతో, దుశ్శబ్ద ప్రయోగాలతో కుమ్ముదుమ్ముగా ఉంది. వరరుచి వచ్చి పురాణ కావ్య నాటక సంప్రదాయ పద్ధతులను పునరుద్ధరించాడు. పాణిని వ్యాకరణానికి వార్తికాలు వ్రాసి సుశబ్ద ప్రామాణ్యాన్ని నిరూపించాడు. ఆనాడు వరరుచి పరమాచార్యుడై సంస్కృత ప్రాకృత సాహిత్య వాఙ్మయ సముద్ధరణకు కంకణం కట్టుకొన్నాడు. ఆనాటి సారస్వతాకాశంలో ధ్రువతారలా ప్రకాశించాడు. వరరుచి రచితగ్రంథాలు

1 సూత్రతత్త్వనిఘంటువు, 2 గణితశాస్త్రం, 3 చంద్ర సిద్ధాంతం, 4 సూర్య సిద్ధాంతం, 5 త్రిలింగ శాస్త్రం, 6 దత్తమీమాంస 7 శ్రుతి షట్ సూత్ర నిర్ణయం, 8 కౌముదీ శబ్దశాస్త్రం, 9 వస్త్వాయుర్నిర్ణయ శాస్త్రం, 10 భాగశాస్త్రం, 11 యోనితంత్రం, 12 పిండోత్పత్తి శాస్త్రం, 13 ఛందోజ్ఞం, 14 సంధిసూత్రం, 15 కాణాదన్యాయ బోధిని, 16 నరపింగళి శాస్త్రం 17 లక్షణదర్శనం, 18 స్వర శాస్త్రం, 19 వేదాంగమాల, 20 ఆయుర్వేదం 21 ప్రాకృత ప్రకాశం మున్నగునవి.

5) దేవలుని పంచమావతారం చిత్రయోగి. ఈతడు సింధు కటకేశ్వరుడైన భల్లాణునికి రాజగురువగు విద్యాదర్పునివలన ధర్మాంగికి జన్మించాడు. ఈచిత్రయోగి సింధుకటక నగరం కేంద్రంగా శివాద్వైత మతప్రచారం సాగించాడు. భల్లాణునిచే ఇష్టదానవ్రతం చేయించి తరింపజేశాడు. చిత్రయోగి ప్రణీత గ్రంథాలు. 1 మను కల్పం, 2 మంత్రశాస్త్రం, 3 నిగమాంత మహోదధి, 4 దేవల జయస్తంభం, 5 మనుశిల్పం, 6 సద్వేదాంత కుఠారం, 7 దేవలాఖ్యానం, 8 శంభు శిఖాసూత్రం, 9 గాయత్రీ భాష్యం, 10 దేవ స్మృతి, 11 ప్రణవసూక్తం, 12 పంచయజ్ఞ నిర్ణయం, 13 యజ్ఞోపవీతసూక్తం, 14 సంధ్యాబాష్యం, 15 దేవీమాహాత్మ్యం, 16 రుద్ర భారతం, 17 గిరిజోద్వాహం మొదలగునవి.

6) దేవలుని షష్ఠావతారం దేవశాలి. లోకంలో జైన బౌద్ధ పాషండ మత విజృంభణం ఒక ఉప్పెనలా విరుచుకపడింది. అపుడు దేవలుడు శివాజ్ఞచే ఆమోదపట్టణాధీశ్వరుడైన దేవాంగరాజు విద్యావిలాసునివలన విద్యావాణి గర్భ శుక్తి ముక్తాఫలంగా ప్రభవించాడు. కల్యాణపుర జైనరాజ్యాన్ని శైవరాజ్యంగా మార్చాడు. బౌద్ధులను పాషండులను తన అనుయాయులనుగా చేసికొన్నాడు.

దేవశాలి రచనలు. 1 ప్రామాణ్యవాదం, 2 సుజ్ఞానదీపిక, 3 జ్ఞాన మంజరి, 4 సుజ్ఞానరత్నమాల, 5 సద్వాద జ్ఞానమంజరి, 6 పంచ శిఖా నిర్ణయం, 7 దేవకల్పాత్మ దర్పణం, 8 పూర్వాపర ప్రయోగం 9 దేవరహస్యకం, 10 సత్కర్మ జ్ఞానబోధకం. ఇత్యాదులు.

7) దేవలుని సప్తమావతారం దేవదాసు, ఈతడు ఆమోదపట్టణాధీశ్వరుడైన వీరరుద్ర దేవాంగ భూపతికి జన్మించాడు. ఈదేవదాసు అనేక బౌద్ధులను బౌద్ధ గురువులను శైవులనుగా మార్చాడు. దేవదాసు శైవమతానికి జీవనాడిగా పనిచేశాడు శివుడే పరాత్పరుడని సర్వవ్యాపియని పరమాత్మయని జగత్కర్త. భర్త, హర్తయని చీమచేత పలికించాడు. శివునివాక్కు వినిపించాడు. కొందరు అది గారడీయని విమర్శిస్తే శిలగా ఉన్న శివలింగంలోగూడ ఆ మాటలు ధ్వనింపజేశాడు. ఒకడు పరీక్షించాలని కుండలో పామునుదాచి ఏముందో చెప్పమంటే, సర్వవ్యాపకుడైన స్వామి నాగాభరణుడై ఉన్నాడని తీయించి ఆరూపాన్ని చూపిన మహిమాన్వితుడు. ఆయన ఏమంటే అదవుతుండేది, భగవంతుడు గొప్పా ? భక్తుడు గొప్పా ? అనే ప్రశ్న ఈదేవదాసుతోనే పుట్టింది. ఇంటికి ఎంతమందిఅతిథులు వచ్చినా విబూదిపంచి ఇష్టమృష్టాన్నములుపెట్టి దక్షిణ తాంబూలాలిచ్చి పంపేవాడు. వివిధ వస్త్రాలు. యజ్ఞోపవీతాలు, మంగళ సూత్రాలు ఉచితంగా ఇచ్చేవాడు. ఒకప్పుడు దేవదాసు మూడువందల అరువది మూరలపొడవున్న అపూర్వ దివ్య రత్నాంశుకంనేశాడు. చూడటానికి వచ్చిన వారెవ్వరు దానికివెలగట్టలేకపోయారు తననే శివార్పణం చేసికొన్నవాడు అమూల్యమైన అవస్త్రాన్ని అన్యులకమ్ముతాడా? ఆయన శ్రీశైలంవెళ్లి ఆలయ ధ్వజపటంగా సమర్పించాడు. శ్రీశైల మల్లికార్జునస్వామికి తలపాగా చుట్టడం దేవలావతారమైన ఈదేవదాసుతోనే ప్రారంభమైంది. నేటికిని మహాశివరాత్రి నాడు స్వామివారికి మూడువందల అరవై మూరల తలపాగానేసి

చుట్టే అధికారం దేవాంగులదై ఉన్నది. ఆ తలపాగా కార్యక్రమం ముఖ్యంగా ప్రకాశంజిల్లా చీరాల పట్టణ సమీప గ్రామాలలోని దేవాంగులు ప్రస్తుతం నిర్వహిస్తున్నారు. ఈదేవదాసు గాయత్రీ పీఠాలకు నవజీవనం కల్పించి శివాద్వైత మతప్రచారం ముమ్మరంగా సాగించాడు. ఈయన గ్రంథములు. 1 అంబాస్తుతి, 2 గురు స్తోత్రం. 3 శృంగార నిర్ణయం, 4 తంతుసూత్రం, 5 శ్రవణాంకుశం, 6 కాలజ్ఞానం, 7 ఏకవింశతి దీక్షావిధి, 8 లక్షణ నిర్ణయం, 9 పండితారాధ్య చరిత్ర, 10 శైవసిద్ధాంతం, 11 ప్రభుశిఖారత్నం 12 మూలస్తంభన భాష్యం, 13 వీరాగమ వ్యాఖ్యానం, 14 శైవాగమటీక మొదలైనవి. దేవదాసు తనపుత్రుడైన ఏకోరామ అపరనాముడైన కుమార విరూపాక్షునికి రాజ్య పట్టాభిషేకం చేశాడు. కేంద్ర గురుపీఠాధిపత్య మిచ్చాడు. చివరికి వయసుపండి తొడిమనుండి జారు పండువలె పరమశివ యోగానుభూతితో తాను హృదయపద్మ కోశాంతర ఆత్మతేజస్సును సహస్రార కమలానికి తెచ్చుకొని బ్రహ్మరంధ్ర విదళనంతో ఉద్గమించి శాశ్వతానంద సంధాయకమైన పూర్వపు పరమశివ సాయుజ్య మోక్షం పొందాడు.

ఈ దేవల సంతతి పరంపరవారే దేవాంగులు. వీరు మొదట నూటరెండు ఋషిగోత్రాలు కలవారుగా ఉన్నారు. తరువాత పదునైదువందల ఋషిగోత్రాలవారయ్యారు. ఆపై పదివేలఋషిగోత్రాలవారయ్యారు. ఇంకను క్రమక్రమంగా మూడులక్షల ఏబదివేల యిండ్లవారుగా వృద్ధిచెందారని పురాణం చెవుతోన్నది.

దేవాంగులందరూ సద్యోజాత ప్రవర, ఋగ్వేదశాఖ, ఆయా ఋషిగోత్రం, ఆశ్వలాయన సూత్రం కలవారై ఆసేతు హిమాచల పర్యంతం ఈ భరతఖండంలో నానారాష్ట్రాలయందు వ్యాపించి వయన వాణిజ్య జీవనులై ప్రవర్తిల్లుచున్నారు. ఇది దేవల మను బ్రహ్మ చరిత్ర.

ఇందు దేవలుని జన్మకథ వివరంగా చెప్పాను. సప్తావతారాల కథలు నామసూచనా మాత్రంగా చెప్పాను. విష్ణుమూర్తి దశావతార కథలవలె దేవల మనుబ్రహ్మ సప్తావతార కథలు మిక్కిలి పవిత్రములైనవి. అత్యంత ప్రాధాన్యములైనవి. లోకకల్యాణ కరములైనవి. ఈ దేవలమహర్షి కథలు చదివినవారికి, చెప్పినవారికి, వినినవారికి ఇహపర సౌఖ్యాలు సిద్ధిస్తాయి అన్నాను.

దేవాంగుడైన ప్రతివానికి యజ్ఞోపవీతం ఉండి తీరుతుంది. ఉండకపోతే యజ్ఞోపవీతం ఇతరులకిచ్చే అర్హత కోల్పోతాడు. పూర్వం లింగాయతులైన కన్నడ బసవేశ్వరులు లింగధారణమేగాని యజ్ఞోపవీతం అవసరంలేదని కొందరిని దేవాంగులను దారిమరలించారు. అప్పుడు శ్రీ ముద్దుసంగ మహాముని ఫణిగౌడాది శిష్యులతో శాలిశక. 1293 (క్రి. శ. 1371) పరీధావినామ సంవత్సర మార్గశిర శుద్ధ పంచమీ గురువారమున విజయనగరాధిపులైన శ్రీ వీరప్రతాప భూపతిగారి సభకువచ్చి వేదశాస్త్ర పండితుల సమక్షంలో బసవేశ్వరులను జయించి యజ్ఞోపవీతధారణ ప్రాధాన్యమును సిద్ధాంతీకరించారు. అందుకు రాజుగారు మెచ్చి శ్రీవారికి హంపీహేమకూటమందు పూర్వప్రదేశంలో మఠమును కట్టించియిచ్చారు. ముద్దుసంగమహర్షి గాయత్రీపీఠాన్ని పునరుద్ధరించారు. తదాదిగా హంపీహేమకూట గాయత్రీపీఠ గురుపరంపర ఇట్లున్నది 1 శ్రీ ముద్దుసంగమహాముని 2 ముద్దుసంగమహాముని, 3 ముద్దుసంగమహాముని, 4 ముద్దుసంగ మహాముని, 5 ముద్దుసంగమహాముని, 6 ముద్దుసంగమహాముని, 7 శ్రీ శంకరస్వామి, 8 శ్రీ శ్రీకంఠస్వామి. ఇది ఒకప్రాచీన గ్రంథంలోనిది. "వాగ్గేయకారహర్యక్ష" శ్రీ కట్టా అచ్చయ్యగారి శ్రీ చౌడేశ్వరీ శతకమునుండి గ్రహింపబడిన గురువులు 1 శ్రీ ముద్దుసంగ మహర్షి, 2 సాంబలింగస్వామి, 3 మాధవాచార్యులు. 4 సాంబ లింగస్వామి, 5 నల్లాచార్యులు, 6 నాగాచార్యులు, ఈయన పుత్ర

త్రయం- 7 ముద్దులింగం, 8 రుద్రముని, 9 సోమలింగం, నాగాచార్య దత్తపుత్రుడు 10 కుమారస్వామి, 11 నాగలింగస్వామి మొదలగువారు.

అప్పుడు కోటసువర్ణలత నాన్నా! ఈ కథలు వింటానికెంతో బాగున్నాయి. ఇవి ఇలా చెప్పినట్లే వ్రాసిఉంటే ఎప్పుడైనా మేము చదువుకొంటాము ఆనందిస్తాము దేవాంగ వంశ మూలపురుషుడు దేవల మనుబ్రహ్మ అని గుర్తుంచుకొంటాము. ఇతరులకు చెప్ప గలుగుతాము గదా! అన్నది. అలాగే మీకోసం ఇతరులకోసం వ్రాస్తానన్నాను. ఆ అమ్మాయి మరల నాన్నా! కవిరాజు కడెము వేంకటసుబ్బారావు అని పేరుకీర్తులు పొందావుగదా! కనకాభిషేకం పొందావుగదా! నీవు పూర్వ గ్రంథాలవలె పద్యాలలో శ్లోకాలలో వ్రాస్తే మాకేమి అర్థమౌతుంది? అన్నది. నేను మీకు ఇపుడు చెప్పినట్లే వ్యావహారిక భాషలో వచనంగానే వ్రాస్తాను. పిల్లలకు పెద్దలకు ముద్దుగొలిపేటట్లు వ్రాస్తాను. పదవ తరగతి విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని వ్రాస్తాను. సంభాషణా పద్ధతిలో కవితా లక్షణాలు అక్కడక్కడ తళుక్కున మెరసేటట్లు వ్రాస్తాను. సన్నజాజుల పరిమళంలా హృదయం పరవశించేటట్లు వ్రాస్తాను. అన్నాను. కుల వృద్ధుల గుణవృద్ధుల ఆశీర్వాదంతో వ్రాశాను. అదే ఇది. రసజ్ఞుల కరకమలములందు ఉంచుతున్నాను.

" ఓం తత్ సత్ "

  